# యువత

(యువతరం సమస్యలపై విభిన్న దృక్పథాల సమాలోచనం)

వ్యాస సంకలనం

యువభారతి రజతోత్సవ ప్రచురణ

సంపాదకులు

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం

ఆచార్య వంగపల్లి విశ్వనాథం




యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001

**YUVATHA** - an anthology of essays written in Telugu by eighteen scholars on Problems and Prospects of Indian Youth - Edited by *Prof. G.V. Subrahmanyam,* Professor of Telugu, University of Hyderabad and *Prof. V. Viswanadham,* Professor of Commerce, Osmania University.



Yuvabharathi Silver Jubilee Publication

Publication : 127

First Edition : March, 1991

Copies : 1000

Cover Design : Sri Seela Virraju

Price : Rs. 25

Printed at:
Vipla Computer Services
Balaji Bhagyanagar Apartments
Veg. Market Lane, Nallakunta
Hyderabad - 500 044
Ph: 67476

For copies:
**YUVABHARATHI**
(A Literary & Cultural Organisation)
Andhra Saraswatha Parishad Buildings,
Tilak Road, Hyderabad - 500 001



ఇరివెంటీ! మీ హృదయం అక్షరాల కంకితం
అక్షరాలు ఆరిపోని వెలుగులకే అంకితం
ఆవెలుగులు నవభారత దేశయువత కంకితం
అందుకనే యువభారతి 'యువత' మీకు అంకితం

— డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్యులు



# యువభారతి
## రజతోత్సవ సాహితి – యువత

సమాజంలో సాహిత్య చైతన్యాన్నీ, సదవగాహననూ పెంపొందిస్తూ ఉత్తమ సామాజిక, సాంస్కృతిక, సాహిత్యపు విలువలను సహృదయులకు సరళంగా, ఉపయోగకరంగా అందించటంలో యువభారతి కడచిన ఇరవైయేడేళ్ళుగా చేస్తున్న కృషి తెలుగువారికి బాగా తెలిసిందే. 1990 విజయదశమి మొదలు 1991 విజయదశమి వరకూ యువభారతి రజతోత్సవ కార్యక్రమాలను నిర్వహించుకొంటున్నది. ప్రతినెలా మొదటి ఆదివారం సాయంకాలం 'సమాలోచనం' కార్యక్రమాన్ని – ప్రధానంగా యువతరం సాహితీ వేదికగా, వివిధాంశాలమీద వివిధ దృక్పథాల సమాలోచనంగా, చైతన్య వాహికగా సాగిస్తున్నది.

యువభారతి కార్యక్రమాలన్నీ చాలవరకు యువతను దృష్టిలో ఉంచుకొని రూపొందించినవే. 'లహరి' కార్యక్రమాలు ప్రాచీన, ఆధునిక సాహిత్యాలను యువకులకు పరిచయం చేసే సరళ ఉపన్యాసవ్యాసలహరులే. రచన, మహతి, ఫ్రీ ఇండియా ఫోర్జెస్ ఎహెడ్, నవల, రామాయణ సుధాలహరి, ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం (1980-90), సాహితీ వైభవపరంపరలూ, మొదలైన ప్రచురణలన్నీ యువతకోసం ఈయుగ చైతన్య సమాలోచనం కోసం ఉద్దేశింపబడ్డాయి. తెలుగువారి ఆదరాభిమానాలను బాగా చూరగొన్నాయి. 'యువత' కూడా ఆ లక్ష్యంతో వెలువడుతున్న వ్యాస సంకలనమే.

యువభారతికి పదివసంతాల్లు నిండిన సందర్భంలో ఈ శతాబ్దపు ఏడవ దశకంలోని యువతరం సమస్యలపై విభిన్న దృక్పథాలు కలిగిన రచయితలతో వ్యాసాలు వ్రాయించి ప్రచురించాలని 'యువత' ప్రణాళికను రూపొందించాం. ఇరవైనాలుగంశాల మీద సంగ్రహసార పత్రం (సినాప్సిస్) కీ.శే. ఇరివెంటి కృష్ణమూర్తి గారి దర్శకత్వంలో తయారుచేసి రచయితలకు మనవి పత్రాలతో కలిపి పంపాం. యువభారతిమీది అభిమానంతో వారు విలువైన వ్యాసాలు వ్రాసి పంపారు. వాటిలో విషయ వైవిధ్యాన్నీ, సమస్యల చర్చలనూ, పునరుక్తి రాహిత్యాన్నీ, సామాజిక ప్రయోజనాన్నీ, సాహిత్యపు విలువలనూ దృష్టిలో ఉంచుకొని పద్దెనిమిది వ్యాసాలను కలిపి రజతోత్సవ ప్రచురణగా వెలువరిస్తున్నాం. ఇక్కడ ఒక్క మనవి.

'యువత' వ్యాసాలు 1973లో వ్రాయబడినవి. కొన్ని అనివార్యమైన ఆర్థిక కారణాలవలన వీటి ప్రచురణ ఆలస్యమైంది. 1985లో అంతర్జాతీయ యువజన వత్సరోత్సవాల సందర్భంగా ఫిబ్రవరి 10 వ తేదీన యువభారతి శ్రీ గుజరాతి ప్రగతి

సమాజ్ ప్రగతి మహావిద్యాలయంవారి సంయుక్తాధ్వర్యంలో 'యువత' గోష్ఠికార్యక్రమాన్ని నిర్వహించింది. అందులో 500 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. అప్పుడే 'యువత'ను ప్రచురించాలని ప్రయత్నించాం. కాలం కలిసి రాలేదు. ఇప్పుడు, ఆలస్యంగానైనా, అందిస్తున్నందుకు ఆనందిస్తున్నాం. 'యువత' కోసం ప్రచురణ పూర్వ విరాళాలు ఇచ్చారు ఎందరో. వారందరికీ ఈ ఆలస్యం వలన కలిగించిన అసౌకర్యానికి క్షమాపణలు చెప్పుకొంటున్నాం. ఇకముందు ఇటువంటి జాప్యం జరుగకుండా జాగ్రత్తలు తీసుకొంటాం. మీ సహకారం సదా అందించ ప్రార్థన!

'యువత' వ్యాసకర్తలు మూడు తరాల వారు. ఒక్కొక్కరూ వారి వారి రంగాలలో సుప్రసిద్ధులు. యువభారతి ప్రార్థనను మన్నించి వ్యాసాలు పంపి ఈ ఉద్యమాన్ని ప్రోత్సహించారు. వారందరికీ మా కృతజ్ఞతలు. ఇంకా ఎందరో మహానుభావులు అందరికీ వందనములు! పదిహేడేళ్ళ తరువాత 'యువత' వెలువడడంతో కొందరు వ్యాసకర్తలు ఇప్పుడు మనమధ్య లేరు. వారికి మా నివాళులు. మా యువభారతిని తమ అక్షరాశీస్సులతో ప్రోత్సహిస్తున్న అప్పటి యువతరంరచయితలు ఇప్పుడు ప్రౌఢతరంవారై ప్రౌఢులు వృద్ధులై, మన మన్ననలు అందుకొంటున్నారు. వారికి మా కృతజ్ఞతాభివందనాలు. ఆర్థికంగా తోడ్పడిన ప్రకటనదారులకు, ముఖపత్రచిత్రకారులు యువభారతి సన్నిహితులు శ్రీ శీలా వీర్రాజుగారికి, ముద్రాపకులు శ్రీ విజయసేనారెడ్డి గారికి, 'విప్లా కంప్యూటర్ సర్వీసెస్' వారికి కృతజ్ఞతలు.

'యువభారతి రజతోత్సవ సంఘం' ఏర్పడింది - 'వాస్తుశిల్పి' శ్రీ బి.యన్.రెడ్డిగారి ఆధ్యక్ష్యంలో సముచిత స్థాయిలో ఉత్సవకార్యక్రమాలను రూపొందిస్తున్నాం. మీ అందరి సహాయసహకారాలను కోరుతున్నాం.

'యువత' ను అన్నివిధాలా రూపుదిద్ది, దాని ఆవిష్కరణానికంటే ముందే కన్నుమూసిన అమృతమూర్తి, యువభారతి మాజీ అధ్యక్షులు, కీ॥శే॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారి స్మృతికి ఈ గ్రంథం అంకితం.

**జి.వి. సుబ్రహ్మణ్యం**

హైదరాబాదు
3-3-1991

# విషయసూచిక

# యువత – సమాజం

మామిడిపూడి వెంకటరంగయ్య

సమాజం, దాని స్వరూప స్వభావాలు అవగాహన చేసుకోవడానికి రెండు విధాలుగా యువతరాన్ని లెక్కకు తీసుకొనడం అవసరం. మొదటిది - సమాజంలో స్త్రీలు, పురుషులు, ధనికులు, ధనహీనులు, స్పృశ్యులు, అస్పృశ్యులు, సనాతనులు, అధునాతనులు, కాంగ్రెసువారు, కమ్యూనిష్టులు, జనసంఘం వారు, ఇతర రాజకీయ పక్షాలవారు ఉన్నట్లే యువతరంలోకూడా ఈ విభేదాలు ఉన్నాయి. యువతరం సమాజాన్ని సర్వవిధాల ప్రతిబింబిస్తుంది. యువతరంలోని వారంతా ఒకే దృక్పథం కలవారని, ఒకే మార్గాన నడిచేవారని అనుకోరాదు. రెండవది - ఇప్పటి యువతరంవారు రేపు మధ్య వయస్కులై సమాజంలోని వివిధ రంగాలలో సారధ్యం వహించి పని చేయవలసినవారు, యువకులుగా వారు ఈ సారధ్యాన్ని నిర్వహించుటకు అర్హత సంపాదించవలసి ఉన్నది. ఈ అర్హతను సంపాదించినటట్లైతే వారు సారధులుగా సమాజాన్ని సొష్టవంగా నడుపగలుగుతారు. సంపాదించనిపక్షంలో సమాజం క్షీణిస్తుంది. ఇందుచేత వారిని ప్రత్యేకంగా లెక్కకు తీసుకోవలసిఉన్నది.

సమాజంలో సర్వకాలాలలో - నిన్న, నేడు - యువతరంవారు నిర్వహించవలసిన పాత్ర ఒక్కటే. తరాతరాలుగా సమాజం సేకరించి రూపొందించిన జీవిత విధానాన్ని (దీనినే సంస్కృతి అని అంటాం) నేర్చుకొని, కాలానుసారంగా మార్చి వినియోగించుటకు కావలిసిన శక్తిసామర్థ్యాలను సంపాదించుట. జంతువులన్నీ పుట్టుకతోటే అప్రయత్నంగా వాటి జీవిత విధానాన్ని నేర్చుకో గల్గుతున్నాయి. సృష్ట్యాదిలో ఈ జీవితవిధానం ఏలాగు ఉండినదో ఇప్పుడుకూడా ఆలానే ఉన్నది. మానవుని జీవితం ఇలాంటిది కాదు. అతని జీవితమంతా తరతరాలుగా స్వయంకృషిచేత అతడు కల్పించుకున్నట్టిది. ఆ జీవిత విధానాన్ని ప్రతి వ్యక్తి నేర్చుకొనవలసి యున్నది. సమాజం ప్రతి వ్యక్తికి భాషను వృత్తివిధానాన్ని నీతినియమాలను సాధించవలసిన పురుషార్థాలను శైశవాన నుండి నేర్పుతున్నది. ఈ ఉద్దేశ్యంతోనే ఒకే ప్రత్యేక విద్యావిధానాన్ని రూపొందిస్తున్నది. ఈలాగు నేర్చుకొనడం చేతనే ద్విపాద పశువుగా పుట్టిన మానవుడు మానవత్వాన్ని సంపాదించి మానవోచితమైన జీవితాన్నిసాగించగలుగుతున్నాడు. ఈ నేర్చుకొనడమే యువతరంవారు సమాజంలో వహించవలసిన పాత్ర.

నిన్నటివరకు వారు ఈ పాత్రను చక్కగా నిర్వహిస్తూవచ్చారు. వారు నేర్చుకొనవలసింది మన ప్రాచీన కాలపు సంస్కృతి మాత్రమే కాదని ఆధునికీకరణమునకు సాధనమైన పాశ్చాత్య సంస్కృతికూడా అని నూరు నూటయాభై సంవత్సరాలక్రింద రాజారామమోహనరాయలవంటి మన నాయకులు గ్రహించి దానికి తగినట్లుగా ఇంగ్లీషు విద్యావిధానాన్ని ప్రవేశపెట్టారు. అప్పటినుండి మన యువకులు ఈ రెండు సంస్కృతులచే ప్రభావితులై, స్వేచ్ఛ, సమానత్వం, జాతీయాభిమానం, ప్రజాస్వామ్యం మొదలైన నూతన ఆశయాలను కలవారై దేశస్వాతంత్ర్యాన్ని సంపాదించడంలో వయస్సులో తమకంటే పెద్దలైన వారితో కలసి పనిచేసి దేశంలో స్వరాజ్యాన్ని స్థాపించారు. అందుచేతనే నిన్నటివరకు వారు వారిపాత్రను చక్కగా నిర్వహించారని చెప్పడం.

కాని, ఈనాడు ఈలాగు చెప్పడం సాధ్యంకాక పోతున్నది. యువకులుగా వారు నేర్చుకోవలసిన విషయాలపట్ల వారికి ఆసక్తి సన్నగిల్లింది. ఆ విషయాలతోటి ఏలాటి సంబంధం లేని కార్యక్రమాలలో వారిలో సహజంగా ఉండే ఉత్సాహం, ఆవేశం, చైతన్యం వినియోగింపబడుతున్నవి. విచక్షణా రహితంగా వారు విధ్వంసకచర్యలలో పాల్గొనువారయ్యారు. నిర్మాణాత్మకమైన కార్యక్రమాలు వారిని ఆకర్షించడంలేదు. అందుచేతనే నేటి యువకుల ఆలోచనలు కార్యకలాపాలు సంఘపురోగతికి తోడ్పడక పోవడమే గాక దాని విచ్ఛిత్తికి దారి తీస్తున్నవి.

మన సమాజం పూర్తిగా సంప్రదాయ బద్ధమైనది కాదు. అది సంప్రదాయ బద్ధమే అయితే కొంతవరకు యువకుల పురోగమనానికి అడ్డు తగులుతున్నదని చెప్పడంలో సత్యం ఉంటుంది. కాని, నూరు నూటయాభై సంవత్సరాలుగా సంప్రదాయాలకు ఉండిన బలమూ బిగువు తగ్గిపోయాయి. వర్ణధర్మాలను, కుల కట్టుబాట్లను అనుసరించేవారిసంఖ్య తగ్గింది. స్త్రీలకు పురుషులతో సమానత్వం లభిస్తున్నది. అస్పృశ్యతపట్ల విముఖత్వం పెరుగుతున్నది. మన సమాజం మారుతూ ఉన్నది. మార్పు వేగంగా జరుగక పోవచ్చు. కాని, అది సంప్రదాయబద్ధంగా ఉన్నట్లు చెప్పటం సహేతుకంగాదు. అందుచేత అది పురోగమించదలచిన యువకులకు అడ్డు తగలడంలేదు. లోపమంతా నిజంగా పురోగమించ సిద్ధపడిన యువకుల సంఖ్య చాల తక్కువగా ఉండడమే.

ఇప్పటి సమాజం యువతరానికి అనేక అవకాశాలను కల్పిస్తున్నది. వారి నిరక్షరాస్యతను నిర్మూలిస్తున్నది. వృత్తి విద్యలకు, సాంకేతిక విద్యలకు, విజ్ఞాన

శాస్త్ర పరిశోధనలకు, క్రీడలలకు, యన్.సి.సి. మొదలైన కార్యక్రమాల మూలంగా దేహదార్ఢ్యానికి క్రమశిక్షణకు, యువకసంక్షేమకార్యక్రమాలకు ఇదివరకు లేని ప్రాధాన్యం ఇప్పుడు లభిస్తున్నది. దేశం ఆర్థికంగా వెనుకబడి ఉన్న కారణంగా ఈ అవకాశాలను మరింత ఎక్కువ చేయడానికి సాధ్యం కాకపోతున్నది. అయితే, యువకులు ఈలాటి అవకాశాలను పూర్తిగా వినియోగించుకొనలేకపోతున్నారు. ఉపయోగరహితమైన సామాన్య విద్య (General Education) వారిని ఆకర్షిస్తున్నదే గాని వృత్తి విద్యలు వారిని ఆకర్షించడం లేదు.

క్రొత్త విలువలను సృష్టించే బాధ్యత ఒక యువతరంవారిది మాత్రమే కాదు. దానికి కావలసిన అర్హతకూడా వారికి లేదు. క్రొత్త విలువలను సృష్టించుటకు ఉత్సాహం, ఆవేశం ఎంతమాత్రము ఉపయోగపడవు. అనుభవాధారమైన మేధాశక్తి ఇంతకంటె అవసరం. వారిలోని ఈనాటి భావాలు, వారు ఈనాడు గౌరవించే విలువలు, కారల్ మార్క్స్, లెనిన్, మార్క్యూస్ మొదలైన వారు సృష్టించినట్టిది. వారుకూడా వీటిని యువకులుగా ఉన్నప్పుడు సృష్టించలేదు. విలువలను ఏ ఒక్కడూ సృష్టించడు. సమాజం సృష్టిస్తుంది. వ్యక్తులు వాటిని వ్యక్త పరుస్తారు.

నేడు భారత దేశంలోని యువతరంలో కనుపిస్తున్న ధోరణులు విశ్వ వ్యాప్తమైనట్టిదే. ప్రతి సమాజంలోను అనేక లోపాలు ఉంటవి. ఇది తప్పదు. లోప రహితమైన సమాజాన్ని భావప్రపంచంలో కొందరు కల్పిస్తున్నారు. కాని, ఒక మేధావి కల్పించిన ప్రపంచం ఇంకొకనిదృష్టిలో లోపభూయిష్ఠంగా ఉంటుంది. ఇంతే కాదు. కల్పించుకొన్న ప్రపంచాన్ని వాస్తవంగా నిర్మాణం చేయడం సాధ్యం కాదు. మానవునికి అంతటి ప్రజ్ఞ లేదు. అందుచేత లోపంలేని సమాజం అనేది ఉండదు. దౌర్జన్యయుతంగా తిరుగుబాటు చేస్తేనే గాని లోపాలను పాగొట్టడం సాధ్యంకాదనే ధోరణిలో ప్రతిదేశంలోనూ యువకులు కొందరు ఉన్నారు. సోవియట్ రష్యా వంటి దేశాలలో కూడా ఈలాటి యువకులు ఉన్నారు. వారికి ఏలాటి స్వాతంత్ర్యంలేని కారణాన వారి భావాలు బాహ్య రూపం ధరించడంలేదు.

ఇంతేకాక యువకులు కొందరిలో ఒక దురభిప్రాయం వ్యాపించి ఉన్నది. తమ ఆలోచనలన్నీ మార్పును కోరేటట్టివనిన్నీ, క్రిందితరంవారి ఆలోచనలన్నీ మార్పుకు ఆటంకం కలిగించేవి అనన్నీ వారు భావిస్తున్నారు.

రెండుతరాలమధ్య ఘర్షణకు ఇది ప్రధానకారణం. కాని, ఇందులో సత్యం లేదు. యువకులందరు మార్పును కోరే వారు కారు. మార్పును కోరినా వారిలో కొందరు కోరే మార్పుకు తక్కిన వారు కోరే మార్పుకు ఎంతో భేదం ఉంటుంది. అలాగే క్రింది తరం వారందరు మార్పుకు విముఖులు కారు. ఘర్షణ తరాలమధ్య ఉన్నట్లు భావించరాదు.

ఈ కారణంచేత మార్పును కోరే యువకులు మార్పును కోరే మధ్య వయస్కులతోటి వృద్ధులతోటి కలిసి పనిచేయడం అవసరం. తరాల మధ్య అంతరాలు ఉన్నట్లు భావించడం ఒక ఫ్యాషన్ (Fasion) అయింది. ఉదాహరణకు విద్యావిధానంలో రావలసిన మార్పులను కొఠారి వంటి వయసు ముదిరినవారు సూచించినారు. కాని, యువకులలో అనేకులు వాటికి అడ్డు తగులుతున్నారు. వారిధోరణి నిర్మాణకార్యక్రమాలవైపు మళ్ళడంలేదు. వారిలో ఉన్న ఆవేశాలకూ ఉద్రేకాలకూ తగిన విచక్షణ లేదు. విచక్షణకు అనుభవం ఆలోచనాశక్తి అవసరం. యువకులలో ఇవి లేవు. అందుచేత వారి ఆవేశాలకు లొంగి పోవడం ఉచితం కాదు. వయస్సులో పెద్దవారు వారిని కూడకట్టుకొని వారితో పనిచేయడం అవసరం. మహాత్మాగాంధీ, నెహ్రూ మొదలైనవారు ఈలాగే చేశారు. యువకులుకూడా పెద్దవారికి గల అనుభవాన్ని విచక్షణాశక్తిని వినియోగించుకొని వారితో కలిసి పనిచేసిన పక్షాన సమాజం అభ్యుదయాన్ని సాధిస్తుంది.

కాని, అభ్యుదయం అంటే ఏమిటి అనే ప్రశ్న ఒకటి ఉంది. దీనికి సర్వకాలాలకు వర్తించే సమాధానమేదీ లేదు. ఆయాకాలాల పరిస్థితులను బట్టి దీనికి నిర్వచనం కల్పించడం అవసరం. "దారిద్ర్యం నిర్మూలమై అందరి అవసరాలు పూర్తిగా తీరడమే అభ్యుదయం" అని ఈనాడు భావిస్తున్నాము. దీనికి కారణం విజ్ఞానశాస్త్రజ్ఞానమూ, సాంకేతిక శాస్త్రజ్ఞానమూ వృద్ధిపొందడము. దీని మూలంగా వ్యవసాయాదులద్వారా సమస్త పదార్థాలనూ విస్తారంగా ఉత్పత్తి చేసే శక్తిని ఈనాటి మానవుడు సంపాదించడం. కాని, అభ్యుదయం అంటే సమస్త అవసరాలను తీర్చుకోవడమేనా? విజ్ఞానశాస్త్రం వృద్ధి కాను కాను యుద్ధభయంకూడా వృద్ధి కాంచింది. "దినదిన గండం వేయేళ్ళు ఆయుస్సు"గా మారిపోయింది. శాంతి సంస్థాపనమే అభ్యుదయంగా చెప్పవలసి ఉన్నది. ఈ విధంగా అభ్యుదయానికి మన అనుభవాన్నిబట్టి క్రొత్తక్రొత్త అర్థం కల్పించడం జరుగుతూ ఉంది. కాని, ఏకాలంలో సమాజం దేనిని అభ్యుదయంగా గుర్తిస్తుందో అదే అభ్యుదయమనీ, దానిని సాధించుటకే అన్ని తరాలవారు కలిసి పనిచేయడం యుక్తమని చెప్పవచ్చు.

అందుచేతనే నిన్నటి తరం వారు నేటి తరంవారు కలియడం అవసరం. నాయకత్వం అనేది వ్యక్తియొక్క శక్తి సామర్థ్యాన్ని బట్టి, ఆకర్షణ శక్తి బట్టి ఏర్పడుతుంది. ఒక్కతరంవారే నాయత్వం వహించాలని పట్టుబట్టడం ప్రాజ్ఞత కాదు.

యువతరంలో ఉత్సాహం, ఉద్రేకం ఉన్నా అవి తాత్కాలికాలై చిల్లర లాభాలను - చౌక సినిమా టిక్కట్లు, బస్సు ప్రయాణాలు, రైల్వే సౌకర్యాలు, సులభమైన పరీక్షా పత్రాలు వగైరా - సంపాదించడానికి విధ్వంసక చర్యలను సాగించడానికి వినియోగింపబడుతున్నవి. స్వాతంత్ర్య సంపాదనం వంటి ఉన్నత లక్ష్యాలు వారిని ఆకర్షించడంలేదు. నిరక్షరాస్యతను నిర్మూలించడం, క్షామ నివారణ పథకాలను చేపట్టడం, హరిజనఉద్ధరణ మొదలైన కార్యక్రమాలు చేపట్ట వలసి ఉన్నది. కాని, వారు అందులో ప్రవేశించడం వదిలి నిరర్థకంగా ఉన్నత విద్యాలయాలలోను విశ్వవిద్యాలయాలలోను కాలం గడుపుతున్నారు. వీటిని పూర్తిగా బహిష్కరించి, హైస్కూలు విద్య పూర్తికాగానే దేశాభ్యుదయ కార్యక్రమాలలో వారు పాల్గొనడం ఎంతైనా అవసరం. ఈనాటి విద్యావిధానం ప్రయోజన రహితమైనదని ఒకవైపు ఖండిస్తూ దానికి వారు వేనవేలుగా దాసులు అవుతున్నారు. అందుచేతనే వారు వారి నిజమైన బాధ్యతను గుర్తించడంలేదని నీడలతో పొట్లాడుతున్నారనీ చప్పవలసి వస్తున్నది.

అందరికీ సమానావకాశాలు కల్పించడమే సామ్యవాద వ్యవస్థకు, ప్రజాస్వామ్య వ్యవస్థకు ఆధారాలు. వర్ణవ్యవస్థ దీనికి విరుద్ధం. కొందరికి ఎక్కువ అవకాశాలు కల్పించడం, మరికొందరికి తక్కువ అవకాశాలు కల్పించడం వర్ణవ్యవస్థకు లక్షణం. అలాగే కేపిటలిజంలో ధనిక వర్గానికి ఎక్కువ సదుపాయాలు, తక్కిన వర్గాలకు తక్కువ సదుపాయాలు లభిస్తవి. కనుక ఈ రెండు వ్యవస్థలకూ, సోషలిస్టు ప్రజాస్వామిక వ్యవస్థలకూ పొత్తు కుదరదు. కాని, ఈనాడు వర్ణ వ్యవస్థ యొక్క బలం చాలా వరకు తగ్గింది. ప్రజాస్వామ్యం చక్కగా పనిచేస్తే దాని బలం పూర్తిగా పోతుంది. అదే విధంగా సోషలిస్టువిధానం కాదని రూపం ధరిస్తే కేపిటలిజం దానంతట అదే అదృశ్యం ఔతుంది. లోపం ఎక్కడ ఉన్నదంటే - ఈ నాటి మన రాజకీయ నాయకులు రాజకీయపార్టీలు త్రికరణశుద్ధిగా ప్రజాస్వామికాన్నిగాని, సోషలిజంనుగాని అమలులో పెట్టడం లేదు. అలాంటి నాయకులను ప్రజలు అధికార పదవులనుండి తొలగించడం అవసరం. యువకులు ప్రజలతో దగ్గర సంబంధాలు కల్పించుకొని ఈ మార్పు

వచ్చేటట్లు చూడవలసి ఉంది. వారు చేయదగిన నిర్మాణ కార్యకలాపాలలో ఇది ఒకటి.

కాని, ఈలాంటి కార్యకలాపాలలో శ్రద్ధ వహించిన వారు క్రింది తరంవారిని విమర్శించడంలో కాలం వ్యర్థపుచ్చుతున్నారు. ఒక్కొక్కప్పుడు ఇది మేధావి వర్గాన్ని అధిక్షేపించడానికి దారి తీస్తున్నది. మేధావులలో అనేకులు వారి విజ్ఞానాన్ని వినియోగించి సమాజం ఏలాగు పునర్నిర్మాణం కావలిసిందీ సూచిస్తున్నారు. వారినుండి యువకులు యెంతైనా నేర్చుకోవలసి ఉంది.

పై వివరణ మూలంగా సమాజంలో యువతరం వారు అమూల్యమైన పాత్రను వహించవలసినవారనీ సమాజం తరతరాలుగా సేకరించిన సంస్కృతిని మూలధనంగా స్వీకరించి దానిని సమాజాభివృద్ధికి వినియోగపరచడమే వారు వహించవలసిన పాత్ర అనీ, ఈ నాటి యువతరంవారు దీనిని తృప్తికరంగా నిర్వహించడం లేదనీ, క్రింది తరంవారితో వీరికి సంఘర్షణ అనవసరమనీ, అన్ని తరాలవారు కలసి పనిచేయడం సాధ్యమనీ, అది జరిగినప్పుడే సమాజాభ్యుదయానికి అవకాశం ఏర్పడుతుందనీ స్పష్టం అవుతుంది.

# యువజనులు - రాజకీయాలు

పుచ్చలపల్లి సుందరయ్య

"యువత" గోష్ఠి కార్యక్రమములో మిగిలిన విషయాలన్నీ కూడ ఈ కీలక సమస్యతో ముడిపడిఉన్నవి. దీని చుట్టూ తిరుగుతూ ఉంటాయి. అందుచే దీనిపై శాస్త్రీయమైన, వాస్తవికమయిన హేతుబద్ధమయిన అవగాహన అవసరం.

## రాజకీయాలంటే ఏమిటి?

ఒకానొకదశలో, ప్రపంచ మానవ సమాజంలో లేదా, ఒక దేశంలోని సమాజవ్యవస్థలో ఏలాంటి ఉత్పత్తి శక్తుల మీద ఆర్థిక వ్యవస్థ ఏర్పడి ఉందీ, వివిధ వర్గాలు ఆ ఆర్థిక ఉత్పత్తి విధానాలలో ఏయే పాత్ర వహిస్తూ ఉందీ, అందులో ఏ వర్గం ఉత్తత్పిశక్తులమీద ఆర్థికవ్యవస్థమీద ఆధిపత్యం యాజమాన్యం వహిస్తూ ఉందీ దానినిబట్టి ఆనాటి రాజ్యాధికారం, రాజకీయాలు ఆధారపడి ఉంటాయి.

సమాజంలో ఆనాటి ఆర్థికవ్యవస్థపై యాజమాన్యం వహిస్తున్నట్టి ఉత్పత్తి శక్తులను స్వాధీనంలో ఉంచుకున్నట్టి వర్గం తన ప్రయోజనాలను రక్షించుకోడానికి ఏర్పరచుకున్న సంఘటిత నిర్బంధ యంత్రాంగమే రాజకీయాధికారం, రాజ్యాంగ చట్టము.

తన ఆర్థిక ప్రాబల్యాన్ని రాజకీయాధికారాన్ని కాపాడుకోడానికి, దానికి వ్యతిరేకంగా తిరుగుబాటులు రాకుండా జేసుకోడానికి, ఆ వ్యవస్థను సమర్థించేటట్లు నీతులను, ధర్మశాస్త్రాలను, మతాన్ని, సారస్వత, కళా, శాస్త్రీయవిజ్ఞానాన్ని, సాంఘిక ఆచారాలను, కుటుంబం వ్యక్తిగత జీవిత సిద్ధాంతాలను, దానికి అనుగుణ్యంగా నిర్ణయిస్తుంది. వానిని అమలు జరుపడానికి కూడా అవసరమయితే ఈ నిర్బంధయంత్రాన్ని, రాజకీయాధికారాన్ని, పాలకవర్గం నిస్సంకోచంగా ఉపయోగిస్తుంది.

ఒకవర్గం యొక్క రాజకీయాధికారాన్ని ఆర్థికాధికారాన్ని కూలద్రోసి, దానిస్థానే అంతవరకు దాని చేత దోపిడీ చేయబడుతూ అణచబడుతూ వచ్చిన వర్గం లేదా వర్గాలు రాజకీయాధికారాన్ని కైవశం చేసుకొని నూతన ఆర్థికవ్యవస్థను, నూతన రాజకీయ సామాజిక వ్యవస్థకు పునర్వ్యవస్థీకరణ చేయడమే రాజకీయాలు.

అందుచే ప్రతిదశలోను రాజకీయాలు రెండుగా ఉంటాయి. ఒకటి-అధికారంలోని వర్గంయొక్క ఆర్థిక రాజకీయాధికారాన్ని దాని సాంఘిక సైద్ధాంతిక సౌధాన్ని బలపర్చే రాజకీయాలు. రెండవది - అధికారవర్గ రాజకీయార్థిక అధికారాన్ని, దాని సాంఘిక సైద్ధాంతిక సౌధాన్ని కూలద్రోయడానికి కృషి చేస్తున్న అణచబడిన వర్గాలకు తోడ్పడే సిద్ధాంతాలు, కృషి చేసే పార్టీలు, వారి రాజకీయాలు.

యువకులు స్థూలంగా ఏ వర్గంలోనుండి వస్తారో సామాన్యంగా ఆవర్గ రాజకీయాలనే అవలంబిస్తారు. ఆ వర్గంలోని వయోవృద్ధులతో పైతరం వారితో, చేతులు కలిపి పనిచేస్తూ ఉంటారు.

కాని, కొలది మంది యువకులు పై వర్గాలనుండి వచ్చినా, దోపిడీ వర్గాల నుండి వచ్చినా తమ చుట్టుప్రక్కలనున్న పరిస్థితుల ప్రభావము క్రింద, పీడిత వర్గాలలో నిలబడడం జర్గుతుంది. సమాజములోని తీవ్ర తారతమ్యాలు, సంఘర్షణలు క్రమక్రమేణ మరింత పెర్గుతూ పోతూ ఉండడం తప్ప పరిష్కార మార్గం కనబడకుండా ఉన్నప్పుడు అణచబడిన వర్గాలకు అనుకూలమయిన నూతన సామాజిక ఆర్థిక రాజకీయ సిద్ధాంతాలతో, కృషితో ప్రభావితులయి, తమ సహజ వర్గ ధోరణులను వదులుకొని, పీడిత వర్గాలతో నిలబడడం జర్గుతుంది.

ముఖ్యంగా యువకులు, దోపిడీ వర్గాల అభివృద్ధి నిరోధక అలవాట్లు మూఢాచారాలు, సిద్ధాంతాలను పూర్తిగా దిగమ్రింగి, వానిలో కరుడు గట్టుకు పోకముందే, తమ చిన్నవయస్సులో తమ చదువు తదితర పరికరాల ప్రభావం వలన ఎక్కువగా పీడిత వర్గాల వైపు మ్రొగ్గడానికి అవకాశముంటుంది.

అందుచే యువజనుల రాజకీయాలు వేరు, వయోవృద్ధుల రాజకీయాలు వేరు అని చూడడం తప్పు. లేదా, యువజనులు ఒక ప్రత్యేక వర్గమని, వయోవృద్ధులంతా మరో వర్గానికి చెందిన వారని, వారికి ప్రత్యేక ఆర్థిక రాజకీయ సాంఘిక సిద్ధాంత అవగాహనలుంటాయని ఊహించి ఈ కృత్రిమపునాది మీద సమస్యా పరిష్కారానికి పూనుకోవడం వృధా ప్రయాస తప్ప మరేమీ లేదు. వయో వృద్ధుల అనుభవాన్ని, పరిజ్ఞానాన్ని, యువతరము వారి చొరవ, ఉత్సాహము, ప్రత్యక్ష కార్యాచరణకు ఉన్న శక్తిని దూకుడును, సమన్వయపర్చి, అన్ని రంగాలలో రాజకీయదృక్పథంలో ముందుకు సాగలవసి ఉంటుంది.

## నేటి ప్రపంచ వ్యవస్థ

నేడు ప్రపంచంలో రెండు వ్యవస్థలు పోటీపడుతున్నాయి. సోషలిస్టు వ్యవస్థ మూడవ వంతు జనాభా, నాల్గవ వంతు భూభాగం మీద ఉంది. భూస్వాములు, పెట్టుబడిదారులు లేని సమాజం, కార్మికులు (ఫ్యాక్టరీలలో, ఆఫీసులలో పనిచేసేవారు), రైతులు (భూముల మీద పనిచేసేవారు), కలిసి రాజకీయాధికారం చెలాయిస్తున్న సమాజం. ఉత్పత్తి సాధనాలన్నిటిని తమ ప్రభుత్వాధీనం చేసుకొని, ఒక మానవుణ్ణి మరో మానవుడు దోచుకోడానికి వీలులేని ఒక నూతన సమాజం. సోషలిస్టు సమాజం ఇది. ఇప్పుడు ఈ దశలో ప్రతి ఒక్కరికీ పని, పనికొలది ప్రతిఫలం (వేతనం), ప్రతి ఒక్కరికీ విద్య, వైద్య, గృహవసతి, సాంఘిక సంరక్షణ, భీమా గ్యారంటీ ఉన్న సమాజం. దీని ఉన్నత దశ – ప్రతి ఒక్కరు తన శక్తి కొలది పనిచేయడం, తన అవసరం కొద్ది మాత్రమే ప్రతిఫలం తీసుకొనే మానవసమాజం. దానినే కమ్యూనిస్టు సమాజమంటారు. దానిని అందుకోడానికి కృషి జరుపవలసి ఉంటుంది. అట్లాంటిక్ మహాసాగరంనుండి పసిఫిక్ మహా సముద్రం వరకు సోవియట్ యూనియన్, చైనా, వీని పరిసరదేశాలు అమెరికా భూఖండంలోని క్యూబా, సోషలిస్టు దేశాలు.

మిగిలిన ప్రపంచం అంతా పెట్టుబడిదారీ ప్రపంచం. ఇందులో అమెరికా, బ్రిటను, పశ్చిమ జర్మనీ, ఫ్రాన్స్, జపాన్ బలిష్ఠమయిన సామ్రాజ్యవాద దేశాలు. వీని ఆర్థిక ప్రాబల్యం క్రిందనే మిగిలిన పెట్టుబడిదారీ దేశాలు. ఇటీవలివరకు అధీనవలస దేశాలుగా ఉండి, రాజకీయాధికారాన్ని సాధించుకున్న వెనుకబడిన దేశాలు ఉన్నాయి. వీనిలో అనేక దేశాలలో భూస్వామిక విధానం (ఫ్యూడలు విధానం), అంతకు పూర్వపు సామాజిక (బానిస, ఆదిమతెగలసమాజకాలపు ) అనేక అవశేషాలతో సమ్మిళితమయిన ఆర్థికవిధానా లున్నాయి.

## భారతదేశములోని రాజకీయవ్యవస్థ

స్వాతంత్ర్యానికి పూర్వం (1947 ఆగస్టు 15కు పూర్వం) బ్రిటీషు సామ్రాజ్యవాదుల పరిపాలనకు వ్యతిరేకంగా మనదేశంలోని వివిధ వర్గాలు, బడా పెట్టుబడిదారులనుండి పట్టణకార్మికులు, గ్రామరైతాంగమువరకు, కలిసి పోరాడుతూ వచ్చారు. జమీందారీ జాగీర్దారీ వర్గం, సంస్థానాధీశులు బ్రిటీషు వారితో చేతులు కల్పి ఈ పోరాటాన్ని వ్యతిరేకిస్తూ వచ్చారు. స్వాతంత్ర్యాన్ని సత్వరంగా సాధించడానికి, అవలంబించాలసిన పద్ధతులమీద, ఏ కార్యక్రమం

మీద ప్రజాబాహుళ్యాన్ని సమీకరించాలన్న విషయంమీద, స్వాతంత్ర్య సముపార్జన తర్వాత ఏలాంటి సమాజం నిర్మాణానికి ఏలాంటి కార్యక్రమాన్ని అమలు జరుపాలన్న అంశం మీద చాలా భేదాలుంటూ వచ్చాయి. ఏమయినా, బ్రిటీషు సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా సాగించే స్వాతంత్ర్య పోరాటములో అన్నిశక్తులు ముందుకు నడుస్తూనే వచ్చాయి. ఆనాడు, కాంగ్రెసు నాయకత్వము, చివరకు మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ నెహ్రూల నాయకత్వము క్రింద, బడా పెట్టుబడిదారీ వర్గ ప్రాబల్యముక్రింద నాయకత్వంక్రింద ఆపోరాటం విజయవంతమయింది. రాజకీయాధికారాన్ని, రాజకీయ స్వాతంత్ర్యాన్ని భారతప్రజలు సాధించుకోగలిగారు.

కాని, బ్రిటీషు ఆర్థిక ప్రాబల్యం, భూస్వామిక దోపిడీ భారతదేశంలో ప్రగాఢంగా నిలబడిపోయాయి. స్వాతంత్ర్యానంతరం రాజకీయాధికారం స్వీకరించిన కాంగ్రెసునాయకత్వం విదేశీసామ్రాజ్యవాదులతో రాజీపడి. రాజ్యమేలసాగింది. బడాపెట్టుబడిదారులు భూస్వాముల అస్తిత్వాన్ని కాపాడుతూ, దేశాభివృద్ధిని పెట్టుబడిదారీ పంథాన సాధించడానికి పూనుకుంది. సోషలిస్టు సమాజాన్ని నిర్మించడమే మా ధ్యేయమని పార్లమెంటుచేత ప్రకటింపచేసినా ఆచరణలో బడాపెట్టుబడిదారుల ప్రాబల్యం గ్రామసీమలలో భూస్వాముల ప్రాబల్యం మరింత పెరిగిపోయింది. విదేశీ పెట్టుబడులు, విదేశీ ఋణాలు, ముఖ్యంగా అమెరికా సామ్రాజ్యవాదుల ప్రాబల్యం విపరీతంగా పెరిగిపోయాయి.

దున్నేవానికే భూమి, ప్రతిఒక్కరికీ పని (నిరుద్యోగ నిర్మూలన) ప్రాథమిక మాధ్యమిక (సెకండరీ) విద్యాబోధన, 7-10 సంవత్సరాల కనీస సర్వజన విద్యా శిక్షణ, ప్రజల సంక్షేమ, సంరక్షణ బీమా పథకాలు, ఆచరణలో సున్న అయ్యాయి. సోషలిజానికి ప్రాతిపదికగా భూమి గుత్త యాజమాన్యాన్ని (పరాన్న భోక్త అయిన భూస్వామికవిధానాన్ని అన్నిరూపాలలోను) రద్దుచేసి దున్నేవానికే భూమి హస్తగతం చేయలేదు. బడాపెట్టుబడిదారుల, విదేశీ సామ్రాజ్యవాదుల, పారిశ్రామిక, వాణిజ్యపెట్టుబడులను స్వాధీనపర్చుకోలేదు. విదేశీ వ్యాపారాన్ని ప్రభుత్వాధీనం చేసుకోలేదు.

వీనిఫలితంగా, స్వాతంత్ర్యం, తమ కష్టాలన్నిటినీ పోగొట్టుకుందని విశ్వసిస్తూ వచ్చిన ప్రజానీకానికి తీరని ఆశాభంగం కల్గింది. సోషలిస్టు సమాజం నిర్మిస్తాము, భూములు పంచుతాము, పారిశ్రామికాభివృద్ధిని పెంపొందించి

నిరుద్యోగాన్ని పోగొట్టుతాము, బడాపెట్టుబడిదారుల విదేశీ సామ్రాజ్యవాదుల ప్రాబల్యాన్ని త్రోసివేసి స్వయంపోషక ఆర్థికవిధానం అమలుపరుచుతామనే వాగ్దానాలు మెండు, తీసుకున్న చర్యలు కొద్ది. ఆశలు పెంచుతూ వచ్చినా, యువజనులలో, ముఖ్యంగా పీడిత వర్గాలలో, మధ్య తరగతి ప్రజానీకంలో, విద్యనభ్యసించి పట్టభద్రులు అయినా పని దొరకక ఆకలికి అవమానానికి గురి అవుతూన్న యువకులలో అసంతృప్తి, నైరాశ్యము పెరిగాయి.

స్వాతంత్ర్యం సాధించినతర్వాత సుమారు 20 సంవత్సరాలు, యువజనులు ఆశలతో, భ్రమలతో రాజకీయరంగంలోకి ప్రముఖంగా ముందుకు రాలేదు. ఆశలు వమ్ము కావడంతో ప్రభుత్వ విధానాల మీద భ్రమలు భగ్నమయ్యేకొద్ది, అనేక అడ్డదొడ్డిమార్గాలలో, తిరుగుబాటులు జర్గు తున్నాయి. పీడిత ప్రజల ఉద్యమాలు, సంఘాలు, వారితో పనిచేస్తూ వచ్చిన రాజకీయ పార్టీలు, బలహీనంగా ఉండబట్టి ఈ యువజనులను సరియయిన మార్గంలోకి ఆకర్షించ గల్గిన కార్యక్రమాన్ని అవలంబించలేకపోయాయి.

నిన్నటితరం స్వాతంత్ర్యసాధనను ఆశయంగా పెట్టుకొని రాజకీయాల్లో ప్రవేశించింది. నేటితరం నిజమయిన సోషలిస్టు సమాజ నిర్మాణం తమ ఆశయంగా పెట్టుకొని ముందుకు రావాలసి ఉంది. అప్పుడే యువజనులకు ఒక నిర్దిష్ట ఆశయం, ప్రగతి శీల రాజకీయాలు ప్రజామోదం పొందగల్గిన కార్యాచరణ, దానిని అమలు జరుపడానికి కావలసిన సుశిక్షత, త్యాగపూరిత వ్యక్తిగత జీవితవిధానం అలవడుతుంది. దోపిడిదారునికి వ్యతిరేకంగా ద్వేషం కోపం పెరిగి, తోడిపీడిత మానవుని యెడల గౌరవం, అభిమానము, నూతన సమాజ నిర్మాణానికి సమైక్య కార్యాచరణ పెర్గుతుంది. నూతన జీవిత విధానంగా స్థిరపడిపోతుంది.

## దైనందిన జీవిత సమస్యలు – రాజకీయాలు

యువజనులముందు నూతన సమాజనిర్మాణం, సోషలిస్టు సమాజ నిర్మాణం ఆశయంగా ఉండాలి. వారు దాన్ని సాధించడంకోసం అహర్నిశలు కృషి గావించాలి. ఇవే సరియయిన రాజకీయాలు. తనకు, ప్రజలకు జీవితాన్ని సరియయిన మార్గంలో నడుపుకోడానికి కూడా ఉపయోగపడే పంథా అని మనం పైన చూచాము. అందుచే దైనందిన జీవిత సమస్యలను, ప్రతి ఒక్కటిని పూర్తిగా గాని, ఆంశికంగాగాని పరిష్కరించుకోడానికి తీసుకోవాలసిన

కార్యాచరణ, దానికి ప్రజాసమీకరణ, ఆందోళన, పోరాటం, ఇవన్నీ రాజకీయాలే. ఇలాంటి నిరంతర రాజకీయ కార్యాచరణ పర్యవసానంగానే, అనేక దైనందిన జీవిత సమస్యలను పరిష్కరించుకోవడంలో, వివిధవర్గాలు, పార్టీలు, ప్రభుత్వ యంత్రాంగం తీసుకుంటున్న చర్యల ప్రత్యక్షఅనుభవంద్వారానే, ప్రజా బాహుళ్యము రాజకీయ పరిపక్వత సాధించి పోరాటాలు తీవ్రం చేసి తమ ఆశయాన్ని సాధించుకోవడం సాధ్యమవుతుంది.

ప్రతివ్యక్తి జీవితంలో, ప్రతి ఒక్క సమస్య కూడా రాజకీయాలతో ముడిపడి ఉంటుంది. విడదీసి వేరుగా పరిశీలించడం సాధ్యము కాదు. అలా ప్రయత్నించడముకూడా నిష్ప్రయోజనం. వాస్తవాన్ని దాచడానికి పూనుకోవడం తప్ప మరేమి కాదు. అయితే ప్రతివ్యక్తి ప్రతి యువకుడు తన దైనందిన జీవిత సమస్య ఏరీతిగా రాజకీయాలతో ముడిపడిఉందో తెలుసుకోలేకుండా ఉండవచ్చు.

## ఆర్థిక రంగం

ప్రతియువకుడు, తనజీవితం హాయిగా గడిచిపోతేచాలు - అనుకోవడం సర్వసామాన్యమయిన విషయం. కాయకష్టంతో సంబంధంలేని వైటుకాలర్ (గుమస్తాగిరి లేదా కలంగీటుతో జీవితం తేలికగా నడుపుకోడానికి పనికి వచ్చే) ఉద్యోగాలను సంపాదించి నగరాలలో ఉండిపోవాలనుకోవడానికి కారణం కాయకష్టం చేయాలసినపనులలో వచ్చే జీతాలు నికృష్టజీవితానికికూడా సరిపడవు. పొలాలలో, ఫ్యాక్టరీలలో, పరిశ్రమలలో, గనులలో కష్టించే పనివారికి, ప్రతిఫలము ప్రతిపత్తి తక్కువ. పై పెత్తనం చేసే కలంగీత పనివారికి, లేదా ఏ పని చేయని సోమరులకు ప్రతిఫలము, హుందా హెచ్చు. నేటివరకు అన్ని దోపిడిసమాజాలలోను ఇదే పద్ధతి ఉంటూ వచ్చింది. కాయకష్టం చేసి, పండించే, ఉత్పత్తిచేసే కష్టజీవులకు,జీతాలలోను, హోదాలోను, ప్రతిపత్తి లోను ప్రాధాన్యత ఇచ్చే సమాజం రానంతకాలం ఈధోరణిలో ఈచైతన్యంలో, ఈ పాతకాలపుభావాలలో, జీవితపథంలో దుర్భర పరిస్థితులను ఎదుర్కొనక పూర్వం పాతకాలపు భావాలతో యువకులు, ముఖ్యంగా పై వర్గాల వారు కొట్టుకపోవడం సహజమే.

కాని, తమజీవితం హాయిగా గడిచిపోతే చాలు అనుకొనేవారు, తమ అనుభవంలో నేటి సమాజంలో అది సాధ్యంకాదని, కడకు ఆత్మాభిమానంతో

బ్రతకాలంటే కావలసిన అవకాశం కూడా లేకపోవడంతో రాజకీయాలలోకి చైతన్యంతో దిగుతున్నారు. బ్రతుకుబరువును దింపుకోడానికి ఈ ఆత్మాభిమానాన్ని చంపుకొని, చాలీచాలనీ జీతాలతో ఏవృత్తినయినా చేపట్టడానికి యువతరం తయారుకావడం లేదు. తిరుగుబాటు చేస్తూ ఉంది. దురదృష్టవశాత్తు, ఈ తిరుగుబాటు తగినంత విస్తృతంగా, తగినంత ఉవ్వేత్తుగా యువతరంలో ఇంకా రావడం లేదు.

నేడు యువతరాన్ని, పీడిత వర్గాల మాధ్యమిక వర్గాల యువజనులను ఎదుర్కొంటున్న నగ్నసమస్య నిరుద్యోగం. ప్రతి ఒక్కరికి ప్రతి పురుషునికి, ప్రతి స్త్రీకి, కావలసింది పని, వృత్తి. ఆ పనిలో జీవితానికి అవసరమయిన జీవిత భత్యం దొరకాలి. కూడు, గుడ్డ, కొంప-గూడు దొరకాలి. జీవితావసర వస్తువులు చౌకధరలకు దొరకాలి.

ఇవి కావాలంటే భూస్వామికవిధానాన్ని రద్దుచేసి, భూములను దున్నుకొనేవారికే వ్యవసాయ కార్మిక పేద ప్రజలకు, యువకులకు స్వాధీనం చేయాలి. బడాపెట్టుబడి దారుల, సామ్రాజ్యవాదుల చేతులలోని పరిశ్రమలు, గనులు, వ్యాపారాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకొని వానిని కార్మికుల ప్రజల సహకారంతో, వారి ప్రతినిధులతో ఏర్పడిన కమిటీల యాజమాన్యాన నిర్వహించాలి. ఆదాయాలలో తారతమ్యాలు, బాగా తగ్గించి వేయాలి. ఒకటికి 10 రెట్లు లేదా అవసరము అయితే ఒకటికి 5 రెట్లకు తగ్గించాలి. కనీస జీవిత భృతి ప్రతిఒక్కరికి గ్యారంటి చేయాలి. ఆదాయాలకు గరిష్ఠపరిమితి (సీలింగు) నిర్దేశించాలి.

అలా చేయక, నేటిసామాజికవ్యవస్థలో పనిచేసేవా రొకరు, అనుభవించేవారు మరొకరు. పనిచేయని భూస్వాములు, బ్యాంకు కౌపన్లు కత్తిరించుకొని, పరిశ్రమవాణిజ్యాలలో వచ్చేలాభాలను, భుక్తం చేసుకొనే బడాపెట్టుబడిదారులు, దొంగమార్కెటుదారులు, లంచగొండిఉద్యోగులు రాజకీయాధికారాన్ని చెలాయిస్తూ, లంచాలతో అవినీతితో లక్షలు, కోట్లు తమ లక్ష్యంగా పెట్టుకున్న ప్రబుద్ధులే అనేక తప్పుడు ఆరోపణలను కష్టజీవులమీద యువకులమీద మోపుతున్నారు. "ఇప్పటి తరానికి నిజాయితీ లేదనీ, కష్టపడే ఓపిక లేదనీ, హక్కులు, హోదాలమీద నున్న మోజు ఎక్కువనీ, బాధ్యతల పట్ల ఆసక్తి తక్కువనీ, ఉత్పత్తిని తగ్గుముఖం పట్టిస్తున్నారనీ, స్వాతంత్ర్యానంతరం వచ్చిన స్వేచ్ఛాజీవనాన్ని దుర్వినియోగం చేస్తూ విశృంఖలంగా

వ్యవహరిస్తున్నారని" ప్రచారం సాగిస్తున్నారు.

మిశ్రమ ఆర్థిక వ్యవస్థ , సహకార రంగం, వ్యవసాయ పంటలలో వచ్చిన విప్లవం, ఇవి అన్నీ పైవర్గాలలోవారికి చెందినవి. ఆ వర్గాలకు చెందిన యువకులకు లాభించింది. కాని, యువజనబాహుళ్యానికి, ఇవి అన్నీ దూరపుకొండలు, ఆశలు మాత్రమే.

## విద్యారంగం

పారిశ్రామికవిద్య మాధ్యమికవిద్య (సెకండరివిద్య) బాలబాలికల జన్మహక్కు. ఉన్నత (కళాశాల) విద్యాభ్యాసానికి, అందరికీ అవకాశముండాలి. బ్రిటిషుపరిపాలనాకాలంలో, తమ పరిపాలనసౌలభ్యంకోసం అవసరమయిన ఉద్యోగస్థులను తరీఫీదు చేసుకోడానికి ఇంగ్లీషు బోధనాభాషగా పరిమిత విద్యాసౌకర్యాలు ఏర్పరచడం జరిగింది. స్వాతంత్ర్య సముపార్జనానంతరం, వచ్చిన ప్రభుత్వం తన పెట్టుబడిదారీభూస్వామిక వ్యవస్థను కొనసాగించడానికి, దానికి అవసరమయిన ఆర్థికాభివృద్ధికి, శాస్త్రీయవిజ్ఞానానికి, పరిపాలనా యంత్రాంగానికి కావలసిన ఉద్యోగబృందాన్ని సమకూర్చుకోడానికి అంతకుమునుపు ఉన్న విద్యావిధానాన్నే విస్తృతం చేయడం జరిగింది. ఇంగ్లీషుస్థానే హిందీభాషను రాష్ట్రభాషగా, ఉన్నతవిద్యకు బోధనాభాషగా చేయ సమకట్టింది. భారతదేశ జాతీయసమైక్యానికి ఇది అవసరమని ప్రతిఒక్కరు మూడు భాషలు (మాతృభాష, రాష్ట్రభాష (హిందీ), ఇంగ్లీషు) నేర్చుకోవాలనే పథకం చేపట్టింది. ప్రజాబాహుళ్యపు ఆశలను కాదనలేక పదేండ్లలో ప్రాథమిక విద్యను 8 సంవత్సరాల చదువు. బాలబాలికలందరికీ ఉచితంగా, నిర్బంధంగా సర్వవ్యాప్తంగా అందజేస్తానంది.

ఆచరణలో ఆప్రాథమికవిద్య స్వాతంత్ర్యం వచ్చి ఇప్పటికి 30 సంవత్సరాలు దరిదాపులు కావస్తున్నప్పటికి నూటికి 20 మందికి మాత్రమే ఆ వయస్సులోనివారికి లభ్యమయ్యింది. అందరికీ మరో 10-15 సంవత్సరాలలో అందజేస్తానని ప్రభుత్వం ప్రకటిస్తూ ఉంది. కాని, అది వేస్తున్న పథకాలతో మరో రెండు మూడు దశాబ్దాలకయినా పూర్తి చేయగల్గుతుందనే నమ్మకం లేదు.

నిరక్షరాస్యులు దేశంలో నేటికీ నూటికి 70 మంది. కళాశాల విద్యార్థుల సంఖ్య 30 లక్షలవరకు పెర్గింది. కానీ, మాధ్యమిక విద్య, (స్కూలు ఫైనలు) పూర్తి చేసినవారు, పట్టభద్రులు నిరుద్యోగులుగా రిజిస్టరులో నమోదు చేసుకొన్న 72

లక్షలలో సగంమంది వీరు !

అందుచేతనే చదువుల ఆశయం, ఏదో ఒక వృత్తి, ఏదో ఒక పని లభ్యం కావాలి. దానిలో నైపుణ్యానికి చదువు, శిక్షణ తోడ్పడాలి. ఈ ప్రప్రథమ ఉద్దేశాన్ని పూర్తి చేస్తూ, తన జీవితకాలంలో మరింత ఆదాయము నిచ్చేది, తన ఇష్టాపూర్తికి అనుగుణ్యామయిన వృత్తికి తరిఫీదు, అవసరమయిన ఉన్నతశిక్షణకు కావలసిన పునాది ఏర్పడవలసి ఉంటుంది. జీవితాంతం వరకు నిరంతరం తన విజ్ఞానాన్ని, పెంపొందించుకొనే ఆసక్తి, అవకాశం కల్గించాలి. దేశ విదేశ పరిణామాలను అవగాహన చేసుకుంటూ, తన విధ్యుక్తకర్తవ్యాన్ని ప్రజా బాహుళ్యంతో కలసి నిర్వహించడానికి తోడ్పడాలి. దానికి కావలసిన శీలత, సుశిక్షత, అలవర్చుకోడానికి విద్య తోడ్పడాలి.

అయితే సామాజిక స్వరూపం, ఆశయాలు మారనిదే విద్య ఈ లక్ష్యాలను సాధించలేదు. వెనువెంటనే ప్రాథమిక విద్యను, మరో 10 సంవత్సరాలలో మాధ్యమిక విద్యను అందరికీ ఉచితంగా నేర్పడానికి తగినన్ని పాఠశాలలను, ఉపాధ్యాయులను ఏర్పరచాలి. ఆర్థికస్తోమత లేని వారికి ప్రభుత్వమే పూర్తిగా అన్నిఖర్చులు భరించాలి. ప్రతివిద్యాదశ అనంతరం, ఏదోవృత్తికి పనికి పోదలుచుకున్న వారికి ఆ ఉపాధివృత్తి గ్యారంటీ చేయాలి. వృత్తి చేసుకుంటూనే పై అంతస్థుల విద్యా, శిక్షణా పరిజ్ఞానం, అవసరమయిన డిగ్రీలు పొందడానికి అవకాశాలు పూర్తిగా ఉండాలి. కళాశాలలలో, ఆర్థిక వ్యవస్థకు అవసరమయిన, వివిధశాఖలలోకి, అవసరమయిన వరకే, విద్యార్థుల ప్రతిభను బట్టి చేర్చుకోవాలి. వృత్తులలో పని చేసుకుంటూ ఉన్నవారి అనుభవం, నైపుణ్యాన్ని బట్టి వారికి ప్రాధాన్యతనిచ్చి ముందుగా చేర్చుకోవాలి. ఒక అంతస్థులో ఆరితేరిన యువకునికి, అంతకు పై అంతస్థున ఉత్తీర్ణుడయిన యువకునికి, దొరికే వృత్తులలో, ఆదాయ తారతమ్యాలు, విపరీతంగా ఉండరాదు. ఉద్యోగం వృత్తి వివిధ అంతస్థులలో గ్యారంటి చేయబడిననాడు, విపరీత తారతమ్యాలు లేకపోయినపుడు, విద్యావిధానంమీద తలమునకబరువు లేకుండా, అందరికీ విద్య, అందరికీ వృత్తి లభ్యమవుతుంది.

కానీ, నేటి విద్యావిధానం, వృత్తిని, జీవితభృతిని గ్యారంటీ చేయడం లేదు. పరీక్షలలో అవినీతి, ధనం, అధికారప్రాబల్యం పెరిగిపోయి ఉంది. నిజాయితీగా ఉన్న వారికి రావలసిన స్థానం రాకుండా, చదువని వారికి డబ్బు అధికారం ప్రాబల్యం ఉన్నవారికి రావడంతో పరీక్షలలో కాపీ గొట్టటం, ఇతర

అవినీతి పద్ధతులు ప్రబలుతున్నాయి. దీనికి యువజనులను విద్యార్థులను నిందించడంవల్ల ప్రయోజనం లేదు. దీనికి కారకులైన పెద్దలను, సమాజాన్ని సరిదిద్దాలి. అయితే యువజనులు, తమ కున్న చదువుకొనే ఈ కొద్ది అవకాశాన్ని కూడా పొగొట్టుకోకుండా ఈఅవినీతిపద్ధతులకు వ్యతిరేకంగా తామే తమ సంఘాలద్వారా ఎదుర్కోవలసి ఉంటుంది. ఉపాధ్యాయులు చక్కగా శ్రమపడి తమకు పాఠాలను వివరించాలని, ప్రతిపరీక్షలో ప్రతిఏటా ఉత్తీర్ణుడయ్యేటట్లు శ్రద్ధ తీసుకొని బోధించాలని పట్టుపట్టాలి. చదువకుండా, మొండిగా విచ్చలవిడిగా తిరిగే అరాజక విద్యార్థులను తామే అదుపులో పెట్టడానికి విద్యార్థులే ముందుకు రావాలి. అదే విధంగా, ఉద్యోగా లిస్తున్న సందర్భాలలో, పలుకుబడి, రికమెండేషన్సు, సిఫార్సులతో తాక తమ విద్యానైపుణ్యాలను తమ ప్రతిభను మాత్రమే ఆధారంగా తీసుకోవాలని పట్టుపట్టాలి. అందరికీ ఉద్యోగాలు, వృత్తులు ఏర్పరచాలని పట్టుపట్టాలి.

ప్రభుత్వ యంత్రాంగంలోనూ, పారిశ్రామిక రంగంలోనూ కావలసిన కొద్దిమందిని, కొన్ని లక్షల మందిని కూడా తయారు చేసుకోడానికయితే ఏ పరాయిభాషలోనయినా, అలాంటివారిని తయారుచేసుకోవచ్చును. ప్రజా బాహుళ్యాన్ని విద్యాశిక్షితుల గావించాలంటే, వారి వారి మాతృభాషలలోనే అత్యంత ఉన్నత విద్యను శిక్షణను ఇవ్వవలసి ఉంటుంది. కొన్ని విషయాలలో, అవసరమయినపుడు, విదేశీభాషలలో నున్న గ్రంథాలను అధ్యయనం చేయడానికి, ఆయాభాషలను అయాపాఠ్యాంశాలుగా చేర్చవచ్చు. అంతేగాని ఇంగ్లీషులోనే ఉన్నతవిద్య అనడం అవివేకం.

దేశసమైక్యతకు హిందీని నిర్బంధంగా చదువమనడం, దేశ విచ్ఛిన్నతకు దారితీస్తుంది. దేశంలో వాణిజ్య పారిశ్రామికంగా ఒక ప్రాంతం వారు మరోప్రాంతానికి పోనారంభించినపుడు అవసరమయినమేరకు ఆయా భాషలను, హిందీనికూడా ఐచ్ఛికంగా నేర్చుకుంటారు. వివిధ భాషారాష్ట్రాలకు ప్రభుత్వఉద్యోగులను ఆయాభాషలలో విద్యాభ్యాసము చేసినవారినుండే తీసుకోవచ్చు. కేంద్రంలో, వివిధరాష్ట్రాలనుండి జనాభానిష్పత్తిలో, అవసరమయిన ఉన్నతోద్యోగులను నియమించవచ్చు. వారు తప్పనిసరిగా మరోభాషను, హిందీని గాని, ఇంగ్లీషు గాని, పరిపాలనసౌలభ్యం కోసం నేర్చుకోవాలి. కాని, ప్రజలకు సంబంధించిన అన్ని చట్టాలు, శాసనాలు ప్రకటనలు, రిపోర్టులు వ్యవహారాలన్నీ రాష్ట్రాలభాషలలో జర్పుతూ ఉండాలి.

సాహిత్యము, లలితకళలు, నాటకరంగము, సినిమాలు, పత్రికా ప్రపంచము, ఇవి అన్ని కూడా యువతరాన్ని, భూస్వామిక పెట్టుబడిదారి విధాన దోపిడికి వ్యతిరేకంగా, నూతన సోషలిస్టు సమాజ నిర్మాణ పంధాన నడుపడానికి తోడ్పడేవిధంగా ఉండాలి. ఈ కళారూపాలలో ఎక్కువ సమర్థత కల్గిన కళాకారులు, ఈ రూపాలను ప్రజాబాహుళ్యానికి అనుకూలంగా ఉపయోగిస్తే ఎక్కువగా తోడ్పడగలరు. వారే అధికార దోపిడి వర్గాలకు అనుకూలంగా వీనిని ఉపయోగిస్తే అంత కెక్కువగాను కీడును కల్గచేయగలరు. పీడిత ప్రజాబాహుళ్యానికి అనుకూలంగా ఉండేవారిని అభ్యుదయకళాకారులుగా యువ జనము భావిస్తుంది. దోపిడీ వర్గాలకు అనుకూలంగా ఉండేవారిని అభివృద్ధి నిరోధకులుగా పరిగణిస్తుంది.

## యువతీ యువకులు

మానవసమాజంలో, ఆదిమతెగలసమాజకాలంనుండి నేటి వరకు. స్త్రీ పురుష సంబంధాలు ఏ రీతిగా మారుతూ వచ్చింది, స్త్రీ ఏ రీతిగా ఆర్థిక స్వాతంత్ర్యం పోవడంతో పురుషునికి ఆధీన వస్తువు, ఆస్తిగా తయారయిందీ, స్త్రీకి పురుషునితో పాటు, సమాన హెూదా, సమాన హక్కులు, నూతన సోషలిస్టు సమాజంలోనే ఎలా లభ్యమయ్యేది-ఎంగెల్సు, తన ఉద్గ్రంథంలో 'కుటుంబం వ్యక్తిగత ఆస్తి, రాజ్యాధికారం వీని ఉత్పత్తి'లో వివరించాడు.

స్త్రీ పురుషులు పరస్పర గౌరవంతో ఆదరాభిమానాలతో ఒకరినొకరు తోడునీడగా జీవించినపుడే తమ వైవాహికజీవితంలో, తమకుటుంబ జీవితంలో తమ సంతానాన్ని సరియయిన పౌరులుగా సరిదిద్ది శిక్షణ గరపడంలో, సమాజంలో, ఆర్థిక రాజకీయ, వైజ్ఞానిక, నైతిక రంగాలలో తమ పాత్రను నిర్వహించడంలో జయప్రదమవుతారు.

యువతీ యువకులు, ఒకరినొకరు ఆకర్షిస్తారు. తమ సంబంధాన్ని జీవిత పర్యంతం కొనసాగాలని కోరుకుంటారు. తమ బిడ్డలను ఇరువురూ కలిసి ప్రేమ ఆదరాభిమానాలతో, అభివృద్ధి చేయాలనుకుంటారు. కానీ, ఈ ఆకాంక్షలను పూర్తిచేసుకోడానికి పాత సామాజిక పరిస్థితులు, తోడ్పడడం లేదనేది వాస్తవం.

ఒక్క కులంలోనే, ఒక్కతెగలోనె, ఒక మతంలోనే, లేదా ఆర్థికంగా ఒక అంతస్థులోనే వివాహ సంబంధా లేర్పరచుకోవాలనేది ఆయాకాలాలలో,

ఆయాదేశాలలో ఏర్పడిన నిబంధనలు. వివాహబంధమున్నప్పటికీ ఒకరిపై ఒకరికి ఆకర్షణ తగ్గి, గౌరవ ఆదరాలు తగ్గి మరోవ్యక్తులతో సంబంధాలేర్పరచుకోవడం, పారంపర్యంగా వస్తూనే ఉంది. పురుషుడు ఈ పని చేస్తే సంఘం చూచి చూడకుండా ఉంటుంది. స్త్రీ చేస్తే, అది తప్పుగా, పాపంగా, చెడిపోయిందిగా సంఘం నిరసిస్తూ వచ్చింది.

ఈ నియమం, ఈ ఆచరణ, నీతి అని, మతం అని, అమలు జరపడానికి పూనుకొనే ప్రయత్నములు స్త్రీ ఆర్థికంగా తన జీవితాన్ని తానే గడుపుకోగల్గిన స్థితికి వచ్చే కొద్ది, భగ్నమయిపోతూ ఉన్నాయి. వరకట్నాలు, తల్లిదండ్రులే ఎంచి ఏర్పాటుచేసే వివాహాలు, ఒకే వర్ణంలో పెండ్లి జరుగాలనే ఆచారాలు, స్త్రీ జాతికి ఆర్థిక స్వాతంత్ర్యం, తగిన విద్య, వీనితో పాటు స్వతంత్ర వ్యక్తిత్వం పెరిగేకొద్దీ, భగ్నమవుతున్నాయి. పరస్పర పరిచయంతో, పరస్పర ఆదరాభిమానాలతో, గౌరవంతో యువతీయువకులు వైవాహిక సంబంధాలేర్పరుచుకుంటున్నారు.

అయినా, అలా జరిగిన వివాహాలు కూడా, కలసి జీవించేటప్పుడు, ఆర్థిక చిక్కులతో గాని కలసిమెలసి నివసించడంలో పరస్పర సహకారం, తోడ్పాటు, గౌరవం, ఆదరం లోపించినప్పుడు భగ్నమవుతున్నాయి. అప్పుడు ఐచ్ఛికంగా విడిపోవడం, విడాకులు ఇచ్చుకోవడమే నిజమయిన నీతి. ఒక పర్యాయము వివాహము విచ్ఛిన్నమయితే మరోసారి తిరిగి వైవాహిక సంబంధాలు మరొకరితో పెట్టుకోవడము సహజమని చూడాలి. స్త్రీ అలా చేస్తే పాపమని, తప్పని, అనుకునే మూఢాచారం పోవాలి.

జీవితం గడువక తన దేహాన్ని డబ్బును అమ్ముకోవలసి వచ్చే స్త్రీలను, క్రమక్రమంగా దానికి అలవాటు పడిపోయే స్త్రీలను, సమాజంలో పూర్తి మార్పుతీసుకరానిదే, వారిని సరియయిన మార్గంలో పెట్టలేము.

స్త్రీ శారీరకస్వభావాన్నిపట్టి , పురుషుడు బలాత్కారం చేయడం సాధ్యమవుతుంది. దాని పర్యవసానంగా స్త్రీలు గర్భవతులు కావడంకూడా జరుగుతుంది. అలాంటివారిని స్త్రీలను బలాత్కరించే వారిని కఠినంగా శిక్షించాలి. సమాజం, వివిధ దశలలోను, ఏ ఆర్థిక రాజకీయ దృక్కోణమునుండి అయితేనేమి దీనిని తీవ్రనేరంగానే పరిగణిస్తూ వచ్చింది. అలాంటి స్త్రీలు తమ కిష్టము లేని గర్భాన్ని తీసి వేయించుకోడానికి, పూర్తి స్వేచ్ఛ గల్గి ఉండాలి.

స్త్రీకి వివాహబంధం బయట సంతానం కలిగినా అది నేరంగా పాపంగా భావించరాదు. ఆమె బిడ్డకు సర్వసాధారణ సమానహక్కులుండాలి. ఏ స్త్రీ అయినా, తనకిష్టం వచ్చిన పురుషునితో సంబంధం పెట్టుకుంటే, ఆ తర్వాత తన భ్రమలు ఆశలు భగ్నమయి విడిపోయినా, ఇక జీవితమంతా చెడిపోయినదనే అభిప్రాయానికి తావు ఇవ్వక, తన జీవితాన్ని సంతోషప్రదంగా ఉపయోగప్రదంగా నడుపుకోడానికి తిరిగి తిరిగి కృషి చేయాలి. సమాజం, పురుషులు, ముఖ్యంగా యువకులు దానికి తగిన అవకాశం కల్గించాలి. పురుషుని యెడల చూపే ఔదార్యం, సహనం, న్యాయం స్త్రీ యెడలకూడ చూపాలి.

బాలబాలికలు, 12 సంవత్సరాలు పూర్తి అయ్యేటప్పటికి పరస్పర ఆకర్షితులై దేహ సంబంధాలు పెట్టుకోవడం సాధ్యమవుతూ ఉన్నప్పుడు, దాని ఫలాఫలితాలు, దాని విధానాలు వారికి అర్థమయ్యేటట్లు లైంగిక విజ్ఞానాన్ని (సెక్సు విజ్ఞానాన్ని) శాస్త్రీయంగా పాఠశాలలోను, ఇండ్లలో తలిదండ్రుల ద్వారాను వివరించడం సరియయినది. ఉపయోగకరమైనది. తమంతట తాము తప్పుల తడకగా విషయజ్ఞానం పొందడానికన్న ఇదే సరియయిన మార్గం. ఆ విజ్ఞానంతో, అవసరమయినరీతిగా తమజీవితాన్ని సరిదిద్దుకోడానికి ఆస్కారమేర్పడుతుంది.

అలాగే కుటుంబనియంత్రణ పద్ధతుల వలన పరిమిత కుటుంబం వల్ల స్త్రీ ఆరోగ్యానికి, కుటుంబం ఆర్థికంగా సుఖంగ జీవించడానికి అవకాశము కల్గుతుంది. తక్కువమంది బిడ్డలు అయితే తగిన విద్యా శిక్షణ, ఉపాధులు కల్గించడం సాధ్యమవుతుంది. దీనిని గూర్చి కూడా బోధించాలసి ఉంటుంది.

స్త్రీ పురుషులు సమాన గౌరవాదరణలతో, పరస్పర అభిమానాలతో నివసించాలంటే, ఇరువురూ, ఆర్థికంగా స్వయంపోషకంగా ఉండడానికి కావలసిన వృత్తులు, ఉద్యోగాలు చేసుకోవడానికి అలవాటు పడాలి. కుటుంబజీవితం ఆర్థికంగా సవ్యంగా జరగడానికి ఒక్క ఆర్జనమీదకన్న ఇరువురి ఆర్జన వల్ల తేలిక అవుతుంది. నేటి పరిస్థితులలో ఇరువురూ ఆర్జించడం అవసరమవుతుందనేగాక, పరస్పర గౌరవం, సమాన హోదాలో కుటుంబం నడువడానికి కూడా ఇది అవసరం. పైగా స్త్రీపురుషులిరువురూ ఆర్జించడం వల్ల మొత్తం దేశ ఆర్థికోత్పత్తి పెర్గి సమాజమంతా త్వరత్వరగా అన్నివిధాల అభివృద్ధి పొందడానికి తోడ్పడుతుంది. సోషలిస్టు దేశాలన్నింటిలోను స్త్రీ పురుషులందరూ పనిచేసే అవకాశాలుండబట్టే అచ్చట స్త్రీ సమానత, కుటుంబ జీవితము, పెట్టుబడిదారీ

దేశాలకన్న సున్నితంగా ముందుకు పోతూ ఉంది.

భార్యాభర్తలు ఇద్దరూ ఉద్యోగాలలో, వృత్తులలో చేరితే బిడ్డల పోషణ, సంరక్షణ, ఇంటిపనులు, వీటిని నిర్వహించడంలో వచ్చే ఇబ్బందులు, ఇద్దరు కలిసి ఒకరినొకరు సహాయం చేసుకుంటూ ఇరువురూ ఆ పనులన్నింటిని పంచుకొని ఓపికతో చేసుకోవాలి. ఇప్పటిలాగే స్త్రీయే ఇంటి పనులన్నింటిని చూడాలనడం సరికాదు. ఇతర బాధ్యతలతో పాటు తమ తమ ఉద్యోగాలు, వృత్తులతో పాటు, ఇంటి పనులన్నిటిని కూడా తాను కూడా పంచుకొని చేయాలి. తమ స్త్రీల మీద బరువును తగ్గించాలనే ధోరణి పురుషులలో యువకులలో రావాలి.

సహవిద్య, యువతీయువకులు కలసిమెలసి ఆటలు పాటలు, సామాజిక సహచర్యలు వీనిని ప్రోత్సహించాలి. అవి తప్పుదారులకు, తాత్కాలిక ప్రలోభాలకు దారితీస్తాయనే భయంతో, తలుపులు బిగించి నీతి నియమాలు పాటింపజేయడం అసంభవము. స్త్రీ ఒక ఆట వస్తువుగాదని, స్త్రీ కూడా ఒక మనిషి, పురుషునికి వలె ఆత్మాభిమానాలు, తన బాగోగులు చూచుకోగల మనిషి అని, అవగాహన ఉండాలి. పురుషునికి వర్తింపజేసే ప్రమాణాలే స్త్రీ యెడల కూడా వర్తింపజేస్తే, ఈ భయాలుండవు. అయితే స్త్రీకి ఉన్న ప్రత్యేక దేహలక్షణాలు బిడ్డల కనడమన్న విశిష్టబాధ్యతను అవకాశంగా తీసుకొని ఆమెను అణచి పెట్టకుండా ఉండడానికి తగిన అదనపు రక్షణలు,సౌకర్యాలు, ఆమెకు కలుగ జేయాలసి ఉంటుంది.

అయితే ఇవి అన్ని సోషలిస్టు సమాజాలలో, అది కూడా బాగా అభివృద్ధి చెందిన దశలోనే పూర్తిగా సాధ్యమవుతాయి. అలాంటి సమాజాన్ని నిర్మించేవరకు, యువజనులు, ముఖ్యంగా యువకులు, తమ వ్యక్తి జీవితాన్ని, స్త్రీల యెడల తమ ప్రవర్తనను, తాము చదువుకొనే కాలంలో తమను, తమ వైవాహికజీవితాలను కుటుంబజీవితాలను ఈదృక్కోణంతో ఈ ఆశయంతో మలుచుకోవాలి.

అప్పుడే వారు కోరుకొనే నూతన రాజకీయాల కోసం ఆశయాల కోసం నేటి దోపిడి సమాజంలోని కుళ్ళు రాజకీయాలను, నీతినియమాలను అధిగమించి పని చేయగలుగుతారు.

# జాతీయ సమైక్యము

ఒక సమాజంలో అంతర్గతలోపాలు, హద్దులు దాటి, ఆనాటి సమాజ గీటురాళ్ళకు ప్రమాణాలకు కూడా మించి బయటపడినపుడు, వానికి వ్యతిరేకంగా ఆ సమాజంలోని శాసకులు దూరదృష్టి గల విజ్ఞులు వీనికి వ్యతిరేకంగా ప్రచారం, చర్యలు తీసుకుంటారు. నేటి సమాజంలోని లోపాలు, అవి వ్యక్తమవుతున్న రూపాలకు వ్యతిరేకంగా నూతనసమాజనిర్మాతలయిన అణచబడుతున్న వర్గాల తరపున విజ్ఞులు మొదట ప్రచారం ప్రారంభిస్తారు. ఈ ప్రచారములు ఈ చర్యలన్నీ సంఘములో సమాజంలోని బహిర్గత లోపాలను దిద్దడానికి జరిపే ప్రయత్నాలు. ఈ ప్రయత్నాలు చేసే వారంతా సంఘ సంస్కర్తలు. వీరి ప్రయత్నాలు వివిధరంగాలలో సాగినా, వాని విజయాలు పరిమితంగానే ఉంటాయి.లోతుగా, అసలు రోగానికి చికిత్సగాక పై పై జ్వర చిహ్నాలకు తాత్కాలిక చిట్కాలుగా మాత్రమే ఇవి తోడ్పడుతాయి. అయినా, అభివృద్ధికాముకులంతా వీనిని బలపర్చుతారు. ఏ మేరకు సాధించిన ఆ మేరకు ఉద్యమము ముందుకు పోయి అసలు ఈ సంఘ రుగ్మతలకు కారణమయిన సమాజనిర్మాణంవైపుకే ప్రజాఉద్యమ వెల్లువ మరల్చడం తేలిక అవుతుంది. నేటి సమాజాన్ని సమూలంగా మార్చివేసి దాని స్థానాన నూతన సమాజ నిర్మాణం చేసినప్పుడే, పూర్తిగా సంఘసంస్కరణలు జయప్రదమవుతాయి. రాజకీయాలతో సంబంధంలేకుండా పాక్షిక సంఘసంస్కరణలు కూడా వ్యాప్తంగా జయప్రదం గావు.

కులమత భేదాలు, వానివలన గలిగే స్పర్థలు, అస్పృస్యతా నివారణ, వర్ణాంతర వివాహాలు, వరకట్నాలు, బాల్యవివాహాలు, వితంతు వివాహాలు, స్త్రీల హక్కులు, ఇలాంటివి ఎన్నెన్నో ఉదహరించవచ్చు. ప్రభుత్వం శాసనాలు చేసినా అవి పరిమితంగానే, అమలులోకి వస్తున్నాయి. సమాజం పూర్తిగా మార్పుచేయనిదే, మార్పు చేసిన తర్వాత, చాల సంవత్సరాలు పాతకాలపు భావ ప్రపంచాన్ని తొల్గించి నూతన భావప్రపంచాన్ని ఏర్పరచనంత వరకు ఇవి విజయవంతం కాజాలవు.

కులతత్వాలు, మతతత్వాలు, ప్రాంతీయ తత్వాలు నిన్నటితరంవారు తెచ్చినవి కావు. పాత సమాజాల, నిర్మాణ, సిద్ధాంత కొనసాగింపే ఈ విచ్చిన్న విధానాలు. విదేశాలలో పెట్టుబడిదారీ సమాజం అభివృద్ధి చెందే కొద్దీ వీనిని ఈ వికృత రూపాలలో లేకుండా చేయగల్గింది. సర్వసాధరణంగా దేశీయత,

జాతీయతత్వం ప్రబలి వాని స్థానాన రంగు భేదం , వలసదోపిడి, కార్మిక వర్గ దోపిడి, ఇవి క్రొత్తగా పొడమో, లేదా అదివరకు ఉన్నవే మరలా పెరగడమో జర్గింది.

మన భారతదేశం కూడా స్వాతంత్ర్యానంతరం, పాతకాలపు సమాజ అవశిష్టాలు వేరూనికొనిపోయిఉన్నవి కొనసాగుతూనే ఉన్నాయి. ఆదిమతెగల సమాజకాలపునాటి తెగలు నేడు కులాలు రూపంగా బానిస, భూస్వామిక సామాజిక కాలాలనాటి అస్పృశ్యత, వెట్టిచాకిరి, వ్యవసాయకార్మికుల కిచ్చే నికృష్ట జీతాలు విపరీత వడ్డీనాములు, భూస్వామిక పెత్తందారీతనము విపరీత కౌలుదోపిడి, వానితోపాటు దేశీయ పెట్టుబడిదారీ దోపిడి, విదేశీ దోపిడి ఇవన్నీ మిశ్రితమయిన సమాజం మన భారతదేశ సామాజిక వ్యవస్థ.

పాశ్చాత్య దేశాలలో, పెట్టుబడిదారీ విధానం పెంపొందేకొద్దీ, ఒక భాషను మాట్లాడుతూ, ఒక భూఖండంలో ఆర్థిక సంబంధాలు పెనవేసుకొని అభివృద్ధి చెంది, చారిత్రికంగా ఒక కళావిజ్ఞాన మనోభావప్రపంచం కల్గి ఒక జాతిగా ఆయా దేశాలలో రాజ్యాలు ఏర్పడ్డాయి. మొదటి ప్రపంచయుద్ధానంతరం ఈ పరిణామము పూర్తి అయింది. దీనికి కొన్ని మినహాయింపులు ఉన్నాయి. సోవియటు యూనియనులో వివిధ భాషలు మాట్లాడే వివిధ జాతుల రాజ్యసమ్మేళనం, సోషలిస్టు సోవియటు యూనియనుగా అభివృద్ధి చెందుతూ ఉంది.

కాని, భారతదేశంలో, బ్రిటిషు పరిపాలనా ఫలితంగా భాషా రాష్ట్రాలు ఏర్పడలేదు. పెట్టుబడిదారీ వ్యవస్థ పరిపక్వం పొందలేదు. పాతకాలపు భేదాలు, కులాలు, మతాలకు ప్రాముఖ్యతనిస్తూ, బ్రిటిషు సామ్రాజ్యవాదులు విభజించి పాలిస్తూ వచ్చారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కూడా అధికార వర్గం, భాషా ప్రయుక్త రాష్ట్రాలనేర్పరచడానికి మరో 10 ఏండ్లు తీసుకుంది. దీని అవశేషాలు, రాష్ట్ర సరిహద్దు తగాదాలుగా నేటికీ బద్దలవుతూనే ఉన్నాయి.

వెనకబడిన కులాలు, మతాలు, ముస్లిము మైనారిటీ సమస్యలు, షెడ్యూల్డు కులాలు (హరిజనులు తదితరులు) షెడ్యూల్డు ఆదిమ తెగలు, వెనకబడిన రాష్ట్రాలు, రాష్ట్రాలలోనే వెనకబడిన ప్రాంతాలు, ఇవి అన్నీ సమస్యలుగా స్వతంత్ర భారతం పరిష్కరించాల్సిన స్థితి ఏర్పడింది. రాష్ట్రాలకు కేంద్రానికి ఉండవలసిన సంబంధాలు, రాష్ట్ర స్వపరిపాలనాధికారాలు ఏమేరకు ఉండాలి కేంద్రప్రభుత్వాధికారాలు ఏమేరకు? వీనికి సమన్వయం ఏరీతిగా

ఉండాలి అనే సమస్యలు ముఖ్యంగా ముందుకు వచ్చాయి.

భూస్వామిక విధానాన్ని రద్దు చేసి, పారిశ్రామికాభివృద్ధిని అన్ని రాష్ట్రాలలోను అన్ని ప్రాంతాలలోను సాధించినప్పుడు. అందరికీ పని, అందరికీ జీవిత భృతి గ్యారంటీ చేసినప్పుడే ఈ సమస్యలకు పూర్తి పరిష్కారం సాధ్యమవుతుంది. ఈ లోపల ఈ తేడాలను, వెనుకబాటును, నిరుద్యోగ పరిస్థితిని ఆధారం చేసుకొని, వివిధ విచ్ఛిన్న పోకడలను అభివృద్ధి నిరోధక భూస్వామి, పెట్టుబడిదారీ దోపిడీ శక్తులు పార్టీలు పెంపొందించడం, దేశ విచ్ఛిత్తికి దారితీస్తున్నాయి. పాలకవర్గ పార్టీకూడ, ఈ సమస్యలను ప్రజాతంత్ర పునాదులమీదగాక వివిధ దోపిడీవర్గాలమధ్య, రాజీబేరాలాడి ఇరువురను సంతృప్తి పరచాలంటూ, ఈ తగాదాలను వాయిదాలు మీద వాయిదాలు వేస్తూ గడిపి వేస్తూ ఉంది. అణగద్రొక్క బడుతున్న షెడ్యూల్డు కులాలకు, జాతులకు, వెనుకబడిన కులాలకు, ముస్లిము మైనారిటీలకు, భాషా మైనారిటీలకు వెనుకబడిన ప్రాంతాలలోని ప్రజలకు ఇచ్చిన హామీలను, రాజ్యాంగచట్టంలో గ్యారంటీ చేయబడిన హక్కులను అమలు జరుపకుండా, ఈ అన్యాయాలను, వెనకుబాటును మరింత పెంచి పోషిస్తూ ఉంది.

అందరికీ పని, వృత్తులు, జీవితభృతి గ్యారంటీ చేసేలోపల ఉన్న ఉద్యోగాలలో, ఉన్న పనులలో ఉన్న విద్యా వసతులలో, మైనారిటీ వర్గాలకు, వెనకబడిన వర్గాలకు, వెనకబడిన ప్రాంత ప్రజలకు జనాభానిష్పత్తి మేరకు అయినా కేటాయించాలి. అన్ని స్థాయిల్లో పరిపాలనా యంత్రాంగంలో దామాషా ప్రాతినిధ్యం అన్ని రంగాలలోను ప్రవేశపెట్టి వీరికి తగిన స్థానం కలుగ జేయాలి. ప్రజాతంత్రపద్ధతులలో ప్రజాభిప్రాయానికి అనుకూలంగా పరిపాలనను సాగించాలి.

ఆలిండియా సర్వీసులను రాష్ట్రాల మీద రుద్దరాదు. భాషా రాష్ట్రాల ప్రాతిపదికగా నిజమైన ప్రజాతంత్ర పద్ధతులతో పరిపాలన సాగిస్తూ దేశ రక్షణ, విదేశాంగవ్యవహారాలు, విదేశాంగ వాణిజ్యం, కరెన్సీ, దేశరక్షణకు గావలసిన రవాణా సౌకర్యాలు తప్ప మిగిలిన విషయాలన్నీ ఈ భాషారాష్ట్రాలకు వదిలి వేయాలి. కాని, ఆర్థిక ప్లానింగు, భారీ పరిశ్రమలు, ఒక రాష్ట్రానికి పరిమితము కాని ఏ సమస్యనైనా తగాదా వచ్చినప్పుడు సమన్వయపరిచే అధికారము, కేంద్రానికి ఉండాలి. వివిధ రాష్ట్రాలకు-సంబంధించిన నదీ జలాశయాలు, ఇర్రిగేషను, విద్యుచ్ఛక్తి, ఫ్యాక్టరీలు, పరిశ్రమలు, వాణిజ్య రవాణా సౌకర్యాలు పన్నులు ఇవన్నీ

కేంద్రం నిర్వహిస్తూ ఉండాలి. కేంద్రం వసూలు చేసే పన్నులు, ఆదాయంలో నాల్గింట మూడు పాళ్ళు రాష్ట్రాలకు ఆర్థికస్వయంసమృద్ధికోసం ఇవ్వాలి.

రాష్ట్రాలకు పూర్తి స్వపరిపాలనాధికారం ప్రజాతంత్ర పునాదిమీద ఏర్పడాలనీ, బలీయమైన ప్రభుత్వం ఉండాలని అభివృద్ధి కాముకులు, నూతన సమాజ నిర్మాణాభిలాషులు కోరుతారు. ఇది ఒక్కటే జాతీయ సమైక్యానికి దారితీసే పథకం.

హిందీభాషనే దేశానికంతా పరిపాలనాభాషగా ప్రవేశపెట్టే ప్రయత్నం, త్రిభాషా పథకం, భాషా రాష్ట్రాలలోకూడ మైనారిటీ భాషలకు తగిన రక్షణ ఇవ్వకపోవడం, మాతృభాషలను ఉన్నతవిద్యలో విశ్వవిద్యాలయాలలో బోధనా భాషలుగా అమలు పెట్టడానికి నిరాకరించడం, ఇవి భాషా దురహంకారానికి నగ్నరూపాలు. ఒకే భాషలో దేశమంతటా ఉన్నతవిద్య నభ్యసించడంవల్ల మేధావివర్గం పరస్పరం సంప్రదించుకొనే అవకాశాలు ఎక్కువవుతుందనే వాదన దేశ జనాభాలో నూటికి 5 గురికే ఉన్నత విద్య, అన్ని రంగాలలో పెత్తనం, అదొక ప్రత్యేక వర్గంగా మిగిలిన 95 మందిపై పెత్తనం చేయడానికి పనికి వస్తుందేమో కాని జనబాహుళ్యంతో సంబంధాలు లేనివారవుతారు. ఉన్నత విద్య ఉన్నత అధికార పదవులు ప్రజాబాహుళ్యానికి అందుబాటులో లేకుండా చేయడమవుతుంది. పరస్పర సంబంధాలు, దేశ విదేశ వ్యవహారాలలో పాల్గొనడం కోసం అవసరమయిన వారు మరో భాషను నేర్చుకుంటారు. దుబాషీల ద్వారా పని గడుపు కోవచ్చు. అంతేగాని పరాయిభాషలో ఉన్నత విద్యనభ్యసించాలనడం అర్థ విహీనమయిన వాదన. ప్రపంచంలో మరెచ్చట ఈ వాదన, ఈ ఆచరణ లేదు.

నేడు వెనుకబడి ఉన్న ప్రజలు – ముఖ్యంగా వెనకబడిన ప్రాంతాలలో వీని సంఖ్య మరింత అధికంగా ఉంది – తమకు పని, జీవిత భృతి కావాలన్న అసంతృప్తి వెల్లడిస్తూ పోరాడుతూ ఉన్నా, వారి నేటి స్థితికి కారణభూతమయిన భూస్వామిక విధానానికి పెట్టుబడిదారీ పారిశ్రామిక విధానానికి నేటి పరిపాలనాయంత్రాంగానికి వ్యతిరేకంగా అన్ని కులాలు మతాలవారు, అన్ని ప్రాంతాలలోని వెనుకబడిన వారినంతా కలిపి పోరాడడానికి అభ్యుదయ కాముకులంతా, యువజనులంతా కృషిచేయాలని ఉంటుంది. అలా ఐక్యం కానివ్వకుండ భూస్వామిక, బడా పెట్టుబడిదారీ దోపిడీ శక్తులు, వారిలో చీలికలను పెంపొందించడానికే, తప్పుడు వాదనలు, నినాదాలు చేస్తున్నారు. ప్రజలను అణచివేయడానికి, తమ సొంత

సేనలను తయారుచేస్తున్నారు. ఒక ప్రాంతం వెనుకబడి ఉంటానికి, మరో ప్రాంతపు వాసులని, ఒక కులంవారు, ఒక మతం వారు, ఒక భాష వారు వెనకబడి ఉంటానికి కారణం మరో కులం వారని, మరోమతంవారని, మరో భాషవార్దని, అసలు కారకులను దోపిడీదారులు కప్పిపెట్టుతూ, పెడదోవల త్రొక్కిస్తున్నారు. అందుచే ఈ దోపిడీదారుల ఎత్తుగడలను విచ్ఛిన్నం చేయడానికే, ఉన్నమేరకు వెనుకబడిన కులాలకు వెనుకబడిన ప్రాంతాలకు, వెనుకబడిన రాష్ట్రాలకు చదువుల విషయంలో, ఉద్యోగాల విషయంలో వ్యాపార పారిశ్రామిక వ్యవసాయకాభివృద్ధిలో ప్రాధాన్యత నివ్వాలని, జనాభానిష్పత్తిలో వారి స్థానాలను హక్కులను కాపాడాలని అభ్యుదయ నాయకులు పట్టుబడుతున్నారు. ఆ దోపిడీ విధానమును సమూలంగా నాశనం గావించితేనే ఈ సమస్యను పూర్తిగా పరిష్కరించగలరని, ప్రజలను సమాయత్తం చేస్తున్నారు. ప్రజల సమస్యలను ఆయాభాషారాష్ట్రాల (జాతుల) పరిమితులలో పరిష్కరించడానికి, అభ్యుదయ నాయకులు ప్రయత్నిస్తారు. ఒకేభాష మాట్లాడే ప్రజలయితే వారిని సమీకరించడానికి, సంఘటిత పర్చడానికి, ప్రజాతంత్ర హక్కులు, స్వపరిపాలనాధికారం సాధించుకోడానికి, తమ సమస్యలను పరిష్కరించుకోడానికి, ఈ పని సాధ్యమవుతుంది. ఈ భాషా రాష్ట్రాలు ఎంత పెద్దవయితే, అంత ఎక్కువగా సమస్యలను పరిష్కరించుకోడానికి, ఆర్థికాభివృద్ధిలో ముందుకు పోవడానికి సాధ్యమవుతుంది; దోపిడీ వర్గాలు పెంపొందిస్తున్న కుల, మత సంకుచిత ప్రాంతీయ తత్వాలను, ఒక భాషా జాతికి, మరో భాషా జాతికి వైషమ్యాలను పెంచే చర్యలను అరికట్టడానికి కూడ తోడ్పడుతుంది.

భాషారాష్ట్రాలలో ప్రజాతంత్ర స్వపరిపాలనాధికారాలకోసం పోరాడుతూ, వివిధభాషారాష్ట్రాలు, రాష్ట్రప్రజలు భారతదేశ సమైక్యత బలిష్ఠతమము గావించడానికి, కలిసి కృషిచేయవలసి ఉంటుంది. భారతదేశమంతటా ప్రజాతంత్ర ప్రజాభ్యుదయం, దోపిడీ దారుల పెత్తనము లేని నూతన సమాజమేర్పడే కొలది, వసుధైక కుటుంబంకోసం మనపాత్రను మనము నిర్వహించగల్గుతాము. అంతర్జాతీయత, దేశీయత, ఆ భాషా రాష్ట్రాల (జాతుల) స్వపరిపాలన పరస్పర విరుద్ధమయిన పోకడలు కావు; అవినాభావ సంబంధం కల్గినవి. అంతర్జాతీయ సౌభ్రాతృత్వం దేశీయచట్రంలో, దేశ ఐక్యత, దేశీయత భాషారాష్ట్రాల చట్రములో అభివృద్ధి చేయగలము.

ఈ మహోన్నత ఆశయసాధనకోసం యువతరం తమ పరిసర ప్రాంతాలలోని పీడిత ప్రజలలో కలిసి, వారి పోరాటాలను నడుపడానికి ముందుకు రావాలి. అది వారి కర్తవ్యం, వారి భవిష్యత్తు, దేశభవిష్యత్తు, మానవజాతి భవిష్యత్తు దానిపై ఆధారపడి ఉంది.

సోషలిస్టు సమాజ నిర్మాణానికి యువజనుల తిరుగుబాటు అవసరం. యువజనులను నేడు ఎదుర్కొంటున్న ప్రతి ముఖ్య విషయాన్ని దైనందిక జీవితంలో ఎదుర్కొనే ప్రతిసమస్యను పరిష్కరించుకోవాలంటే రాజకీయాలలో, యువజనులు చైతన్యయుతంగా పాల్గొనవలసి ఉందనేది పై వివరణ, స్పష్టం చేస్తూ ఉంది.

రాజకీయాలలో ప్రతి ఒక్కరూ ఏదోరీతిగా పాల్గొంటూనే ఉన్నారు. యువజనులు చైతన్యయుతంగా రాజకీయాలలో పాల్గొన వలసిన అవసరాన్ని గుర్తించినా రాజ్యాంగం ప్రసాదించిన పోరాడే పద్ధతిని, ప్రజాస్వామ్య పద్ధతిలో పోరాడేపద్ధతిని యువతరం ఎందుకు అవలంబించలేకపోతున్నది? శాంతి భద్రతలకు భంగం కల్గిస్తూ అశాంతికరమయిన పరిస్థితులను ఎందుకు వెలరేపుతున్నారు? క్రమశిక్షణారాహిత్యం హింసాప్రవృత్తి ఎందుకు? రాజ్యాంగం ప్రసాదించిన ప్రాథమిక హక్కులను ఎందుకు వినియోగించుకోవడం లేదు? అనే ప్రశ్నలు వస్తున్నాయి.

రాజ్యాంగ చట్టము, నేడు దేశములోనున్న పెట్టుబడిదారీ భూస్వామిక దోపిడీ విధానాన్ని రక్షించడానికి ఏర్పరచుకున్న ఉక్కుచట్టం తప్ప మరేమీ కాదు. ప్రజాబాహుళ్యానికి జీవన మరణ సమస్యలయినా, ప్రతి ఒక్కరికీ పనిహక్కు, జీవితభృతి హక్కు, విద్యాహక్కు, సాంఘిక సంక్షేమ హక్కు, ఉచిత వైద్య చికిత్స హక్కు ప్రాథమిక హక్కులుగా నిర్దేశించబడలేదు. ఇవి ఆశయాలని, ఆశలని ఒక ప్రత్యేక అధ్యాయంలో చేర్చారు. కాని, ఆస్తి హక్కు, వాణిజ్య పారిశ్రామిక స్వేచ్ఛా హక్కు ఆస్తి పరులకు గ్యారంటీ చేశారు.

వాక్సభా పత్రికా సంఘటనా స్వాతంత్ర్యాలను, ప్రాథమిక పౌరసత్వ హక్కులుగా నిర్దేశించినా, వారంటు లేకుండా అరెస్టు విచారణ లేకుండా నిర్బంధించడం, ప్రాణదండన వేయడం నిషేధించినా, వీనికి పెట్టిన మినహాయింపులు ద్వారా, ఈ హక్కులన్నీ శూన్యం చేశారు. పీడిత వర్గాలమీద, తీవ్ర పోలీసు నిర్బంధం, విచ్చలవిడి అరెస్టులు, విచారణ లేకుండానే నేరము ఆరోపించకుండానే చిత్రవధలు, గత 25 సంవత్సరాలలో కొల్లలుగా జరిగాయి.

ఓటు హక్కు, ప్రజా ప్రతినిధులతో ఎన్నుకొన్న శాసన సభల ద్వారా పరిపాలనా జరగాలన్న హక్కు ధనాధిపతులముందు, అధికార బృందము ముందు, పాలకపార్టీవిశృంఖలవ్యవహారంతో, గవర్నర్ల, ప్రెసిడెంటు పరిపాలనతో నామమాత్రం చేశారు. ఎన్నికలు తమకు వ్యతిరేకమవుతాయను కున్నప్పుడు ఎన్నికలను అవినీతి దౌర్జన్య పద్ధతులతో, ఓటు చీటీలను చించి పెట్టెలను నింపి తారుమారు చేస్తున్నారు. అధికార బృందం, మంత్రులు, చివరకు న్యాయాధీశులు కూడా అవినీతికి అలవాటుపడి, దోపిడీవర్గాలను, చివరకు తమ వ్యక్తిగతలాభాలకు ఆర్థిక రాజకీయ సామాజిక జీవితాన్ని కలుషితము చేశారు.

ఈ పరిస్థితిలో యువజనులు ఏ ప్రజాతంత్ర పద్ధతులు అవలంబించగలరు? నిరంతరం దోపిడీ వర్గాల పాలక యంత్రాంగపు హింసా దౌర్జన్యానికి గురి అవుతున్న ప్రజలు, యువజనులు హింసాపద్ధతులను, తిరుగుబాటు పద్ధతులను అవలంబిస్తున్నారని వేరమాపాదించడం వల్ల ప్రయోజనమేమిటి?

యువజనులలో వస్తున్న ఈ తిరుగుబాటు న్యాయమైనది అవసరమయినది. కాని, ఈ తిరుగుబాటు చాల సందర్భాలలో పెడదారులు బట్టుతూ ఉంది. ఇది దురదృష్టకరం. దీనికి కారణాలు, కారకులను చూస్తే ఈ పెడదారులు, ప్రధానంగా కలిమి బలిమి గల వర్గం నుండి వచ్చిన వారిలో ప్రధానంగా ప్రస్ఫుటమవుతున్నాయి. సరియయిన నిర్దిష్ట ఆశయంలేక, దానిని చేరడానికి తగిన కార్యక్రమము పంథా లేక, తిరుగుబాటే సర్వం ఏదో ఒరగబెట్టుతుందనే అరాచక ఆలోచన. తాత్కాలిక భావోద్వేగం దీనికి దారితీయవచ్చు.

అందుచేతనే, ప్రజాభ్యుదయ నాయకులందరూ యువజనులముందు పీడిత ప్రజల విముక్తిని నూతన సమాజనిర్మాణాన్ని సోషలిస్టు సమాజ నిర్మాణాన్ని నిజమైన ఆశయంగా కర్తవ్యంగా వారి ముందు పెట్టాలి. ప్రస్తుత పెట్టుబడిదారీ భూస్వామిక దోపిడీ సమాజాన్ని కూలద్రోసి ఈ సమాజం నిర్మించడానికి పట్టణ కార్మికులు, వ్యవసాయ కార్మికులు, భూమి మీద కష్టించి పండించే రైతులు, మధ్యమ వర్గ ప్రజలు, మేధావులు, ముందుకు రావలసి ఉంటుంది. చివరకు చిన్న, మధ్య, పారిశ్రామికులను వర్తకవాణిజ్య జీవులనుకూడ కలుపుకొని విశాలప్రజా సంఘటనద్వారానే దీనిని

సాధించగలము. కొలదిమంది యువకులు ఎన్నిత్యాగాలు చేసినా, ప్రాణాలు బలిపెట్టినా, అంతమాత్రానికే దీనిని విజయవంతం చేయలేము.

ఈ ప్రజా సమీకరణకు, ఓపికతో, అనేక అష్టకష్టాలు పడుతూ ఒడుదొడుకులకు గురి అవుతూ పనిచేయాలని ఉంటుంది. వేలకొలది కాదు లక్షలకొలది యువతీయువకులు తమ జీవితాన్నంతా దీనికై వినియోగించడానికి ముందుకు రావాలి. ఈదోపిడీసమాజంలో అవకాశమున్న మేరకు చదువులలో, ఆటలలో, వ్యాయామక్రీడలలో పాల్గొని తన దేహదార్ఢ్యాన్ని పెంపొందించుకోడానికి తన విజ్ఞానాన్ని పదిమందిలో ప్రథమశ్రేణిలో వచ్చి ప్రజలకు అన్ని సమస్యలను వివరించగల శక్తి, నడుపగల్గిన శక్తి, శత్రు వర్గాల కుంటివాదనలకు జవాబు చెప్పగల స్తోమత, సాధించుకోవాలి. ప్రతికూల సిద్ధాంతాలను చించి చెండాడంతో పాటు ప్రజలముందు సరియయిన సిద్ధాంతాలకు ఆదర్శంగా నిలచి ఉద్యమాన్ని ముందుకు తీసుకపోవాలి. శత్రువు యెడల ద్వేషం, పీడిత ప్రజల ముందు వినయ నమ్రతలు, గౌరవాభిమానాలు ఉండాలి. వారినుండి నేర్చుకోడానికి ఎల్లప్పుడూ కృషి చేయాలి. తన జీవితమును నిరాడంబరంగా గడుపుకుంటూ తనప్రవర్తన అన్నివిషయాలలో ఆదర్శప్రాయంగా ప్రజాబాహుళ్యం 'బళిరా' అనే రీతిగా ఉండాలి. ఎట్టి త్యాగానికయినా తయారయి ఉండాలి. క్రమశిక్షణ, ఉక్కుశిక్షణతో తన జీవితాన్ని, ప్రజాశ్రేయస్సే నీతికి గీటురాయిగా పెట్టుకొని జీవిత పర్యంతం కృషి చేయాలసి ఉంటుంది.

అప్పుడే యువతరము విజయం సాధించగల్గుతుంది. ప్రజాభ్యుదయం, సోషలిస్టు సమాజం సాధించగల్గుతుంది.

# యువతరం – సంఘసంస్కరణ

కె.వి. రమణారెడ్డి

"పుట్టుకతో వృద్ధులు" అయిన యువకులే ఎప్పుడూ అధిక సంఖ్యాకులుగా ఉంటూన్న సమాజం మనది. గతానుగతికత్వందాని జీవన తత్వం. లేకుంటే, పంక్తి బాహ్యత, వెలి, బహిష్కారం ఇలాంటి సాంఘిక వాతావరణం జడిమకైతేనే అనుకూలిస్తుంది. అందుచేత సమాజంలోగల తదితరులెంతో యువకులూ అంతే. పుడుతూ గిడితూ ఉంటే పుట్టచెదలే గుర్తు వస్తుంది.

సంస్కరణ పరిమిత ప్రయోజనం గలిగినది. దానిచూపు బారెడో మూరెడో. సమాజాన్ని పునర్నవీకరించడందాని శక్తికి మించినపని. మాట్లో మాసికలో, అతుకులో రిపేర్లో తప్ప, మొత్తంగా మూలమట్టంగా అది సమాజాన్ని మార్చగోరదు. పైగా, అది వ్యక్తి ఆశ్రితం. సమూహాలను కదిలించి ఆవేశిస్తేనేగాని, భావాలేవీ మహోద్యమాలను కలిగించలేవు. సంస్కరణం రణం అయిన సన్నివేశాలు తెలుగువారి చరిత్రలోకొద్ది. అలాంటి సన్నివేశాలలోనే యువకులు పోటుబంట్లు కాగలుగుతారు.

మనకు వీరేశలింగయుగం అలాంటి ఒక గొప్ప సన్నివేశం. వీరేశలింగం ఉద్యమానికి నిజమైన అండదండలు సమకూర్చింది ముఖ్యంగా ఇంగ్లీషు చదువుల కొత్తతరమే. రఘుపతి వేంకటరత్నం నాయుడుగారి పదసన్నిధానంలో దేవుని పితృభావానికి జతగా మానవుల సౌభ్రాతృభావాన్ని ఒంటబట్టించుకొన్నదీ సమాజవృక్షం వేసిన కొత్త పిందెలే.

జాతీయోద్యమ సంరంభం ఆబాలవృద్ధులనందరినీ రాజకీయ బంధ విమోచనం వైపు త్రిప్పివెయ్యకముందే, బ్రహ్మసమాజం కొత్తనీరై దిగబడి వీరేశలింగ సంస్కరణ తాలూకు పాతనీటిని తోసివేసింది. తిలక్‌కూ అగార్కర్‌కూ నడుమ సాగిన వివాదం, రాజకీయ విమోచనానంతరం సంఘసంస్కరణా లేక దీని ఆధారాన అదా అనే విషయం మీద సాగింది. సంస్కర్తలూ తదభిమానులూ 'రాజభక్తులు'గా దూరుపడ్డారు సరే, వాళ్ళు రాజకీయాలలో 'లిబరల్సు' అయినా అయ్యారు. తిలక్ ప్రభృతులు 'అతివాదులు' అనిపించుకుంటూనే, సంఘ ప్రమేయాలలో మాత్రం 'కన్సర్వేటివులు', మరీపోతే, 'రియాక్షనరీలు' అయ్యారు. అదే చిత్రం. హైందవ

పునరుద్ధరణోద్యమానికి దివ్యజ్ఞాన సమాజం హేతువాద [illegible]రతను సమకూర్చింది. మరి, ఈ ఉద్యమాల వుధృతికి యువకులు తోడ్పడలేదా?

వచ్చింది గాంధీయుగం. వేష భాషలు మొదలు అభిమానాలు అభిప్రాయాలదాకా గాంధీ హైందవ సంప్రదాయానికి రూపకల్పన చేశాడు. అయితే లోకులకు మాత్రం సంస్కరణాభిమానిలా కనిపించగల నేర్పు గాంధీది. సంఘచక్రం చెక్కుచెదరనివ్వకుండానే, ఆ పరిధిలోనే, మార్పులు - అస్పృశ్యతా నివారణం, మద్యపాన నిరసనం, వగైరా - ఆయనను సంస్కర్త అనిపించగలిగాయి. అంబేద్కర్‌కు నిమ్నవర్గాలలో దళితవర్గాలలో గల రాజకీయ ప్రాభవాన్ని తప్పించి, కాంగ్రెసు ఒక్కటే సమస్త భారతజాతికి ప్రతినిధి అని, హరిజనోద్యమం క్రియలో నిరూపించగోరింది. గాంధీ వర్ణవ్యవస్థను ప్రశ్నించనూ లేదు. సనాతన 'ధర్మ' పరాయణతను విడనాడనూలేదు. సంస్కర్తల ప్రభావాన్ని అరికట్టేందుకే గాంధీప్రేరిత, నామమాత్రక సంస్కరణ ప్రయత్నాలు సాగాయి. అయినా, జాతీయోద్యమ కాలంనాటి ఆదర్శ వాదులైన యువకులకు ఇదే పదివేల పెట్టు అనిపించింది. పల్నాటి బ్రహ్మనాయుని కాలపు 'మాధవకులము' మళ్ళీ రూపొందుతుందా అని భ్రమపెట్టింది.

నిజానికి ఈ శతాబ్ది ఉదయకాలంలోనే ఇంతకంటే అచ్చమైన సంస్కరణ ప్రయత్నాలు ఆంధ్రదేశంలో నడిచాయి. సీమ చదువులకు వెళ్ళి వచ్చి 'కాలాపానీ'ని దాటిన విద్యాధికులైన యువకులకు వెలి తప్పించి విందులు కుడిపి, బరంపురంలోనూ బందరులోను రాజమండ్రి గుంటూరులలోనూ పూర్వాచారపరాయణుల నెదిరించడం జరిగింది. వీళ్ళే వీరేశలింగానికి నిజమైన వారసులు. సంస్కరణ పెదవులు దాటక, బ్రహ్మసమాజ ప్రార్థన గీతాలు సంతపాటలై, హైందవ సమాజమనే కులసంకీర్ణలోకంలో మరో కులంగా రూపొందిన మతవిహితైకమతులు కొన్నాళ్ళకు ఆషాఢభూతులు గాక తప్పలేదు. నాయుడుగారు ప్రారంభించిన కళావంతుల ఉద్యమం నడమంతరంలో ఆగిపోయింది. వీరేశలింగం రాజమండ్రిలో విగ్రహంగానే మిగిలిపోయాడు. సంస్కర్తలది ఒకదారీ సమాజానిది ఇంకోదారీ. సమాజవ్యాధి మళ్ళీ తిరగబెట్టింది. సంస్కరణ సార్వత్రికం కాలేదు. విద్యావంతులలోనైనా అది అతికొద్దిభాగాన్నే కదిపింది. కింది కులాలు దిక్కు దివాణం లేకుండా ఉండిపోయాయి. చింతలపాటి రఘునాధవర్మ, దరిశి చెంచయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ, ఆడుసుమిల్లి గోపాలకృష్ణయ్యలవంటి రెండో శ్రేణి

రెండో తరం సంస్కర్తలు ఇంత పెద్దసంఘాన ఏదో ఒకమూల ఎంతో కొంత కృషి చేశారు. మహాజనరాశి వేసిన చోటనే వుండిపోయిన్నప్పాతగొంగళీ. త్రిపురనేని రామస్వామి చౌదరి 'వివాహవిధి', చలం 'ప్రేంవ్', ముద్దుకృష్ణ యువభావ 'జ్వాల', హేతువాదాన్ని నూది మోపినంతగా భావలోకంలో ప్రవేశపెట్టాయి. కమ్యూనిస్టు ఉద్యమ ప్రారంభకాలాన తిరిగి ఊపిరిపోసుకున్న వీరేశలింగం, ఆ ఉద్యమం పెరిగినట్టే పెరిగి ఇంతలో విరిగిపోయాక, ఆ కమ్యూనిస్టుల చేతుల్లోనే చేతల్లో మళ్లీ మరణం పొందాడు. భూతకాలంలో నివసిస్తూ భూస్వామ్య ఆర్థికవ్యవస్థలో చెడి పడి వున్న సంఘం, భావాల్లో వెనకబాటుతనాన్ని చూపడం వింత కానే కాదు. వస్తుప్రపంచంకంటె భావలోకం ఎప్పుడూ వెనకే. చింత చచ్చినా దాని పులుపు చావదు. ధనస్వామ్య వ్యవస్థ బలపడుతూన్న నేడు కూడా దీని తాలూకు భావాలు చలామణికావడం లేదు. మన సంఘానికి దీర్ఘక్షయ.

మరి, దీన్ని మార్చడమంటే మాటాలా? మార్పు లాభం? కాయకల్పచికిత్స పనిచేస్తుందా? వ్యవస్థ మొత్తంగా మారాలి. ఆ మార్పు చిట్టిపొట్టి సంస్కరణల వల్ల సాధ్య పడదు. "సోషలిజం ఆర్ సోషల్ రిఫార్మ్"? ఈ ప్రశ్న వేసింది బ్రిటిష్ కమ్యూనిస్టు నాయకుడైన హేరీ పాలిట్.

The word "Socialism" implies on complete revolution in the internal workings of the system which we call "Capitalism"..... Social reforms, however, proposes nothing of the kind, because a reform only acts on external effects brought about by internal causes.

రోగాల మూలాన్ని వెదికి పెట్టనంతకాలం చికిత్స సఫలం కాదు. తాత్కాలికోపశమనం వల్ల లాభం లేదు. రాజకీయ స్వాతంత్ర్యం ఏ సమస్యకూ పరిష్కారం కాదు. అవకాశంలో అభివృద్ధిలో భిన్న వర్గాల మధ్య అసమానతలు కొనసాగినంతకాలం, సంస్కరణ ఈ నేటి అక్రమ వ్యవస్థను మరి నాలుగు కాలాల పాటు నిలిపి ఉంచేందుకే తోడ్పడుతుంది. భ్రమ గొలిపి పీడితులను నయవంచన చేస్తుంది. వట్టి సంస్కరణ సార్వత్రిక మైన సమూలమైన మార్పుకు అడ్డు నిలుస్తుంది కూడాను. యువకుల శక్తిని ఈ స్వల్పమైన, పాక్షికమైన, పరిమిత ప్రయోజనం కలిగిన సంస్కరణలకు వినియోగించాలనడం ఉచితం కాదు. అట్లని, సంస్కరణలన్నీ మొత్తంగానే వ్యతిరేకించడం విజ్ఞత కాదు. తమ కాలాన్నీ బలాన్నీ సంస్కరణలను మించిన సమూల సామాజిక పరివర్తనకు, అంటే విప్లవ నిర్వహణకు, వినియోగించడం అవసరం. సంస్కరణలకు ఇదే నిజమైన దోహదం కూడా. అలాంటి "పావన నవజీవన బృందావన నిర్మాతలు" యువకులే.

యువకులుగానీ మేధావులుగానీ ఒక వర్గం కాదు. కాకున్నా సామాజిక విప్లవకర వర్గాలకు తోడ్పడ్డంలో ఒక శక్తి కాగలరు. నక్జల్‌బరీలో మొదలై శ్రీకాకుళం, తూర్పు గోదావరి, ములుగు సీమల దాకా వ్యాపించిన భారత రైతాంగ విప్లవానికి యువకులదే ప్రధానమైన దోహదం. విప్లవ రచయితల సంఘం కూడా ఈ యువజనుల కదలికలోని అంతర్భాగమే.

మరోవైపున, ప్రభుత్వ ఆధ్వర్యాన 'యూత్ అగెన్స్టె ఫేమిన్ కార్యకలాపాలు, జవహర్ యువజన కేంద్రాల ఏర్పాట్లూ జరుగుతున్నాయి. యువలోకం మనస్సులను స్వానుకూలం చేసుకునేందుకు ప్రభుత్వ వర్గం కూడా ప్రయత్నిస్తుంది. కాని, యువకులలో ఎక్కువ భాగం ఇంకా జాతీయ జీవిత ప్రవహానికి బయటనే ఉండిపోతున్నారు. వారిగుండెగూళ్లలో దీపాలు పెట్టలేదు. ఆత్మవిశ్వాసం అలవరచలేదు. స్వాలంబనం కలిగించలేదు. సామ్రాజ్యవాద దేశాల సంస్కృతి మాత్రమే గాక, భూస్వామ్య సంస్కృతితో బాటు వ్యాపారసంస్కృతి, యువకుల మనస్సులను వికృతం చేస్తూనే ఉంది. దురభిమానాలు, చవుకబారు విలువలు, హింసాప్రవృత్తి, సుఖలాలసత, బాధ్యతా దూరత, సాధారణస్థాయి, యువకులను కనీసం స్వల్ప సంస్కరణలకైనా సుముఖుల్ని చెయ్యడం లేదు. పని గట్టుకుని యువకులను తన అంగరక్షకులుగా చేసుకుంటూ, ప్రభువర్గం ఒక వైపు 'శివసేన' లాంటి పచ్చి ఫేసిస్టు సంస్థలను పెంచి పోషిస్తూంటే, మరో వైపు నుంచి పాలక పక్షం యువకులను కొందరిని తన రాజకీయ రథం మీదికి (Band - Waggon) ఎక్కించుకునీ, పదవులిచ్చీ ప్రతిపక్షాలమీదికి రేచుకుక్కల్ని చేసి వదులుతూ 'సెమి ఫేసిస్టు' ధోరణులను ప్రోత్సహిస్తూంది. ఈ త్రివిధమైన ఆకర్షణలనుంచి యువకుల మనస్సులను తిప్పడం, వట్టి సంస్కరణలకోసం మాత్రమే కాదు; నిజమైన నిఖిలమైన మార్పుకోసం మాత్రమే ఆ పని జరగాలి.

సాంఘిక పారిసర్యాన్ని ప్రక్షాళితం చేసేందుకు చెట్టపట్టాలు పట్టుకుని యువకులు, భావవిప్లవానికీ సాంఘిక విప్లవానికీ సాధనాలు కావాలి, రేపటి లోకం తమదే.

# యువత – ఆధ్యాత్మిక చింతన

వేలూరి సహజానంద

యువతరం, ఆధ్యాత్మికచింతన .... ఈ రెండింటికి పొత్తులేదని మామూలుగా అనుకోవటం కద్దు. యువతరంలో కేవలం ఉద్రేకం తప్ప వివేకం వుండదని కొందరు పెద్దల విమర్శ. అలాగే ఆధ్యాత్మిక చింతన అనేది ముసలివాళ్ళకు మాత్రమే అని కొందరు పిన్నల ప్రతివిమర్శ. నిజానికి ఆధ్యాత్మిక చింతన లేని యువతరపు శక్తి సామార్థ్యాలన్నీ బూడిదలో పోసిన పన్నీరే. అందుకే సమకాలిక పరిస్థితుల పద్మవ్యూహంలో చిక్కుకుపోయి, బైటపడలేక యువతరం క్రమేపీ నిర్వీర్యమై పోతున్నది.

ఆధ్యాత్మిక చరిత్ర చూస్తే, ఆ కోవకు చెందిన ప్రవక్తలు, మహాపురుషులు ముసలితనంలో దైవంవైపు తిరుగలేదు. మృత్యువు అడుగుల చప్పుడు విని, అప్పుడు ఆధ్యాత్మికంవైపు మొగ్గలేదు. వారందరు 'వయసు'లో ఆధ్యాత్మికరీతిని అనుసరించినవారు. జీసస్ క్రైస్ట్, బుద్ధుడు, శ్రీకృష్ణుడు, శ్రీరామకృష్ణపరమహంస, స్వామి వివేకానంద, శ్రీ అరవిందులు ..... ఇలా ఎందరో ఆధ్యాత్మికమే జీవితం అనీ, 'నిజమైన యౌవన'మని నిరూపించారు.

ఆర్థిక, రాజకీయ చైతన్యం ఉన్నంత మాత్రాన చాలదు. నిజాని కా స్థితి ఇంకా కళ్లు తెరవని స్థితి. ప్రపంచాన్ని ఒకానొక ఆర్థిక వ్యవస్థగానో లేదా ఒకానొక సామ్రాజ్యం గానో పరిగణించటమే ప్రమాదం, అజ్ఞానం. అలాగే ఏదేశాని కా దేశం తనే ప్రధానమైనట్లు, మిగతా ప్రపంచం తన చుట్టూ పరిభ్రమించాలనీ భావిస్తూ వుంటుంది. ఇటువంటి వికృత జాతీయవాదమే మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలకు దారి తీసింది. ఇక మనదేశంలో అయితే, ఏ రాష్ట్రాని కా రాష్ట్రమే తానే ముఖ్యమైనట్లు, మిగతా దేశానిది రెండవస్థానం అన్నట్లు భావిస్తుంది. ఇలాంటి సంకుచిత మనస్తత్వమే ఇంకా మన చరిత్రను రూపొందిస్తోంది. అందుకే ప్రపంచయుద్ధాల బదులు చిల్లర యుద్ధాలు, అంతర్యుద్ధాలు, సంఘర్షణలు మామూలై పోతున్నాయ్.

ఆర్థిక, రాజకీయ చింతన ప్రపంచాన్ని, ఉనికిని అనేక వర్గాలుగా, దేశాలుగా విభజిస్తుంది. చేతులారా విభజించి, చీల్చి, ఆ తర్వాత ఐకమత్యం, ఏకత్వం కావాలి అని ఘోషపెట్టుతాం. కాని ప్రపంచమంతా ఒక్కటి, ఉనికి అంతా ఒక్కటి, ఈ విశ్వైక్యాన్ని, ఏకత్వాన్ని ప్రాతిపదికగా ఎంచి గుర్తించి ఆర్థిక

రాజకీయ విధానాలను అందుకనుగుణంగా ఏర్పాటు చేసుకోవాలి అని బోధిస్తుంది ఆధ్యాత్మిక చింతన. ఈ ప్రపంచం అనేది హఠాత్తుగా, వావి, వరుస లేకుండా యాదృచ్ఛికంగా ఏర్పడింది కాదు. ఏదో ఒక పరిపూర్ణసత్యానికి, భావానికి వ్యక్తీకరణే, రూపాంతరమే ఈ ప్రపంచం, కాబట్టి ఆ మౌలిక సత్యాన్ని అంగీకరించి, గుర్తించి, దానిచేత ప్రభావితమైనప్పుడే, ఈ ప్రపంచపు, జీవితపు రహస్యం మన చేతి కందుతుంది అని ఆధ్యాత్మిక చింతన చెప్తుంది. ఇరవై శతాబ్దాలు గడచిన తర్వాత కూడా, ఇంకా ఏకప్రపంచభావాన్ని, సత్యాన్ని ఆదర్శంగానే ఎంచుతోందిగాని, వాస్తవంగా అనుసరించలేకపోతోంది ఆర్థిక రాజకీయచింతన. మానవచరిత్ర ఆదిలోనే ఈ ఏక ప్రపంచసత్యాన్ని, భావాన్ని ఆధ్యాత్మికచింతన నిర్వచించింది. నిజానికి, ఓవిధంగా ఆ అనాది ఆధ్యాత్మిక అనుభూతికి, ప్రవచనానికి ప్రతిబంధకాలుగా ఉంటున్నై వివిధ ఆర్థిక రాజకీయ విధానాలు.

ప్రకృతి వసతుల యాజమాన్యపు హక్కు వ్యక్తులకు ఉండకూడదనే ఈనాటి నినాదం దేశాలకూ వర్తిస్తుంది. వివిధ దేశాల వసతుల సకల ప్రజల సర్వతోముఖవికాసానికి దోహదపడాలి. వాటి నిర్దిష్ట, నిర్దుష్ట ప్రయోజనం అదే. అవి సార్వజనీనం కాక, స్వార్థపరమైనప్పుడు, అప్పుడు మాత్రమే అవి శాంతి సామరస్య వికాసాల బదులు అశాంతిని, ఘర్షణను, తిరోగమనాన్ని రేకెత్తిస్తున్నాయ్. మనిషికి మనిషికి మధ్య, మనిషికి ప్రకృతికి మధ్య ఎప్పుడూ ఘర్షణ తప్పదు. ఈ సంఘర్షణను ఆధ్యాత్మిక చింతన సామరస్యంగా మార్చగలదు.

యువత తమలో పకృతిసిద్ధమైన శక్తిని కేవలం 'శూన్య'శక్తిగా ఎంచకూడదు. ప్రపంచగతికి ఏ సత్యం మూలమై, ఆధారమై వుంది అని అన్నామో, ఆ ఏక-అనంత పరిపూర్ణ సత్యమే మానవుల్లో, యువతలో నెలకొని ఉంది. కుల, వర్గ, జాతి,దేశ సిద్ధాంతాల సంకుచిత సరిహద్దులను, అతిక్రమించగలిగితే, ఈ పరిపూర్ణ సత్యం దర్శనం అవుతుంది. అనుభవం అవుతుంది. అప్పుడు శక్తి కూడా ఆ సత్యపు సృజనాత్మక శక్తిగా, స్వచ్ఛందంగా రూపొందుతుంది. అది సంఘర్షణ శక్తిగా కాక, సమన్వయశక్తిగా పని చేస్తుంది. యువత ఈ నిజాన్ని గుర్తించినప్పుడే, ఒక కొత్త నాగరకతకు దారి చూపిన వారవుతారు.

ఏవేవో, అనేక పురాతన, నూతన మతాలు యువతను ఆకర్షిస్తూనే ఉన్నై.

పాశ్చాత్య దేశాల ఆర్థిక సంపద ప్రాచ్య దేశాల యువతను ఆకర్షిస్తుంటే, ప్రాచ్య దేశాల ఆధ్యాత్మిక ఉత్తేజం పాశ్చాత్య దేశాల యువతను ఆకర్షిస్తోంది. ఇవన్నీ ఏదో తాత్కాలిక ఉత్సాహాన్ని తృప్తిని, శాంతిని కలిగించగలవే గాని, ఒకానొక విశ్వ - పౌర సత్యాన్ని యువతకు ప్రసాదించలేవు. సమాజం నుంచి, ప్రపంచంనుంచి యువతను ఎడం చేసి, దూరం చేసే కొన్ని మత - రీతులు నిజమైన ఆధ్యాత్మిక అనుభవాన్ని కలిగించలేవు వ్యక్తిగతవిలాసచిద్విలాసాలు వేరు. మొత్తం ప్రపంచంతో, మానవాళితో కలిసి అడుగులో అడుగు వేయటం వేరు. ఆధ్యాత్మికత అంటేనే సంకుచిత వ్యక్తిని సంఘవ్యక్తిగా మార్చి, క్రమంగా విశ్వ-వ్యక్తిగా పరిణమింపజేయటం. ఆధ్యాత్మిక చింతనతో, వ్యక్తి బైటకు ఒకడుగా కన్పించినా, అందరితో, యావత్తూ మానవజాతితో ఏకత్వాన్ని, తాదాత్మ్యాన్ని అనుక్షణం అనుభవిస్తున్న విశ్వ-వ్యక్తిగా స్పందిస్తాడు.. మన రాష్ట్రం, మన దేశం మాత్రమే కాదు, మానవజాతి యావత్తూ, అతనిలో మూర్తీభవించివుంటుంది.

సాంస్కృతిక కార్యకలాపాలంటే యువతకు విశేషమైన ఆసక్తి. కాని అదేమి చిత్రమో కథలు, కవిత, నృత్యం, నాటకాలు - ఇవే సంస్కృతి అని అనుకుంటున్నట్టు తోస్తుంది. ఇది చాలా దురదృష్టకరమైన విషయం. విద్యాధికులు, అనుభవజ్ఞులుకూడా చాలామంది యువతను ఈ దారిన నడిపిపస్తున్నారే కానీ అసలు జీవితం ఏమిటి, ఎందువల్ల ఈ సాంస్కృతిక కలాపాలన్నింటిలో మానవ దైన్యమూ, విషాదమూ మాత్రమే ప్రకటిత మవుతున్నాయ్ అని ప్రశ్నించుకోవడము లేదు. పార్టీలను, సిద్ధాంతాలను, వ్యక్తులను, రంగాలంకరణలను, సాహిత్యరీతులను ఎలాగో అలా మార్చేస్తే చాలు, భూతలస్వర్గం అవతరించేస్తుంది అనే ఆపోహకు ఇంకా ఎన్ని దశాబ్దాలపాటు దాసోహమవాలి.

ఆధ్యాత్మికంగా జీవించాలంటే అందు కిప్పటి కన్న ఎంతో ఎక్కువ శక్తి, బలం, కావాలి. మనోధైర్యం, స్థైర్యం కావాలి. సహనం కావాలి. త్యాగం కావాలి. ఇవన్నీ యువతకు సహజసిద్ధంగా అలవడినపుడే ఒక కొత్త సమాజం ఏర్పడుతుంది. అన్యాయ ఆర్థిక విధానాల ద్వారా బడి సాగిపోతున్న ధనిక యువకులు త్యాగం అవలరుచుకొనకపోతే న్యాయమార్గానికి ఎలా రాగలుగుతారు? ఇతరులను సత్యం వైపుకు మళ్ళించాలి అని అనుకొన్నపుడు, అందుకు ఎంత సహనం కావాలి? మనం ఈనాడు అనుకొంటున్న సుగుణాలు, పరస్పర సహకారం, పరోపకారం, సేవాభావం, సమైక్యం, సమానత్వం, కార్యదీక్ష

- ఇవన్నీ ఆధ్యాత్మిక చింతన ద్వారా సమకూరవలసిందే కాని వీటిని నినాదాలుగా వల్లె వేసినంత మాత్రన రావు. రావట్లేదు గదా! ఎందుకంటే ఆధ్యాత్మిక వికాసంతో, వ్యక్తి తనను ఒంటరిగా కాక అందరితో కలిసిపోయి, తనలో అందరినీ, అందరిలో తననూ నిత్యమూ అనుభవించే సంపూర్ణ- వ్యక్తిగా వృద్ధి చెందుతాడు అభివృద్ధి చెందుతాడు. అలాంటి పూర్ణ పురుషుడు మాత్రమే యధార్థమైన నవ-సమ-సమాజాన్ని రుపొందించగలడు. నినాదంలో సమత, నిత్యజీవితంలో స్వార్థం. వేయ్యేళ్ళు గడువిచ్చినా ఇందుకు భిన్నం ఉండదు. సమానత అని నినదించే వారిలో ఎంత మందికి అసమానతలో మగ్గిపోతున్న వారిపట్ల నిజమైన ప్రేమ, సానుభూతి ఉన్నయ్? మానవ దర్శనంలో, మొత్తం చట్రంలో మార్పురాకుండా బైట మార్పు ఎలా వస్తుంది? సమానతను చేకూర్చలేకపోగా పాత అసమానతలకు కొత్త అసమానతలను సమకూర్చిన వారం అవుతాం. కన్ను విప్పి చూస్తే ఇది కనువిప్పు కాగలదు. సమతను రాజకీయ ప్రయోజనంగా కాక మానవతగా గుర్తిస్తుంది - ఆధ్యాత్మిక చింతన.

అన్నిదేశాల్లోనూ యువత ఎదురు తిరుగుతోంది. దీన్ని తరాల మధ్య అంతరం (జెనరేషన్ గేప్)గా నినాదంగా నిర్వచించినంతమాత్రాన చాలదు. ప్రతివృద్ధుడూ ఒకప్పుడు యువకుడే. ప్రతి యువకుడూ వృద్ధుడు కాక తప్పదు. నిజాని కిది పరిణామ-సంఘర్షణ. మానవులను కేవలం ఆర్థిక యంత్రాలుగా పరిగణిస్తున్నంత వరకూ, ఏ సమాజమైనా దేశమైనా అస్తవ్యస్తంగా వుండక తప్పదు. కేవలం శాంతి భద్రతల ద్వారా పరిష్కారమయ్యే సమస్య కాదు ఇది. మానవవ్యక్తిత్వాన్ని, జీవితాన్ని సమగ్రంగా, సర్వతోముఖంగా అర్థం చేసుకోనగలిగినపుడే, ఆర్థిక విషయాలను మొత్తం జీవితంలో అంతర్భాగం గా సమన్వయించుకోగలుగుతాం. అన్ని దేశాల ఇప్పటి ఆర్థిక దర్శనం ఎలా వుందంటే పూలమొక్కకు కావలసిన నీళ్ళు, ఎరువులు వగైరాలను అదే పనిగా సమకూర్చి, నిలవచేయటం వరకేగాని, ఆపూలమొక్కమాత్రం పుష్పించని స్థితి అన్న మాట. ప్రకృతి వసతులను సమీకరించుకొనటం, అత్యధికం చేసుకొనటం, నిలవచేసుకొనటం ఇదే సరిపోతోంది గాని, మానవుడు తనలో నిక్షిప్తమై వున్న విశ్వజనీన ప్రేమను, సహకారాన్ని, ఆనందాన్ని మాత్రం అభివ్యక్తం చేయకుండావున్నాడు. దీనినే వెర్రితలలు వేయటం అని అంటారు. మొత్తం మానవజాతి ఈ స్థితికి దరిదాపుల్లో ఉందనే కొందరు శ్రేయోభిలాషులు హెచ్చరిస్తున్నారు.

మతాన్ని, ఆధ్యాత్మికాన్ని కేవలం ఏదో ఉద్రేక సాధనంగా, ఉల్లాస ఔషధంగా సమస్యలనుంచి పలాయనంగా విచిత్రానుభూతిగా ఎంచుతున్న ప్రస్తుత దశనుంచి యువత పురోగమించాలి. ఆధ్యాత్మికమనే పదానికి కాలక్రమేణ పదునుపోయింది. ప్రపంచానికి జీవితానికి ఏది మౌలిక ప్రత్యక్ష సత్యమో, దాన్ని మనోవాక్కాయ కర్మల ద్వారా ప్రకటించటం ఆధ్యాత్మికం. ఇక్కడ సత్యము, అధ్యాత్మికము పర్యాయ పదాలు.

యువతలో సహజంగా ఉండే ఉత్సాహం, పట్టుదల, సాహసం, నిర్భీతి, ధైర్యం, త్యాగం, ఆదర్శదృష్టి - ఇవన్నీ ఆధ్యాత్మిక దర్శనంవల్లనే సాఫల్యం పొందుతై. సరైన సమగ్రమైన భావన లేకుండా ఈ సుగుణాలన్నీ వ్యర్థమై పోవటమే కాక వెనుక నున్న స్వార్థపరులకు దుష్టశక్తులకు అవకాశం చిక్కుతుంది. భావం అనేది విత్తనం. ఆచరణ, క్రియ, కార్యం అనేది మొక్క. మానవులంతా ఒక్కటే, అనే భావం స్థిరపడినప్పుడే మనం చేసే పనులు కూడా అందరి శ్రేయస్సునకు దోహదపడుతై. భావన సాక్షికంగా వుంటే ఫలితం కూడా సాక్షికంగావుంటుంది.

యువత ఆర్థిక సిద్ధాంతాల భౌతిక ప్రతిభలకు లోనవకూడదు. జీవితంలో భౌతికానికి సముచిత స్థానం వుంది. ఎవడైనా స్నేహంతో, ఆదరంతో ఇచ్చే వస్తువును (ఖరీదు బట్టి కాక) ఎంతో విలువకలదిగా ఎంచుకుంటాం. ఆ వస్తువు స్నేహానికి, ఆత్మీయతకు భౌతిక రూపం అన్న మాట. అలాగే ముందు మానవతతో సౌజన్యం, పరస్పర ప్రేమ పెల్లుబికితే అప్పుడే భౌతిక విషయాలు ఇప్పటి వలె స్వార్థకు, ఈర్ష్యకు, గర్వానికి, కాక మానవతకు, సౌజన్యానికి ప్రతిబింబాలుగా, రూపాలుగా అనుభవం అవుతై. ఆర్థిక రాజకీయ, సిద్ధాంతాలు, మనసున్న మనిషికూడా భౌతికస్థాయికి కుదించి, వికృతపరిస్తే, ఆధ్యాత్మిక చింతన భౌతిక విషయాలకుకూడా సాంఘికమైన విలువలను, మానవతను ప్రసాదిస్తుంది. నిజానికి భౌతిక ఆధ్యాత్మికాల మధ్య వ్యతిరేకత లేదు. భౌతికానికి తన స్పర్శచే జీవత్వం కల్గించి, సార్థక్యాన్ని ప్రసాదిస్తుంది. ఆధ్యాత్మిక చింతన.

ఆధ్యాత్మికం ఉత్తమోత్తమ జీవితశాస్త్రం, సాంఘికశాస్త్రం. ఏదేశపు యువతలో సరైన ఆధ్యాత్మికచింతన ఉదయిస్తుందో ఆ దేశపు వెలుగు పరిహద్దులను దాటి, మొత్తం ప్రపంచం అంతటా ప్రసరిస్తుంది.

# యువతరం – మతం

మొదిగొండ శివప్రసాద్

మతం తర తరాలుగా మానవ ప్రగతికి అంతరాయంగా వుంది. కాబట్టి మతాన్ని నవజీవనం నుండి తుడిచి వేయాలనేది ఈనాడు తరుచు కథల్లో కబుర్లలో, వేదికలపై, పత్రికలలో వినబడే ఓ నినాదం. ఈ నినాదం వెనుక నిరీశ్వరత్వం, ఆర్థిక సంఘర్షణ, మానవతావాదం వంటి ఉదాత్తలక్ష్యా లేవో ఉన్నట్లు వారు చెపుతారు. కాని, ప్రత్యక్షంగా జరుగుతున్నదేమంటే ఈ "యాంటీ-కమ్యూనలిష్టులు' 'సంప్రదాయ నిరోధక సమితులు' మతాన్ని నిర్మూలించలేక పోగా తమ సిద్ధాంతాన్ని మరో వెయ్యిన్నొక్క మతంగా మాత్రమే మార్చగల్గుతున్నారు. ఉన్న మతాలకు మరో కొత్త మతం చేర్చగలుగుతున్నారు.

ఉదాహరణకు ఈనాటి సామాజిక జీవనంలో మనకు కన్పడే ఆశయాలేమిటి? విషయసుఖాలు అనుభవించు, కాని ఫలితాలు బాధ్యతలు మాత్రం వద్దు. లాటరీ టిక్కెట్టు ద్వారా లక్ష రాత్రికి రాత్రి సంపాదించు. వర్కుటు రూల్ - ఎక్కువ జీతమూ బోనస్ తక్కువ గంటల పని - నామాలూ సీమాలూ ఆచార వ్యవహారాలూ వద్దు. కేవలం భౌతిక సుఖమయమైన జీవనం కావాలి. అనే కదా !! కొన్ని వేల సంవత్సరాల క్రితం చార్వాక దర్శనంలో చెప్పిన జీవనవిధానం ఇదే! "యావజ్జీవం సుఖం జీవేత్ ఋణం కృత్వాఘృతం పిబేత్. భస్మీ భూతస్య దేహస్య పునరాగమనం కుతః?" బ్రతికినంతకాలము అప్పు చేసి పప్పుకూడు తిను. అప్పు తీర్చడమంటావా చచ్చిన తర్వాత అడిగేదెవడు? వచ్చే దెక్కడికి?? భారతీయులు ఈ నిరీశ్వరవాదాన్ని తీవ్రంగా ఖండిస్తూనే మతసహనం దృష్ట్యా దాన్నీ ఒక దర్శనంగా అంగీకరించారు. నేటి సంప్రదాయ నిరోధక సమితులకు ఈ నిరీశ్వర దర్శనం. ముఖ్యస్ఫూర్తికేంద్రం. లోకాయతన సిద్ధాంతం వారికి ఆధారం. అజిత కాశంబల దోశాలాదులు వీరికి గురువులు. అంటే మత నిర్మూలన వాదులు తమకు తెలియకుండానే విషయోపభోగ పరమార్థం గల ఒకానొక మతాన్ని అనుసరిస్తున్నారనే అర్థం. ఈ దృష్ట్యా కమ్యూనిజం - ఒక మతం, హిప్పీయిజం - మరో మతం; మతం వద్దనే మరో మతం - ఇవన్నీ నేటి దేశకాల పరిస్థితుల ననుసరించి వ్యాప్తిలోకి వచ్చిన కొత్త మతాలుగా మన మంగీకరించవలసివస్తుంది. వీటి వ్యాప్తి కొక ప్రధానకారణం పారిశ్రామిక విప్లవ పరిణామం.

మతం మానవజీవితాన్ని విచ్ఛిన్నం చేసిందనీ, యుద్ధాలను ప్రేరేపించిందనే, నల్లమందుతనాన్ని, అకర్మణ్యతను నేర్పిందనీ, ఒక వాదం. ఇందలి సత్యాసత్యాలు పరిశీలించే ముందు మతరహితవాదులు సమాజ సంఘటనకూ యుద్ధాల నిర్మూలనకూ కర్మణ్యతకు తోడ్పడ్డారా? అని మనం పరిశీలించాలి. మతం పేరు మీద జరిగిన యుద్ధాలకన్నా , జన నాశం కన్నా ఆర్థిక సంఘర్షణ సిద్ధాంతం వల్ల జరిగిన జననష్టమూ - బానిసల వ్యాపారము తక్కువదేమీ కాదు. ఖండాంతరవేధులనూ, రాకెట్లనూ నిర్మించి భూగోళాన్ని బద్దలు చేయమని యేమతం వారికి నేడు చెపుతున్నది. అమెరికావారి కేపిటలిస్ట్ మతం చెపుతున్నది; రష్యాకు, చైనాకు కమ్యూనిస్టు మతం చెపుతున్నది. దేవుడి పేరుమీద ఒకనాడు యుద్ధాలు జరిగినవని చెప్పి, ద్రవ్యం పేరుమీద నేడీ పెద్దలంతా మారణహోమాన్ని సాగిస్తున్నారు. తోటి మానవుణ్ణి నిలువు దోపిడీ చేసే ఈ దగాకోర్లు అంతర్జాతీయతా సౌందర్యం గూర్చి వసుధైక కుటుంబం గూర్చి చాలా సుదీర్ఘ ప్రసంగాలు చేసి లోకవంచనతో బాటు ఆత్మవంచన కూడా చేసుకుంటున్నారు.

నిజానికి మతం ఎన్నడూ జాతికి అకర్మణ్యతను నేర్పలేదు. సోక్రటీస్, ప్లాటో, అరిస్టాటిల్, జీసస్ క్రైస్ట్ - వారంతా పశ్చిమదేశాలలో మానవతా భిక్షను ప్రసాదించిన ప్రవక్తలు - శివాజీ, రాణాప్రతాప్, సావర్కార్, మాలవీయా, తిలక్, గోఖలే, గాంధీజీ - వీరంతా మతంనుంచి స్ఫూర్తి పొంది మహాజీవన సంగ్రామాన్ని నడిపి కర్మణ్యతా యజ్ఞ వాటిలో ఆత్మ సమర్పణ చేసుకున్న మహనీయులు. ఈ కర్మయోగులకు ఏమతసంఘర్షణ అడ్డు రాలేదు. సరికదా మతమే తమ మనుగడగా జీవించి మతవిశ్వాసమే తమ అణువణువునూ చైతన్యవంతం చేయగా పూర్ణజీవనాన్ని అనుభవించి సాఫల్యాన్ని పొందగల్గినారు. రామునికి కృష్ణునికి వివేకానందునికి ఏమతపు నల్లమందు అడ్డు రాలేదు. కాని, నేడు మతం వద్దనే వారి జీవితాలు ఒక్కసారి పరిశీలించి చూడండి. ఎంత నిష్ప్రయోజనంగా తమకూ సమాజానికీ కూడా కొరగాకుండా, కేవలం ద్వేషం - హింస ప్రాతిపదికలుగా సాగుతున్నాయో ! మత విశ్వాసం లేని నేటి యువకుడు తన శక్తిని రైళ్ళు తగలబెట్టడానికీ, ఏ రాజకీయ నాయకుని చేతిలో చీపురు గానో ఉపయోగపడటానికి దుర్వినియోగం చేసుకుంటున్నాడు. లక్ష్యం లేని అతనికి చీట్లాటలు సినిమాలు నేటి కాలక్షేపసాధనాలు! కాలం గడపటం ఎట్లా అన్నదే అతనికి నేటి ప్రధాన సమస్య!

మతంలో నాలుగుభాగాలున్నాయి. ఒకటి - పరలోక విశ్వాసం. జీవాత్మల సంబంధం - ఈ విషయంలో వివిధ మతకర్తలు తమ తమ అభిప్రాయాలకు అనుభూతులకు అనుగుణంగా సిద్ధాంతాలు చేశారు. రెండవది - సమాజ వ్యవస్థను గూర్చిన కల్పన. ఈ విషయంలో కూడా మత కర్తలు కొన్ని కొన్ని విభేదాలు చూపారు. కొందరు షోడశ సంస్కారాలు అంగీకరించారు. కొందరు ఉపనయనాదులు తిరస్కరించారు. కొందరు వర్ణవ్యవస్థను జన్మసిద్ధంగా అంగీకరిస్తే కొందరు కర్మసిద్ధంగా అంగీకరించారు. ఇలా సాగింది చర్చ. మూడవది - ఆచార వ్యవహారాలు. ఇవి ఒక్కొక్క మతానికి ఒక్కొక్క విధంగా ఉంటాయి. కొందరికి నిలువు బొట్టు, కొందరికి అడ్డబొట్టు, కొందరికి యజ్ఞం, మరికొందరికి నామజపం - ఇలా మారుతాయి. ఒక నాల్గవది సుగుణసంపత్తికి సంబంధించిన విషయం. ఇందులో ప్రపంచంలో మతకర్తలందరూ ఏకీభావాన్ని ప్రదర్శించారు. జీవహింస తప్పు అహింస పరమధర్మం. సత్యం చెప్పు, ధర్మం చెయ్యి, ఎదుటివాడిని నీలాగే చూచుకో. ఇంద్రియాలను స్వాధీనంలో పెట్టుకొని ఉదాత్త గుణ శీలాలు పెంపొందించుకో. ఇలాంటి బోధలనే వేదాలు, బైబిలూ , గ్రంథ సాహెబ్, ఖురాన్ అన్నీ చేసాయి. అంటే బహిరంగ వ్యవహారాలలో వివిధ మతాలు తమ తమ అభీష్టానికి అనుగుణంగా విభేదాలు ప్రదర్శించినా అంతరంగ దర్శనంలో ఏకత్వాన్ని చూపడం స్పష్టంగా మనకు కన్పడుతున్నది. మతమంటే వివేకానందుడు చెప్పినట్టు "ఉద్ధరిణను ఎడమ చేత్తో పట్టుకోవాలా ? కుడిచేత్తో పట్టుకోవాలా"? అన్నది కాదు. ఈ అంతరంగ దర్శనమే మతం. దీనిని గౌరవించని వాడు లోకంలో దేనినీ గౌరవించలేడు. చివరకు తనను తానే గౌరవించుకోలేడు.

మత విశ్వాసం పెరిగిన కొద్దీ మానవుడు మహామానవుడు అవుతున్నాడు. పురుషుడు పురుషోత్తము డవుతున్నాడు. జీవితానికి అర్థమూ పరమార్థమూ ఉన్నదని గుర్తెరిగి సంకుచితమైన తన పరిధినుండి వ్యాకోచానికై పయనం ప్రారంభిస్తూ తనలోని దివ్యశక్తులను వికసింప చేసుకుంటున్నాడు. తనలో విశ్వాన్ని, విశ్వంలో తననూ చూచుకోనగలుగుతున్నాడు. ఈ దివ్యజ్యోతినుండి వెల్వడే కాంతికిరణాలే త్యాగం, ప్రేమ, సమత , మమత, జ్ఞానం, శీలం, ఏకత - ఇత్యాదులు. "నీ వొక మట్టి ముద్దవు. నీ ఎదుటి మనిషీ ఒక మట్టి ముద్దయే. ఇందులో దివ్యశక్తి అంటూ ఏమీ లేదు." అని విశ్వసించేవాడు. ఎదుటి మట్టి ముద్దతో ఏ సంబంధం ఉన్నదని అతని

శ్రేయస్సుకు పాటు బడతాడు? - అందుకే భౌతిక వాదం ఈ మానవ చరిత్రలో ఒక్క మహాపురుషుణ్ణి గూడా సృష్టించలేకపోయింది.

" సర్వేచ సుఖినస్సంతు సర్వే సంతు నిరామయాః

సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చి దుఃఖభాగ్భవేత్ "

అన్నదే యుగయుగాలుగా మన ప్రార్థనా ఆరాధనా అయింది. మన జీవనంలో కళలలో, సంస్కృతిలో, నాగరికతలో అన్నింటిలోనూ, ఈ విశ్వశ్రేయమనే ఆదర్శమే ప్రతిబింబించింది. మనకీ ఆదర్శాన్ని అందించిన వారంతా మహర్షులు - మతకర్తలు - ప్రవక్తలు !!

ఇక జాతీయ సమైక్యత గూర్చి ఒక్క మాట చెప్పి ముగిస్తాను. ఈ దేశంలో అంగ వంగ కళింగ కాశ్మీరాది ఛప్పన్నారు దేశాలు, దేశానికొక చతుస్సాగర వేలావలయిత మండల ప్రభువూ ఉన్నా, అంతర్యుద్ధాలు సాగుతునే వున్నా ఈ జాతిని కలిపికట్టి ఉంచగలిగినట్టి శక్తి మతమే. ఈ సందర్భంలో శ్రీ రాధాకుమార్ ముఖర్జీ "The fundamental Unity of India", అరవిందుని "The Foundations of Indian Culture" అన్న గ్రంథాలు విధిగా చూడవలసిందిగా పాఠకులకు మనవి చేస్తున్నాను. ఈ నదీజలాల సమస్యలు, నాయకత్వపు కొట్లాటలు, భాషలను బట్టి చేసే విభజనలూ, రెండు రాష్ట్రాల సరిహద్దు సంగ్రామాలు నాడు లేవు. అఖిల భారతదేశం అణువణువూ కణకణమూ ఈశ్వర స్వరూపంగా భావించి వారు ఉపాసించారు. బాహిరమైన ఈ రాజకీయ పాలనం వారి భక్తికీ ప్రపత్తికీ అడ్డుకాలేదు. హిందూత్వం వారిలో ఏకత్వాన్ని సాధించింది. మృణ్మయమానవులను చిన్మయశక్తులనుగా మార్చగలిగింది. సామాన్య మానవులను శివాజీలుగా పురుషసింహులనుగా పరివర్తనం చేసింది. రామనామం గాంధీజీ, బ్రాహ్మ్యశక్తికి ఆధారచక్రం. ఆరామనామమే సీతారామరాజు క్షాత్రశక్తికి అధిష్ఠానమంత్రం. మతం యుగయుగాలుగా ఈ జాతిలో మహాపురుషులను సృష్టించింది. మతాన్నీ ఈ మహా పురుషులనూ విమర్శించే కొందరు యువకులూ, విదేశీ కిరాయి ఏజెంట్లు ఈ విమర్శించే అర్హత తమకు ఎంత ఉంది? అన్న ఆత్మవిమర్శ చేసుకోవడం చాలా అవసరం.

" ఆదర్శ వంతుడు నూరు తప్పులు చేస్తే ఆదర్శ రహితుడు లక్ష తప్పులు చేస్తాడు. కాబట్టి తప్పులు కొన్ని జరుగుతున్నా సరే ఆదర్శం కలిగి ఉండటమే మేలు" అన్న వివేకానందుని సూక్తితో ఈ వ్యాసం ముగిస్తాను.

# యువతరం – లలిత కళలు

నంజీవదేవ్

యువత, నవత, మానవత. యువతనుంచి నవత ఉద్భవిస్తుంది; నవతనుంచి మానవత. నవత లేని మానవత దానవతే. నవతకు, మానవతకు ప్రాతిపదిక యువతయే. మానవ జీవితంలో యువతకు ఈవలా ఆవలావున్న దశలు బాల్యం, వార్థక్యం, ఒకటి సూర్యోదయం, రెండవది సూర్యాస్తమయం, రెంటి శక్తి కూడా పరిమితమే. ఈ రెంటికీ మధ్య ఉన్న మధ్యాహ్నపు శక్తి అపరిమితమైంది. యువత అనేది మానవజీవితంలోని మధ్యాహ్నమే. అందుకే యువత శక్తికి హద్దులు లేవు. దాని కసాధ్యమైంది లేదు. బాల్యంలోని అమాయికతా వార్థక్యంలోని అనుభవమూ కూడ యువతలో సమన్వయమై ఉంటాయి. యువతకు ప్రధానలక్షణాలు సాహసం, నిస్స్వార్థం, స్థిర నిర్ణయం వీటికితోడు రసానుభూతి.

సృజనకు ప్రతీక యువత, సంతాన సృష్టికి యువత ప్రధానమైనట్టే కళాసృష్టికి కూడా యువత ప్రధానం. బాల్యంలోని కల్పనా, వార్థక్యంలోని వాస్తవికతా, రెండూ, మిళితమై యువతరంచేత కళాసృష్టి చేయిస్తుంది. అందుకే ఎక్కువగా కళాకారులు యువజనుల్లో వుంటారు. యువజనుల్లో మేధాశక్తి హృదయశక్తి కూడ వికసించి ఉంటాయి. ఒకవిధంగా చూస్తే మొదటి దానికంటే రెండవదే ఎక్కువగా వికసించివుంటుంది వారిలో అందుకే గుప్త అనుభూతులు వ్యక్తం కావటానికి యువజనుల్లో ఎక్కువ తపన గోచరిస్తుంటుంది.

నటనకు, నర్తనకు, శిల్పనిర్మాణానికీ, చిత్రరచనకు, సంగీతానికీ; కవితాసృష్టికి ప్రపంచం అంతటితో కూడ యువతరంవారు ప్రాముఖ్యాన్ని చూపుతుండటం విశిష్టమైన విషయం. ప్రతివారికి యేదో ఒక కళాప్రతిభకూడా నిద్రాణమయో, మేల్కొనో వుంటుంది. యువతీ యువకుల్లో ఇటువంటి కళాప్రతిభ వున్నవాళ్ళు తమవృత్తి మీదకంటే తమ కళాప్రతిభల మీదనే ఎక్కువ శ్రద్ధ చూపడం గమనించాలసిన విషయం. ఏదో ఒక వృత్తి లేంది మనుగడ వుండదు. ఏదో ఒక కళాప్రతిభ లేంది ఆనందం వుండదు. ఆనందంలేకుండా బ్రతికి వుండటానికంటే ఆనందంలో చనిపోవటంలో ఎక్కువ హాయి ఉంది. యువతరపు నవసమాజంలో విజ్ఞానాలకు ఎంత విలువ వుంటుందో

లలితకళలకు కూడా అంత విలువ వుంటుంది. ఇది ప్రత్యేకంగా వైజ్ఞానికయుగమైనప్పటికి లలితకళలు చిన్నచూపు చూడబడటం లేదు. లలిత కళలను సృష్టించటం, వాటిని ఆనందించటం పోషించటం మొదలైనవన్నీ వికసిస్తూనే ఉన్నాయి. యువతరంవారి జీవనరీతులు ఆలోచనానుభూతులు ఆశయాలు, ఆచరణలూ మొదలైన వన్నీ ఒక కళగానే రూపొందుతున్నాయి. తమ తమ జీవితాలనే కళాకృతులుగా మలచుకోవటం వైపు యువతీయువకులు చూపుతున్న శ్రద్ధ ప్రశంసనీయం.

యువతరపు జీవనరీతి, సామాజిక నీతి, కళాప్రీతి, ఆధునిక దృక్పధంతో రంజితమై వున్నాయి. నవమానవతానిర్మాణానికి ఇవి పూర్ణంగా దోహదమిచ్చేవిగా వున్నాయి. నేటి యువతీ యువకుల్లో, వారు ఏ వృత్తికి చెందిన వారైనప్పటికీ, ఏదో ఒక లలితకళ కొద్దిగానో గొప్పగానో వ్యక్తమవుతూనే ఉంది. కవితల్లటమో, చిత్రించటమో, పాడటమో, నటించడమో, మొదలైన వాటిల్లోని ఏదో ఒక లలితకళ దాదాపు యువజనులందరిలో గోచరిస్తూనే వుంది ఔత్సాహిక రీతిలో. లలితకళలు ఇప్పుడు ఎక్కువగా సార్వజనీనం కావడానికి అవి నిబద్ధత నుంచి చాల వరకు బయటపడి అనిబద్ధతలో ప్రవేశించటమే. యువజనులు స్వేచ్ఛాప్రియులు. జీవితంలో వారికి స్వేచ్ఛ కావలిసినంతగా లలితకళల్లో కూడా కావలసిరావటం సహజం. అందుకే లలితకళా సృష్టిని వారు పాతనియమబద్ధత నుంచి సాధ్యమైనంతగా విముక్తపరచి ఒక స్వచ్ఛంద రూపకల్పనలోకి రుపాంతర పరచారు.

ఈ విధంగా యువతరానికి చెందిన లలితకళలు ఎక్కువ స్వేచ్ఛతో కూడుకొని సాంప్రదాయిక శృంఖలాలనుంచి విముక్తాలై వికాసపథంలో పయనిస్తున్నాయి. ఛందోనియమాలనుంచి బయటపడిన ముక్త ఛందస్సుతో కూడిన కవిత, సాంప్రదాయిక రుపాలనుంచి రంగులనుంచి విడిబడిన ఆధునిక చిత్ర రచన నేటికళల్లో ప్రధానంగా యువజనులకు ప్రీతిభాజనంగా వున్నాయి. కాని, వీటిని సృష్టిస్తున్నారే కాని, సృష్టించినంతగా వీటిని ఆనందించజాలక పోతున్నారు. ఆధునిక వచన కవితను చాలా మంది, యువజనులు రచిస్తున్నారే గాని వాటిని చదివి ఆనందించే పాఠకుల సంఖ్య చాలా తక్కువగా వుంటుంది. ఆధునిక యువరచయితా రచయిత్రుల కవితలు రూపంలో సరళంగా ఉన్నా భావంలో బరువుగా వుంటున్నాయని చాలమంది పాఠకుల భావన. భావంలో

ఇటువంటి బరువు వుండటం అవసరమా లేదా అనే విషయాన్ని గురించి అభిప్రాయభేధాలున్నాయి. భాషతో పాటు భావం కూడా సరళంగా వుండాలని కొందరంటే, భాష సరళంగా వున్నప్పటికీ భావం బరువుగానే వుండాలని మరి కొందరంటారు. భాష ఏవిధంగా వున్నప్పటికీ భావంలో కొంతైనా మార్మికత లేంది అది కవితగా రూపొందదేమో అనిపిస్తుంది. భావంలో వుండాలన్న మార్మికత భాషలో మాత్రం ఎందుకుండకూడదు? భాషలోను భావంలోను కూడా మార్మికత వుంటే భాషలోని మార్మికతను విశదంచేసి చూచే శ్రమలో భావంలోని మార్మికత కాస్తా ఆవిరైపోతుంది.

ఇదే విధంగా ఆధునిక చిత్రకళ. చాలామంది యువచిత్రకారిణులు ఆధునిక చిత్రాల్ని రచిస్తున్నారు. కాని, వాటిని చాలమంది ప్రేక్షకులు ఆనందించజాలక పోతున్నారు. ఆధునిక కవితకు భాష సరళంగా వుండటం భావం బరువుగా వుండటం చూస్తున్నాం. కాని, ఆధునిక చిత్రకళలో ఇందుకు వ్యతిరేకంగా భాష (అంటే చిత్రాల రంగులూ రూపాలు) బరువుగా వుండటం, భావం అసలు లేకుండా వుండటం జరుగుతూవుంది. ఆధునిక చిత్రకళా రూపాలు రంగులూ మొదలైనవి మనకు పరిచితమైనవిగా కాక అపరిచితమైనవిగా వుంటాయి. అందువల్ల వాటిని చూచి ఆనందించటం సులభంగా వుండదు. ఆధునిక చిత్రకళలో రూపాలూ రంగులూ వుంటాయేకాని భావ ప్రాముఖ్యం వుండదు. కారణం, ఆధునిక చిత్రకళలో విషయవస్తువే వుండదు. కనుక విషయవస్తువే లేని దానిలో భావంకూడా లోపించి వుంటుంది.

యువతరం సృష్టించే లలిత కళల్లో వస్తుగతదృక్పథాని (objective view-point) కంటే వ్యక్తిగత దృక్పథం (subjective viewpoint) ఎక్కువ వ్యాప్తిని కలిగివుంది. యువకళాకారులు తమ బయటి ప్రపంచానికంటే తమలోపలి ప్రపంచానికే ఎక్కువగా రుపం ఇస్తున్నారు. అందువల్ల వీరి కవితల్లో, కథానికల్లో, చిత్రాల్లో, శిల్పాల్లో ఘటనాచిత్రణ తక్కువ వుండటమో అసలు వుండకపోవటమో జరుగుతూ వుంటుంది. ఘటనాప్రాముఖ్యం వున్న కళాకృతుల్లో విషయవస్తువుకు ప్రాధాన్యం తప్పదు.

మామూలుగా లలితకళల్లో రెండు ప్రధాన వాదాలు పూర్వంనుంచీ వస్తున్నాయి. ఈరెండు వాదాలు కూడ రెండు కొసలకు చెందినవే. ఇకటి శుద్ధభావవాదం, రెండవది శుద్ధ సమాజవాదం. మొదటి వాదం ప్రకారం కళాకారులు తాము జీవిస్తున్న సమాజంలో పనిలేకుండా సమాజానికి దూరంగా

వైయక్తిక స్వేచ్ఛతో జీవిస్తూ తమ వైయక్తిక భావాలకే రూపకల్పన చేస్తారు. కళాకారుని జీవితం సమకాలీన సమాజానికి ప్రతిబింబంగా వుండాల్సిన అవసరం లేదనీ, తాను సృష్టించే కళాకృతులు సామాజిక సత్యాసత్యాలను సామాజిక న్యాయాన్యాయాలను అభివ్యక్తపరచాల్సిన అవసరం లేదని, అటువంటి వాటిని వేటిని అభివ్యక్తపరచినా కూడా కళ అనేది అనుకరణ మాత్రంగానే నిలిచిపోతుంది కాని సృజన అనుపించుకోదు అని. తనను సమాజం అనుసరించాల్సిందే గాని తాను సమాజాన్ని అనుసరించాల్సిన పని లేదని.

ఇక రెండవ వాదం ప్రకారం కళాకారుడు ప్రధానంగా సమాజజీవి. సామాజిక సంక్షేమానికి సహాయపడని కళాసృష్టి అది ఎంత మనోజ్ఞంగా వున్నా, ఎంత భావప్రధానంగా ఉన్నా అడవిన కాచిన వెన్నెలే అని, మానవ కళ్యాణానికి తోడ్పడని కళవృథా అని,- సమాజంలో జరిగే న్యాయాన్యాయాలను ప్రతిబించించని కవిత, కథానిక, చిత్రం, శిల్పం, అన్నీ కూడా ఉత్తమమైన కళా సృష్టి కాదని, కళాకారుడు సామాజికుల్లోని వాడు కనుక సమాజాన్ని వదలి తాను ప్రత్యేక వ్యక్తిగా వుండటానికి, సామాజికమైన మంచి చెడులను వదలి తన వైయక్తికమైన పగటికలలకే రుపాన్నివ్వాలనటం సమంజసం కాదని.

ఈవిధంగా సమాజమే ప్రధానమని ఒక వాదం అంటే, సమాజంతో పని లేదని మరొక వాదం అంటూ వుంది. ఈ రెండు వాదాల్లో కూడ అసమగ్రత పాక్షికత కనుపిస్తూనే వున్నాయి. ఈ రెండూ కూడ కళాకారుణ్ణి ఒక పార్శ్వంలోనే చూపుతున్నాయి. నిజానికి కళాకారుడు కేవలం వైయక్తిక జీవికాని, కేవలం సామాజిక జీవికాని కాడు. కళాకారుడు అటు వైయక్తిక జీవీ, ఇటు సామాజిక జీవీ కూడా. సమాజంలో జీవిస్తాడు కనుక సామాజిక జీవి. అతనిలో భావాలు జీవిస్తాయి కనుక భావజీవి. యువతరం వారు ఈ సత్యాన్ని గ్రహించి ఈ రెండు దృక్పథాల సమన్వయాన్ని యేర్పరచాలి కళాకారుల్లో. యువతరంవారి లలితకళల్లో అటు సామాజిక వాస్తవికతా, ఇటు వైయక్తిత భావుకతా కుంటుపడకుండా చూడాలి. ఈ రెంటిలో ఏది లోపించినా అది ఉత్తమ కళ అనుపించుకొనదు అనే సత్యాన్ని యువతరం తెలుసుకోవాలి.

జీవితంలో ఏవిధంగా అయితే శ్రేయం, ప్రేయం రెండూ అవసరమో అదే విధంగా కళలో గూడా శ్రేయం ప్రెయం రెండూ అవసరం. శ్రేయం అయినదంతా ప్రేయంగాను, ప్రేయమైన దంతా శ్రేయంగాను వుండటం సంభవిస్తే జీవితం ఎంతో సుఖప్రదంగా వుంటుంది. కాని వాస్తవంలో ఎక్కువ

విషయాలు ఆ విధంగా లేవు. లలితకళల్లో అటువంటి సమన్వయాన్ని సృష్టించటం యువతరం చేయవలసిన పని. మేలు కలిగిస్తూనే ఆనందాన్ని కలిగించాలి. ఆనందాన్ని కలిగిస్తూనే మేలు కలిగించాలి. ఆహారానికి రుచీ గుణమూ రెండూ వుండాలి. రుచి ఆనందం కలిగిస్తే గుణం మేలును కలిగిస్తుంది. లలిత కళల్లో కూడా అంతే.

ఇక్కడ ఒక మనో వైజ్ఞానిక విషయాన్ని పరిశీలించాలసి వుంటుంది. ఒక కళాకృతి – అది కవిత కావచ్చు,గానం కావచ్చు. నర్తన కావచ్చు, చిత్రం కావచ్చు, శిల్పం కావచ్చు. మరింకేమైన కావచ్చు. సహృదయునికి రాసానందాన్ని ప్రసాదిస్తుంది. అంటే అర్థం శ్రేయాన్ని ప్రసాదిస్తుందని అర్థం కాదా? మేఘాల మీది ఇంద్రధనుస్సు ప్రేక్షకులకు రసానందాన్ని కలిగిస్తుంది. ప్రేక్షకుల హృదయాల్లో కలిగిన ఈ రసానందం ప్రేక్షకుల జీవితాలకు శ్రేయాన్ని కలిగించినట్లు కాదా! రసానందం సహృదయుల హృదయాలమీద వేసే ముద్ర చెరిగిపోయేదికాదు; అది క్షణికమైనప్పటికి దాని ప్రభావం జీవితంలో క్షణికం కాదు. ఒక సుందరవస్తువునుంచో, వ్యక్తినుంచో, ప్రాకృతిక దృశ్యంనుంచో, ఒకకళా ఖండంనుంచో పొందే రసానందం జీవితంలో ఎంతో మంచి మార్పును తెస్తుంది. నాడీమండలంమీద దాని ప్రభావం ఎంతగానో ప్రసరిస్తుంది. దాని అనుభూతి జీవితంలోని విలువైన అనుభవాల్లో ఒకటిగా నిలిచిపోతుంది. అటువంటప్పుడు ప్రేయం అనేది శ్రేయం కూడా అవుతుంది. సామాజిక చిత్రణను చేస్తే మాత్రమే లలితకళలు శ్రేయాన్ని కలిగించవు. రసానందాన్ని రేకెత్తించే మీ భావాలను చిత్రించినా శ్రేయాన్ని కలిగించినట్లే అవుతుంది; రసానందం అనేది శ్రేయమైన విషయమే కనుక. అయితే, యువతరం ఒక విషయాన్న మాత్రం మరచిపోరాదు. సామాజికమైన శ్రేయం స్థూలశ్రేయం, రసానందపు శ్రేయం సూక్ష్మశ్రేయం. ఆకలి తీరటం స్థూల శ్రేయం, సౌందర్యతృష్ణ తీరటం సూక్ష్మశ్రేయం. జీవితంలో స్థూలానికి సూక్ష్మానికి కూడా సమాన ప్రాముఖ్యం వుంది.

లలితకళలు ప్రజాస్వామికంగా వుండాలని యువతరం వారు అనటంలోని అర్థం వాటిల్లోని స్థాయి చౌకబారు కావాలని కాదు. వాటి వ్యాప్తి ప్రజల్లోకి చొచ్చాలని, జీవితంలో నిత్యమూ ఉపయోగపడే చిన్నవస్తువు కూడ సుందరంగా కళాత్మంగా ఉండి మానవుని దైనందిన జీవితంలో అది ప్రతిక్షణమూ ఉపయోగానికి తోడు రసానందాన్ని కూడ ప్రసాదిస్తుండాలని. ఈ మధ్య

కాలంలో జీవితాన్నుంచి కళ వేరైపోయి ఒక ప్రత్యేక మైన క్షణిక నిషానిచ్చేదిగా వ్యవసహరిస్తుంది. అటు సారూప్య కళాకృతి అయేది, ఇటు నైరూప్య కళాకృతి అయేది అది జీవితంలో ఒక భాగమై వుండేలాగా చేసుకో అప్పుడు జీవితంలోని బాధలు వ్యధలు ఆందోళనలు, ఆరాటాలు తగ్గిపోయే అవకాశం వుంటుంది.

కళ యెవరికొఱకు అనే ప్రశ్న యువజనుల్లో తలయెత్తాలిసిన అవసరంలేదు. యువజనులు ప్రధానంగా సమన్వయవాదులు. అందువల్ల కళ అందరికొఱకు అనే సమన్వయవాదాన్ని అనుసరిస్తారు వారు. కళ జీవితంలో జనిస్తుంది. జీవితంలో వికసిస్తుంది. జీవితం నిమిత్తమే జీవిస్తుంది. కళ కళ కోఱకే అంటే కూడా కళ జీవితం కోసమే అని అర్థం. కళ జీవితములోదే కనుక.

యువతరపు జీవన విధానం వేరు, వారి అవసరాలు వేరు, ఆశయాలు వేరు. ఆకాంక్షలు వేరు, ఆలోచనలు వేరు, అనుభూతులు వేరు. వారు జీవిస్తుంది ప్రధానంగా యాంత్రికయుగంలో, ప్రత్యేకించి పరమాణుయుగంలో, అంతరిక్షయానయుగంలో, జాతీయత కంటే యెక్కువ అంతర్జాతీయతకు చెందిన యుగంలో. అందువల్ల వారి సామాజిక వ్యవస్థయే వేరు. సామాజికమైన పాత విలువలు మారిపోతున్నాయి. వారి సామాజిక వ్యవస్థలో, మానసికమైన ఎన్నో నూతన ప్రతిభలు వికసిస్తున్నాయి. వారి జీవితాల్లో వీటన్నిటి ననుసరించే యువతరపు లలితకళలు కూడా రూపొందటంలో ఆశ్చర్యమేమీ లేదు.

ఒకవైపున లలితకళల స్వభావాన్ని స్థూలత్వంనుంచి సూక్ష్మత్వంలోకి రూపాంతరపరుస్తూనే, జడాన్ని చేతనంగా మారుస్తూనే, రెండో వైపున లలితకళలను సార్వజనీనం చేయట మనేది కష్టసాధ్యమైన పని. ఇటువంటి కష్టసాధ్యమైన పనినే యువతరం సాధించాలి. లలితకళల స్థాయిని తగ్గించకుండా అవి ప్రజాసామాన్యానికి అందుబాటులోకి వచ్చేలాగా చూడటం. అంటే ప్రజాసామాన్యపు మానసిక స్థాయిని హెచ్చించ ప్రయత్నించటం. లలితకళా రంగంలో యువతరం నెరవేర్చవలసిన మహత్కార్యం ఇది. ప్రజా సామాన్యం అర్థం చేసుకోవాలని లలితకళల స్థాయిని తగ్గించటంలో రెండు ప్రమాదాలున్నాయి. ఒకటి - కళాసృష్టి చౌకబారు కావటమూ, రెండు - ప్రజాస్వామ్యపు మానసికశక్తి ఎదుగూ బొదుగూ లేకుండా వున్న నిమ్నస్థాయిలోనే వుండిపోవటమూ, ఆ విధంగా కాకుండా, లలితకళల స్థాయిని దించకుండా ప్రజాసామాన్యపు మానసికస్థాయిని పెంచప్రయత్నిస్తే కళాసృష్టి

ఉన్నత స్థాయిలో వుండటం, ప్రజాసామాన్యపు మానసికస్థితి కూడా ఉన్నతస్థాయికి ఆరోహించటం జరుగుతుంది. ప్రతి విషయాన్ని తన అందుబాటుకు కుదిరేచట్టంలో బిగించుకోవటంలో మానవుని శక్తి సామర్థ్యాలు కుంటుబడతాయి. ఆ విధంగా గాక, ఆ విషయాన్ని అందుకోటానికి వీలైన చట్టంలో తాను సరిపోయేంతగా పెరుగుతూంటే మానవుని శక్తిసామర్థ్యాలు వికసించప్రారంభిస్తాయి.

ఈ విధంగా లలితకళల్లోని స్థాయిని తగ్గించకుండా వాటిని సార్వజనీనం చేయాలంలే జనసామాన్యానికి ఆ విషయాలను అర్థం చేసుకోటానికి శిక్షణ ఇవ్వాల్సిన అవసరం వుంటుంది. ఇందుకు యువతరపు విద్యా విధానంలో ఎంతో మార్పు రావాలి. విద్యా విధానంలో చిన్నప్పటినుంచి వైజ్ఞానిక పాఠాలు చెపుతూ వచ్చినట్లే లలిత కళల పాఠాలను కూడా ప్రవేశపెట్టాలి. లలిత కళల పాఠాలంటే ఇక్కడ అర్థం కవితలను రచించటం, సంగీతం పాడటం, చిత్రించటం, శిల్పించటం, నర్తించటం, నేర్పాలని కాదు. అవి ప్రత్యేక విషయాలుగా ఇష్టమైన విద్యార్థి తీసుకొని సాధన చేస్తాడు. అవి ప్రతివారికి నిర్బంధ పాఠ్యక్రమం కాకూడదు. కాని, లలితకళలను చూచి, విని ఆనందించే శిక్షణమాత్రం ప్రతివారికి నిర్బంధ పాఠ్యక్రమం కావాలి. కళాసృష్టి (art creation) కాక కళారసాస్వాదన (art appreciation) విద్యా విధానంలో తగిన స్థానాన్ని కలిగి ఉంటే ప్రజాసామాన్యపు రసాస్వాదన శక్తి పెరిగి ఉన్నత స్థాయికి చెందిన సూక్ష్మాతిసూక్ష్మ కళాకృతులను కూడ ఆనందించగలరు. లలిత కళల విషయంలో ఈ బరువు భారాలను యువతరం వారు వహించాలి.

కళాకారులు కవిత్వాన్ని త్రాగి, రంగులని తిని జీవించజాలరు. వారుకూడ తోటి మానవులలాంటి మానవులే. వారి ఆకలి తీరటానికి ఆహారం అవసరం; వారి దాహం తీరటానికి నీరు అవసరం. కనుక కళాకారులు కేవల రసజీవులుగా మాత్రమే జీవించజాలరు. మిగతా మానవుల వలె వారు కూడా ఆర్థిక జీవులు. మనం నివసిస్తున్న వైజ్ఞానిక యుగం ప్రధానంగా ఆర్థిక యుగం. కనుక యువ కళాకారులు తమ తమ కళా సృష్టిలో యెంతో సిద్ధహస్తులైనప్పటికీ, తమ తమ కళారంగాల్లో యెంత కీర్తి నార్జించినప్పటికి ఆర్థికంగా మంచి స్థితిలో లేనప్పుడు వారి జీవితాలు బాధామయంగానే ఉండిపోతాయి. మన దేశంలో యేరచయితా కూడా కేవలం కలంతో జీవించజాలడు. ఏ చిత్ర కారుడూ కుంచెతో మాత్రమే జీవించజాలడు. ఇదే స్థితి ఇతర కళాకారులది కూడ.

యువతరపు కళాకారులు, ఉత్తమ కళాసృష్టిచేయాలంటే సమాజంలో ఇతర్లవలె సుఖంగా జీవించాలంటే వారు ఆర్థికంగా పుష్టి కలిగి ఉండటం అవసరం. వారు ఆర్థిక పుష్టిని కలిగి ఉండాలంటే వారి కళా కృతులు విరివిగా అమ్ముడు పోవటం అవసరం. రచయితల గ్రంథాలు, చిత్రకారుల చిత్రాలు, గాయకుల పాటకచేరీలు, నర్తకుల ప్రదర్శలూ, ఇవన్నీ తగినంతగా ఆదాయాన్ని రాబట్టాలి. అన్ని సామాజిక స్థాయిలకు చెందిన ప్రజలూ, ప్రభుత్వాలూ సంస్థలూ వీరిని పోషించటంలో దోహదమివ్వాలి.

లలిత కళల సృష్టి, రసాస్వాదన, పోషణ, వీటిలో యువతరం వారు చేయాల్సింది చాలా వుంది. ఉన్నత స్థాయికి తగ్గ కళాసృష్టి జరుగుతుంటేనే గాని ప్రజాభ్రిప్రాయం కూడా ఉన్నతంగా ఉండదు. లలిత కళలను ప్రజాస్వామికం చేయాలనే ఆరాటంలో వాటి స్థాయిని తగ్గించకుండా చూడటం లలిత కళా రంగాల్లో యువతరం వారు చేయాల్సిన ప్రథమ కార్యం, ప్రధాన కార్యం కూడ. ప్రజాభిరుచిని ఉన్నతంగా ఉండేటట్లు కాపాడటం కూడా వారి పనే. అప్పుడు కాని యువతరంలోని లలిత కళలు వాటి లాలిత్యానికి ప్రకాశాన్ని ప్రసాదించజాలవు.

# యువతరం – విద్యారంగం

ఎన్. ఇన్నయ్య

యువకులలో ఉద్వేగం, ఆవేశం కావలిసినంత వుంది. సత్వర ఫలితాలు రాబట్టాలని ఆత్రుత వుంది. లేకుంటే తిరగబడి హింసాత్మకంగా పరిష్కరించడంలో తప్పులేదనే ధోరణి వుంది. ఇది పెద్దలకు నచ్చని రీతి. కనుక తరాల అంతరం ఏర్పడింది. పెద్దల దృష్టిలో "యువకులకు ఆలోచనలేదు. విలువలు లేవు. ఏ ప్రమాణాలు లేవు. ఇది అరాచకానికి దారితీస్తుంది" అంటారు.

ఒకటి మాత్రం వాస్తవం. యువకులలో వైజ్ఞానిక దృక్పథం పెంపొందించటానికి విద్యారంగం పూర్తిగా విఫలమైంది. ఆ విషయాన్ని పరిశీలించే ముందు యువకుల అభ్యుదయానికి గీటురాయి ఏమిటి అని చూడాలి. నా దృష్టిలో ఆచరణ మాత్రమే గీటురాయి. పెండ్లి యువతరపు అభ్యుదయానికి కొలమానం. మన యువకులలో ఎంత శాతం కట్నాలు పుచ్చుకోకుండా, కులాంతర మతాంతర వివాహాలు చేసుకుంటున్నారు? తల్లిదండ్రులకు, సమాజానికి ఎదురుతిరిగి ఆదర్శ వివాహం చేసుకొని అభ్యుదయంవైపు పయనిస్తున్నారు. నూటికి ఒక్కరుకూడా కనిపించటంలేదు. తల్లిదండ్రుల, బంధువుల సెంటిమెంట్ పేరిట, ఇతరేతర కారణాలవలన పాత పద్ధతులనే అనుసరిస్తున్నారు.

కొత్తగా ఉద్యోగాల్లో చేరిన యువకులుసైతం అవినీతి చర్యలకు తలపడుతున్నారు. ఏ ఆదర్శమూ లేని చదువులనుంచి బయటపడిన డిగ్రీల ఫలితం అది.

ప్రధానంగా మన విద్యారంగంలో తీవ్రలోపం ఉన్నది. సమాజం మారాలంటే ముందుకు ఉరకాలంటే వైజ్ఞానిక కృక్పథం విద్యారంగమంతటా వ్యాపించాలి. విద్యారంగాన్ని నిడిపించే వారిలో వైజ్ఞానిక దృక్పథం లేదు. కనుక వారినుండి మనం ఆశించగలిగింది స్వల్పం. మనిషి మారితే సమాజం మారుతుంది. వైజ్ఞానిక దృక్పథం వుంటే సర్వతోముఖాభివృద్ధి జరుగుతుంది. యువకుల ఉత్సాహం, విప్లవశక్తి చక్కగా ఉపకరిస్తాయి. కనుక విద్యపై వొక్కు చాలా అవసరం.

బ్రిటిష్ పాలన నాటి విద్యావిధానమే నేటికీ కొనసాగుతున్నది. మౌలికమైన మార్పులేవీ లేవు. చరిత్ర, భూగోళం, పౌరశాస్త్రం స్థానే

కలగాపులగంగా సోషల్ స్టడీస్ అని ప్రవేశపెట్టారు. 11 సంవత్సరాలనుండి 10 ఏండ్లకు తగ్గించటం, 12 వ తరగతి పెట్టి తొలగించడం, ఎఫ్.ఎ. స్థానే పి.యు.సి. ప్రవేశపెట్టడం వంటి ఆకృతిక మార్పులు తప్ప సిలబస్‌లోగాని, బోధనలో గాని, శిక్షణలోగాని వైజ్ఞానిక దృక్పథంతో మౌలిక మార్పులు చేయలేదు. నేటి విద్యా విధానం కాలదోషం పట్టిందనటంలో బేధాభిప్రాయంలేదు. అది గుర్తించే అనేక సంఘాలు వేస్తూ వచ్చారు. కాని, ఆ సంఘాల సిఫారసులు మాత్రం అమలు జరపటంలేదు. ఎంతసేపూ అయ్యవారికి చాలు ఐదు రూపాయల ఇంక్రిమెంట్లు, పిల్లలకు చాలు పదిమార్కులు అనే దోరణే వ్యక్తమౌతున్నది: ఈ విద్య మన యువతరానికి నిరుపయోగమైనది. దానివలన వారు ప్రయోజనం పొందలేక పోతున్నారు సరికదా వారికి ఉత్తేజంకూడా రావడంలేదు. సమాజానికి చదువుకూ సంబంధంలేని లాంఛనపుపాఠాలు అయినవి. ఏమీ తోచక డిగ్రీలకై పైచదువులకు ఎగబ్రాకుతున్నారు. ఇట్లాంటి పరిస్థితుల్లో విద్యార్థులు కాపీకొడుతున్నారనీ, చదవటంలేదనీ, వూరికే ఉత్తీర్ణులను చేయమంటున్నారనీ పూర్వం యిట్లా వుండేది కాదనీ తిడుతూ కూర్చుంటే ప్రయోజనం లేదు. కావలసింది ఆచరణ, పునరాలోచన, విద్యారంగంలో మౌలిక మార్పులు, ఇవి సంస్కరణ రోజులు కావు. సమాజాన్ని, రాజ్యాంగాన్ని దృష్టిలో పెట్టుకొని విద్యలో విప్లవం తేవాలసిన సమయం ఆసన్నమైంది. ఎం.ఎ., వరకూ ఎవరైనా ప్రయివేట్‌గా ఈ విద్యను ఆర్జించవచ్చు. ప్రాథమిక విద్యాస్థాయినుండీ, సమాజావసరాలదృష్ట్యా, వివిధ వృత్తుల విద్యను ప్రవేశపెట్టాలి. హైస్కూలునుండి బయటపడేసరికి విద్యార్థి తన అభిరుచినిబట్టి ఆయా వృత్తి శిక్షణకు వెళ్ళగలగాలి. అప్పుడు నిజంగా ఆసక్తి వున్నవారే పైచదువులకు పోతారు. ఆ పిమ్మట పరిశోధనకు వెళ్తారు. ఇట్లా వృత్తులలో ప్రవేశించగల విద్యార్థులు ప్రతిభ చూపితే ఉత్తరోత్తరా మళ్ళీ చదువుకునే అవకాశం వుండాలి. అంటే నేటి లాంఛన విద్య పూర్తిగా పోయి వైజ్ఞానిక దృక్పథంతో కూడిన విద్య రావాలి. నేటి పరీక్షా పద్ధతులు తక్షణం రద్దు చేయాలి. సంవత్సరం పొడవునా ఆసక్తితో చదివే విద్యకు ఏడాది చివర పరీక్షలు అనవసరం. ఎప్పటికప్పుడే భిన్న పద్ధతులలో పరీక్షించే పద్ధతులు రావాలి. ఇందుకు ఉపాధ్యాయుల శ్రమ, సహకారం అవసరం.

మనదేశంలో విద్యా రంగానికి ప్రధాన్యత లేదు. ఏ పొదుపు వచ్చినా ముందు విద్యారంగంలో కోతపెడుతున్నారు. విద్యకు కొన్నాళ్ళ పాటు

ఉద్వాసన చెప్పినా విచారించేవారు లేదు. దీని ప్రమాదం దీర్ఘకాలికంగా తెలుస్తుందేగాని వెంటనే కాదు.

నేడు తక్షణం చేయగలిగింది కొఠారి సంఘ సిఫార్సులను యధాతథంగా అమలు పరచడం. లేకుంటే యిప్పటికే అడ్డగోలగా వున్న యువతరం శాశ్వతంగా వీధికెక్కి అరాచకాన్ని సృష్టించక మానదు.

నేటి యువతరానికి ప్రజాస్వామ్యపు విలువలు నేర్పే విద్య కావాలి. అంటే బేధాభిప్రాయాలు చర్చలద్వారా పరిష్కరించుకోవటం, భిన్నాభిప్రాయాలు గౌరవించటం వంట బట్టాలి. విద్యాసంస్థలన్నిటా అసోసియేషన్ వారీగా ఎన్నికలు జరగాలేగాని, అవినీతి చర్యలకు పురికొల్పే యూనియన్ ఎన్నికలు తొలగించాలి.

అన్నిటికంటే ప్రధానమైనది రాజకీయ పార్టీలచేతుల్లో విద్యార్థులు కీలుబొమ్మలు కాకుండా వుండగలగడం. విద్యార్థి దశలో వివిధ రాజకీయ సిద్ధాంతాలతో క్షుణ్ణంగా పరిచయం వుండాలేగాని, పార్టీ రాజకీయాల్లో పాల్గొనకూడదు. ఆదర్శాల అనుపానులు ఆకళింపు చేసుకుంటే మానసిక పరిణతి వచ్చినపుడు ఆచరణకు ఉపక్రమించవచ్చు.

యువతరంపై దేశభవిష్యత్తు ఆధారపడివుంటుందనేది ఎవరికీ తెలియని విషయంకాదు. అయినా వారినే నేడు అశ్రద్ధ చేయటంవలన విషమ ఫలితాలు కలుగుతున్నాయి. యువతరం విజ్ఞానానికి వివేచన జోడిస్తే ఉద్వేగం అదుపులో ఉంటుంది. సక్రమరీతులు గల సమాజానికి అదే భద్రత.

# యువతరం – సాహిత్యం

అద్దేపల్లి రామమోహనరావు

ప్రపంచవ్యాప్తంగానే ఈనాడు యువతరం ఒక విశిష్టమైన శక్తిగా గుర్తింపబడుతోంది. చివికి జీర్ణమైపోయిన పాతవిలువలు, తమ జీవితాల్ని యింకా గుప్పిట్లో పట్టుకొని ఊపిరి సలపనివ్వకపోవడాన్ని ఈ యువతరం సహించే స్థితిలో లేదు. పాతవిలువలతో కూడిన పాత సమాజాన్ని ధ్వంసం చేసి, నూతన సమాజాన్ని తక్షణం సృష్టించుకోవాలనే తపన ఈ తరాన్ని అనుక్షణం ఉత్తేజితం చేస్తున్నది. ముఖ్యంగా ఆర్థిక రాజకీయ విషయాల్లో దారుణ అసమానతల్ని సృష్టించి, తమ బ్రతుకుల్ని శాసించే పాతతరంయొక్క కుట్రని, ఈ తరం సహించే స్థితిలో లేదు. అందుకే ఈ నాడు చెలరేగే పోరాటానికి కారణం, పాతతరం యొక్క 'హిపోక్రసీకి', కొత్తతరంయొక్క 'ఐడియలిజమ్'కీ జరుగుతున్న సంఘర్షణ, అని శ్రీ శ్రీ అన్నారు.

ఈనాటి ఐహిక అసమానతలకి కారణం, రాజకీయంగా ఆర్థికంగా దురధికారాన్నీ, ఆ అధికారాన్ని సర్వవిధాలా పెంచిపోషిస్తున్న సాంస్కృతిక విలువల్నీ, తీవ్రంగా సమాల్ చేసి, రాజీలేని పోరాటం చెయ్యాలనే తత్వం ఈనాటి యువతరానికి వెన్నెముక. ప్రపంచవ్యాప్తంగా చెలరేగుతున్న యువజన విద్యార్థి పోరాటాలు ఈ తత్వానికి ప్రతిబింబాలు. ఇటువంటి యువతరం సృష్టించే సాహిత్యం తప్పనిసరిగా, యింతకుముందు కాలంలో కంటే, ఎక్కువ సామాజికంగా ఉంటుంది. రసస్పందనగాని, వ్యక్తిగతమైన అనుభూతిగాని, ఈనాటి సాహిత్యం యొక్క పరమార్థంగా భావించబడటంలేదు. వ్యక్తి స్పృహ సామాజికస్పృహగా మారినకాలంలో, సాహిత్యం వ్యక్తిగతరక్తిగాగాక, సామాజిక శక్తిగా గుర్తింపబడటంలో ఆశ్చర్యంలేదు. వ్యక్తిగతమైన సంస్కృతి, గుణశీలాలు, వేదాంతమూ, యింతకుముందు సాహిత్యాన్ని నడిపిస్తే, ఈనాడు వాటికి మూలకారణాలైన ఆర్థిక, రాజకీయ శక్తుల్లోని విషవలయాల్ని ఛేదించడం యువకవికి ధ్యేయం అయింది. ఈనాటి అధమ స్వార్థ రాజకీయాలే, ప్రతి వ్యక్తి బ్రతుకునీ అడుగడుగునా శాసిస్తున్నై. ఈనాడు వ్యక్తియొక్క ఐహిక అనుభూతి సర్వమూ, రాజకీయాల గుప్పిట్లో ఉంది. అందుచేత ఈ సమాజం మారాలంటే, ఈ కుహనా రాజకీయాల్ని కూల్చడమే ప్రధాన కర్తవ్యమనే స్పృహవల్ల, ఈనాటి యువకవులు రాజకీయాల్నే సాహిత్యానికి ఊపిరిగా చేసుకున్నారు. ఈనాటి సాహిత్యమే రేపటి సమాజానికి కూడా తలమానికంగా

ఉండాలనీ, ఈ కవులే తర్వాత తరాల్లో గూడా పూజింపబడాలనీ, వీరికి దురాశలేదు. ఏనాటి సామాజిక సంఘర్షణలు ఆనాటి పరిష్కారాన్ని వెదుక్కుంటూ, యువతరాన్ని స్పందింప జేస్తయి. సాహిత్యం సామాజిక శక్తి కాబట్టి, ఆయా కాలాల్లో మారుతున్న విలువల్ని ప్రతిబింబింపజేస్తుంది. ఐతే శక్తిమంతుడైన కవి, తన కాలానికి దర్పణంగా తర్వాతి తరాల గుర్తింపును పొందవచ్చు. పొందకపోయినా, తన చుట్టూ ఉన్న సమాచారంయొక్క మార్పుకు తానొక సమిధ కావటం ఈనాటి కవి ప్రథమ లక్ష్యం.

ప్రాచీన తెలుగు సాహిత్యమూ, ఆధునిక సాహిత్యంలోని భావ, అహంభావ, అధివాస్తవికాది సర్వధోరణులూ, ఎక్కువగా కవియొక్క స్వతంత్ర ప్రతిభను కాకుండా యితర సాహిత్యాల ప్రతిధ్వని శక్తినే నిరూపించినై. ప్రజలలో చెలరేగే ఉద్యమాల్ని సాహిత్యం అనుసరించినప్పుడు మాత్రమే యితర సాహిత్యాలకి అనుకరణలు గాక, కవియొక్క స్వతంత్రమైన ఉత్తేజన ఫలితంగా సాహిత్యం రూపొందగలదు. ఇటువంటి శక్తి, ప్రజా సంఘర్షణలనుండి ఉద్భవించిన అభ్యుదయ, విప్లవ కవిత్వాలకు మాత్రమే వుంది. అందులోనూ అభ్యుదయ సాహిత్యం కొన్ని పాత విలువలతో రాజీపడి ఉద్యమశక్తిని బలహీన పరిచిన దశలో విప్లవ సాహిత్యమే ఈనాటి యువతరంయొక్క అశాంతినీ, అసంతృప్తినీ, పోరాట శక్తినీ సంపూర్ణంగా ప్రతిబింబించగల్గుతోంది. ఈనాటి ప్రపంచాన్ని రెండు వర్గాలుగా విడగొట్టిన ఆర్థిక రాజకీయ శక్తుల కుహనా వలయాల్ని, ఆ వలయాల్ని ఛేదించి సమసమాజాన్ని నిర్మించగల సంఘర్షణల్ని ఈ సాహిత్యం స్పష్టంగా, తీవ్రంగా రూపొందించగల్గుతోంది.

ఈనాడు సాహిత్యాన్ని సృష్టిస్తున్న యువతరంలో గూడా రెండు భిన్న ధోరణుల్ని గుర్తించగలం. ఒక ధోరణి సాహిత్య సృష్టిలో వ్యక్తిగతమైన స్వేచ్ఛని సమర్థిస్తుంది. మరొక ధోరణి సామాజికమైన ఉద్యమశక్తినుంచి కవి వేరుకారాదని ప్రబోధిస్తుంది. ఏ కళా రూపానికైనా, హృదయాన్ని స్పందింపచేసి, కార్యోన్ముఖుల్ని చేసే శక్తి వుంది. వ్యక్తిగతమైన స్వేచ్ఛని కాంక్షించే కవి, ఆ శక్తిని గుర్తించడంలేదు. తాను చూస్తున్న సమాజంలోని సమస్యలనుండి విముఖుడై, తనలోకి తాను ముడుచుకుపోయి, సమాజాన్ని మార్చాలనే యువతరం ధ్యేయాన్ని పక్కదోవలు పట్టించడానికి ఎస్కేపిస్టు సాహిత్యాన్ని సృష్టిస్తున్నాడు. కుళ్ళిన పాత సమాజాన్ని పునర్నిర్మించాలనే ఈ నాటి యువతరం యొక్క ఆందోళన, సామాజికోద్యమంలోనుండి వికసించే రచయితల్లో మాత్రమే ప్రతిబింబిస్తోంది.

ఐతే, ప్రజల్లో ఉత్తేజాన్ని కలిగించాలనే ఈ సాహిత్యం ఆ ప్రజల్ని ఎంతవరకు చేరుతోంది అనే ప్రశ్న సహజంగానే కలుగుతుంది. భాషాభావాల్లో సర్వ విధాలైన క్లిష్టతనీ వదిలి పెట్టి, ప్రయోగవక్రతల్ని అవతలకి నెట్టి, పఠితలలో సామాజిక అభిప్రాయాల్ని రగిలించే లక్ష్యంతో పురోగమించడంలో, యింతకు పూర్వం ఎన్నడూ లేనంత వేగాన్ని ఈనాటి యువతరం సాహిత్యం సాధించిందని చెప్పడంలో ఏమీ అతిశయోక్తి లేదు. అందువల్లనే ఈనాడు, ఏ సాహిత్య సభలోనైనా, ప్రజలు (ముఖ్యంగా యువకులు) తమ గుండెల్లోకి సూటిగా హత్తుకునే సామాజిక భాషాభావాల్ని మాత్రమే బాగా ప్రశంసించగలుగుతున్నారు. సామాజిక ఉద్యమాభిముఖంగా విస్తృతమయ్యేదశలో ఈనాటి సాహిత్యం ఉంది. అది యింకా పురోగమించి, ప్రజా బాహుళ్యాన్ని ఉత్తేజితం చెయ్యగలదనే ఆశని, ఈనాటి సాహిత్య వాతావరణం కలిగిస్తోంది. భాషాభావాల్లో ఎంతగా ప్రజల్నీ వారి సమస్యల్నీ సంఘర్షణల్నీ సాహిత్యం ప్రతిబింబిస్తుందో, అంతగా ప్రజల్ని స్పందింపజెయ్యగలుగుతుంది. ఆ దశని సాధించడానికే ఈనాటి సామాజిక సాహిత్య కారులు చిత్తశుద్ధితో కృషిచేస్తున్నారు. అట్టడుగు వర్గాల యొక్క పరిస్థితులమీద, వారి సంస్కృతి మీద, వారి భాషా రచనల మీద ఈనాటి రచయితల్లో పెంపొందుతున్న గౌరవం, సాహిత్యాన్ని ప్రజలతో ఏకం చేసే ప్రయత్నాల్ని బాగా ప్రతిఫలింపజెయ్యగల్గుతోంది.

సామాజిక సంఘర్షణ ప్రధాన లక్ష్యంగా ఉన్న ఈనాటి సాహిత్యంలో, ఉత్తమ ప్రమాణాలు రానురాను క్షీణిస్తున్నవనే అభిప్రాయం ఈనాడు చాలామంది విమర్శకుల్లో ఉంది. సమకాలీన సాహిత్యాన్ని సాదరంగా, లోతుగా చదవకపోవడం చేతనే వారు ఆ అభిప్రాయానికి వస్తున్నారనే అనుమానం ఈ వ్యాస రచయితకుంది. సాహిత్యంలో ఉత్తమ ప్రమాణాల్ని గూర్చిన దృక్పథం కూడా, సామాజికమైన అవగాహన మీదనే ఆధారపడి ఉంటుంది. సాహిత్యానికి వ్యక్తి లక్షణమైనప్పుడు, భాషా విషయమైన సౌందర్య గాంభీర్యాలూ, వర్ణనా శక్తీ, అలంకార బాహుళ్యమూ, అనుభూతి వ్యక్తీకరణ - మొదలైనవి ఉత్తమ ప్రమాణాలుగా ఉంటై. సమాజం లక్ష్యమైనప్పుడు, వస్తు ప్రాధాన్యమూ, సిద్ధాంత సౌలభ్యమూ మొదలైనవి ఉత్తమ ప్రమాణాలుగా ఉంటై. ఐతే, ఒక భావానికి బలం కలిగించే కవిత్వపు విలువలు ఏ ఉద్యమంలోనూ విస్మరింపబడవు. అభ్యుదయ విప్లవ సాహిత్యాల్లో, సాహిత్యపువిలువల దృష్ట్యా ఎన్నో ఉత్తమ రచనలున్నై అన్న విషయం సహృదయులకు తెలిసిందే. ఏ

భావాలకి సంబంధించిన రచనల్లోనైనా, అన్ని రచనలూ ఉత్తమ ప్రమాణాలు కల్గి ఉండవు. కాని, సామాజిక సాహిత్యంలో మాత్రమే ఉత్తమ ప్రమాణాలు లేకపోయినప్పటికీ ఈ రచనలు ఉద్యమోత్తేజన కలిగించి, ప్రయోజనాన్ని నెరవేర్చడం చూడగలం.

ఏ సంస్కరణల చేతనూ మార్పురానంతగా, ఈ సమాజం అణువణువునా కుళ్ళిపోయింది. ఇటువంటి ఈ సమాజాన్ని పునర్నిర్మించే శక్తి వికసించడానికి, ప్రపంచమంతా యువతరం వైపు ఆశగా చూస్తోంది. ఆ యువతరాన్ని ఉత్తేజితం చెయ్యడానికి, సాంస్కృతిక పోరాటరూపంగా, పాత విలువల్ని ధ్వంసం చేసి, నూతన విలువల్ని నిర్మించడానికి, యువశక్తిలోనుండి వికసించే సాహిత్యమే సమర్థమైంది. యువక కవుల కలలు కార్యాచరణకి దారితీసి యువతరం చేతుల్లో ఈ సమాజం మరో స్వరూపాన్ని సాధించడం సుదూరంగా లేదనే ఆశని ఈనాటి యువతరం సాహిత్యం కలిగిస్తోంది.

# యువతరం - సినిమా

మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

ఈనాడు సినిమా ప్రభావం ఒక్క యువతరం మీదేకాక వృద్ధతరంనుంచి యువతరం వరకూ, ధనవంతుడు మొదలు దరిద్రునివరకూ, చివరికి సామాన్యుడి జీవితం అతినికృష్టంగా గడిచే ఈనాటిపరిస్థితిల్లో, వారి నిత్య జీవితంలో సినిమా ఒక భాగమై పోయింది. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రజానీకం అందరిమీదా సినిమా వీరవిహారం చేస్తూంది. మొత్తం సమాజం మీద ఈనాటి సినిమా ప్రభావం అంతటిది.

సినిమాకు మాతృక నాటకం, నాటక రంగానికి మాతృకలు జానపద కళారూపాలు. వీటిలో దేనిని తగ్గించి చూచినా రెండవది లేదు. నాటకకళ ఒక పరిధిలో మాత్రమే నడుస్తుంది. సినిమాకళ విస్తృతమైంది. నాటకంలో నటులు ప్రేక్షకులతో ప్రత్యక్ష సంబంధం కలిగి ఉంటారు. సినిమా నటునికి ఆ అవకాశం వుండదు.

సినిమా కళ అయినప్పటికీ అది ఈనాడు పరిశ్రమగా మారిపోయింది. ఒకనాడు అన్ని కళల మాదిరే జాతి చైతన్యంకోసం, దేశ భవిష్యత్తుకోసం పాటుపడి ప్రజలను జాగృతినుండి మేల్కొలిపిన సినిమా ఈనాడు వ్యాపార ప్రయోజనాలకోసం చాలవరకు ప్రజలను తప్పుత్రోవల్లో పెడుతూవుంది.

ఈనాటి యువతరంమీద ఉన్నంత సినిమా ప్రభావం జరిగిపోయిన కాలంలో యువతరం మీద అంతగా లేదు. ఈనాటి కంటే ఆనాడు విద్య తక్కువ. అసలు ఆనాడు చిత్రాలే తక్కువ. వచ్చిన ప్రతి చిత్రమూ అంతో ఇంతో జాతీయతనూ, దేశభక్తిని పురికొల్పేది. సాంఘిక ప్రబోధాన్ని కావించేది. ఏదో ఒక సందేశమిచ్చేది. సంఘంలో వున్న వాస్తవిక పరిస్థితుల్ని వివరించేది. యువకుల్లో వుత్తేజాన్ని కలిగించి, ఆసక్తినీ, ఆశయాన్నీ కలిగించేవి. అందుకు నాటి బ్రిటిష్ ప్రభుత్వ బానిసత్వంలో మగ్గటం ఒక కారణం కావచ్చు. నాటి నిర్మాతలు కూడా కేవలం వ్యాపారదృష్టే కాక ఆశయసాధకులుగా కూడా వుండేవారు. ఆనాటి చిత్రాల్లో పచ్చి కామోద్రేకాన్ని చిత్రించే చిత్రాలు చాలా తక్కువ. ఒకవేళ అలాంటి అశ్లీలాలు వున్నట్టైతే ఆ చిత్రం అపజయం పొందేది.

నాటి కంటే నేడు ఎక్కువ చిత్రాలు నిర్మాణమౌతున్నాయి. ఆశయం

కంటే వ్యాపారదృష్టి ఎక్కువైపోయి అందుకోసం ప్రేక్షకుల్ని ఆకర్షించే సాధనాలన్నిటినీ వెతుకుతున్నారు.

ఈనాడు యువలోకం దారితెన్నూ తెలియక తికమకలో పడిపోయింది. భవిష్యత్తుకోసం కొట్టుమిట్టాడుతూంది. కష్టపడి చదువుతున్నారు. డిగ్రీలు సంపాదిస్తున్నారు. అందుకోసం వున్న సర్వస్వాన్నీ పణంగా పెడుతున్నారు. ఉద్యోగానికి ఎదురుచూస్తున్నవారిని నిరుద్యోగ పిశాచి పట్టి పీడిస్తూనే ఉంది. ఉన్నది కాస్తా హారతికర్పూరంలా హరించిపోయి, నిస్పృహతో దారి తెన్నూ తెలియక అగమ్యగోచరంగా ఆలోచిస్తున్నారు. గమ్యంలేని జీవిగా తిరిగి తిరిగి అలిసిపోతున్నారు. నిర్వేదంతో సతమతమౌతున్నారు.

ఏ గమ్యమూ లేని ఈ దీర్ఘయాత్రలో అతనికో గమ్యం కావాలి. ఆ గమ్యం కోసం నిరంతరం పోరాటం జరుపుతున్నాడు. నిరుత్సాహ నిస్పృహల్లో పడిపోయిన యువలోకం పెడదారులు పడుతూ వుంది. జీవితాన్వేషణలో రకరకాల వ్యాపకాలలో పడిపోతున్నారు.

ఈనాడు సినీ నటీనటులకు అందులో ముఖ్యంగా నాయకీనాయకులకు వచ్చే ప్రేమలేఖలను చూచినా వారికి వచ్చే వుత్తరాల కట్టలు చూచినా నేటి యువతరం మీద సినిమా ప్రభావం ఎంతవుందో అర్థమౌతుంది. ఏ కొత్త సినిమా విడుదలైనా యుక్తవయసులో వున్న యువతీ యువకులు ముందువరుసలో కనబడుతున్నారు. అన్నీ మరచిపోయి అందుకోసం ఎదురు చూస్తున్నారు. ఇవి అందరికీ వర్తించకపోయినా నూటికి తొంభైమంది ఈ వ్యామోహంలో పడి కొట్టుకుపోతున్నారు.

ఈనాడు చాలామంది యువతీయువకులు సినిమాలను ఎంతగానో అనుకరిస్తున్నారు. కట్టులో, బొట్టులో, జుట్టులో, నడకలో, దుస్తుల్లో, అలంకరణ వస్తువుల్లో ప్రతిదీని ఒకటేమిటి? ఎవరిని చూచినా వారిమీద సినిమా ప్రభావం తాండవిస్తూ వుంది.

చలనచిత్రంలో రూపొందించిన నాయకీనాయకుల పాత్రలను అనుకరించడం, ఆ పాత్రలను ధరించిన నటీనటుల జీవితాలను చదవడం, వారి అలవాట్లనూ, ఫేషన్నునూ ఆచరణలో పెట్టడం జరుగుతూ వుంది. ఈనాడు ఏ చిత్రంలో ఏ ఫ్యాషన్ వచ్చినా ఆ మరుసటి రోజున యువతీయువకులు అనుకరిస్తున్నారు.

ఫ్యాషన్‌లను అనుసరించటం తప్పుకాదు కాని, అవి వెర్రితలలు వేయకూడదు. అనుసరించే ఆయా ఫ్యాషన్సును బజారులో ప్రదర్శిస్తున్నారు. కథా నాయకీ నాయకుల విగ్గుల మాదిరి కొంతమంది జుట్టులు కత్తిరించు కుంటున్నారు. రాతియుగపు, మోటుయుగపు మనుషుల్లా మీసాలు పెంచటం, సన్యాసుల్లా గడ్డాలు పెంచటం, చెంపల క్రింద వరకూ, భయంకరంగా వెంట్రుకలు పెంచటం, గొట్టం ఫ్యాంట్సూ, బెల్‌బాటమ్సూ ఒకటేమిటి? రకరకాల కలంకారీ అద్దకంలాంటి బుష్‌షర్టులవల్ల స్త్రీ ఎవరో పురుషుడెవరో తెలుసుకోలేనంతగా దుస్తులు మారిపోయాయి. ఇలా ఎన్నో మార్పులతో వాటి నన్నిటినీ అనుసరించి తృప్తిపడుతున్నారు.

ఇక యువతులు. వారు చూచిన చిత్రంలో కథానాయకి ఏ రంగుచీర కట్టిందో, ఎలాంటి బ్లౌజు ధరించిందో, స్తనద్వయాన్ని ఉబ్బెత్తుగా చూపించడానికి ధరించిన కట్‌బాడీ ఎటువంటిదో, అది బ్లౌజుని తన్నుకొని ఎలా బయటికి కనబడుతుందో, కాళ్ళజోడూ, కళ్ళజోడూ, కంటి రేఖలూ, చీరరంగుకూ, బ్లౌజురంగుకూ, సరిపోయే అదే రంగుగల నుదుటి బొట్టూ, శిరోజాలను చుట్టుముట్టిన అనేకరకాల ముడి చుట్టలూ, ఆ చుట్టలో అలంకరించే రిబ్బన్లూ, పెట్టే పూలూ, కంఠహారాలూ, చెవిదిద్దులూ, ముంజేతి గాజులూ ఒకటేమిటి? అన్నీ ఒకే రంగులో సమన్వయించడానికి పడే పాట్లు అన్నీ ఇన్నీ కావు. వర్ణ చిత్రాలు వచ్చిన తర్వాత ఈ సమన్వయం మరీ ఎక్కువైపోయింది. అలాగే గృహాలంకరణలోనూ వారి వారి రూముల అలంకరణలోనూ, పరికరాలను అమర్చడంలోనూ, సమన్వయ విధానం ఎక్కువ అనుసరించబడుతూ వుంది. ఇలా ఇంటి నలంకరించుకోవడం ఏమీ తప్పు కాదు.

ఇలా వివిధ అలంకారాలనూ, అలంకరించుకున్న యువతీ యువకులు వీధుల్లో తిరిగితే వారికి తృప్తిలేదు. ఇలా తిరిగే వీరి అలంకరణను చూచిన వారంతా ఫలానా కథానాయకునిలా వున్నాడనో ఫలానా కథానాయకిలా వుందనో అంటూ వుంటే వారి ఆనందానికి అవధులు వుండవు. అలాని అనిపించుకోవాలనే వారి సరదా, ఆ కొంచెంసేపూ వారు చలనచిత్రంలో ఉన్న కథా నాయకీ నాయకుల్లా అయిపోయి చూపుల్తో, నడకల్తో వయ్యారపు వంపులతో తృప్తి చెందుతూ తన్మయత్వాన్ని పొందుతున్నారు.

ఇలా యువతీ యువకులు రకరకాల ఫ్యాషన్లతో సినిమాహాల్లో

ప్రవేశించగానే అందరూ వీరి ప్రక్క సమ్మోహితులై చూడాలనీ, వారిని ఆకర్షించాలనీ అభిలాషపడుతున్నారు అందరూ చూచేందుకు పని వున్నా లేకపోయినా అలా రెండు మూడుసార్లు హాల్లో పచార్లు చేయడంతో తృప్తి పడుతున్నారు. ఆకొంచెంసేపూ వారూ సినిమాల్లో వుండే కథానాయకీ నాయకుల్లా అనుభూతిని పొంది అలా ఐపోతున్నారు. అది నేటి యువతరానికి ఎంతో తృప్తినిస్తూంది. ఈ మోజులో పడి ఎంత డబ్బైనా ఖర్చుపెడుతున్నారు. ఆ డబ్బు కోసం తప్పుమార్గాలు వెతుకుతున్నారు.

ఈ విధంగా యువలోకం వారివారి అభిరుచుల్ని బట్టో, అభిమానాన్ని బట్టో, ఆయా సినీ తారల అభిమానులుగా మారిపోతున్నారు.

అన్నివిధాలా, అలంకరించుకొని అందర్నీ ఆకర్షిస్తున్న యువతీ యువకులు ఒకరినొకరు ఆకర్షిస్తున్నారు. ఆ రకంగా ప్రేమకలాపాల్లో పడుతున్నారు. సినిమాల్లో నాయకీనాయకుల శృంగార దృశ్యాలకు అతి సన్నిహితులవుతున్నారు. చలనచిత్రాల్లో కామవాంఛలను రేకెత్తించే ఆయా సన్నివేశాలు యువతీయువకుల్ని రెచ్చగొడుతున్నాయి. వారిలో కామోద్రేకాన్ని కలిగిస్తున్నాయి. ఆ ప్రభావానికి వారు లోనై పోతున్నారు.

మానసిక వేదనల ననుభవించే యువలోకాన్ని సినిమాల్లో కొన్ని దృశ్యాలు, కొన్ని సన్నివేశాలు వినోదాన్ని కలిగించినా, మానసికంగా ఆనందోద్రేకాన్ని కలిగిస్తున్నాయి. ఆ కారణంగా వారు తరుచు సినిమాలు చూస్తూ ఆయా సన్నివేశాలు చూస్తున్నంతసేపు ఆ కొద్ది క్షణాలూ, తమ్ము తాము మరిచిపోయి వేరే లోకంలో విహరిస్తున్నారు. ఆ ఆనందం కోసమే మరీ మరీ సినిమాలు చూస్తున్నారు.

ఈ వ్యామోహంలో పడిపోయిన యువతరం కామవాంఛల్లో తేలికగా పడిపోయి, కొంతమంది భగ్నజీవులై పోతున్నారు. మరికొందరు భగ్నప్రేమికులు నిస్పృహలో పడి త్రాగుటకు అలవాటుపడిపోయి, ఆ మత్తులో వారికి కావలసిన క్షణికానందాన్ని పొందుతున్నారు.

ఈనాడు నగ్న దృశ్యాలను చిత్రించే చలనచిత్రాలు, యువతరాన్ని మరింత రెచ్చగొడుతున్నాయి. నిర్మాతలు వ్యాపారరీత్యా డబ్బు గుంజటానికి ఎంత నగ్న దృశ్యాలకు చూపించడానికి అవకాశముంటుందో అలాంటి అవకాశాలన్నిటినీ వారు అనుసరిస్తున్నారు.

ఇలా నగ్న దృశ్యాలతో నిండిన చిత్రాన్ని చూచిన యువతీయువకులకు ఇక రాత్రిళ్ళు నిద్ర పట్టదు. అందుకోసం వారి కనువైన, అందుబాటులో వున్న జంటను వెదుక్కోవడానికి అన్వేషణ ప్రారంభమౌతుంది. ఆయా నగ్న దృశ్యాలకు సంబంధించిన పత్రికలను భద్రపరుస్తున్నారు. ఆ దృశ్యాలను కట్‌చేసి పుస్తకాల్లో పెట్టెల్లో దాచుకుంటున్నారు.

ఎలాంటివారికైనా, మత్తుల్లోముంచే కామోద్రేకదృశ్యాలకు లోబడనివారు ఎవరుంటారు? అందువల్లనే ఈ వ్యామోహంలోపడి కొట్టుకుపోతున్నారు.

కొందరు యువతీయువకు అలా శృంగారదేవతను ఆరాధిస్తూ వుంటే మరికొందరు భక్తి రస ప్రధానమైన దృశ్యాలనూ, ఇంకా కొందరు భక్తి రస ప్రధానమైన దృశ్యాలనూ, ఇంకా కొందరు యుద్ధాలు, దెబ్బలాటలూ, స్టంటులూ చూచి ఆనందిస్తున్నారు.

ముఖ్యంగా ఈనాడు ఎక్కువగా యువలోకాన్ని నాశనంచేసే క్యాబరే నృత్యాలు చలనచిత్రాల్లోనే కాక ఈనాటి పెద్దపెద్ద హెూటల్సులో కూడా వాటిని ప్రవేవపెడుతున్నారు. కేవలం యువకుల్నే కాక వృద్ధుల్ని కూడా ఈ నగ్న నృత్యాలు పిచ్చెక్కిస్తున్నాయి. క్యాబరే క్లబ్ నృత్యాల్లో కావాలని గంజాయి దమ్ము కొట్టి దమ్మరెదమ్ అంటూ కొందరు తప్పత్రాగి ఆ ఆనందాన్ని అనుభవిస్తున్నారు. ఇది కేవలం విదేశీ చిత్రాల ద్వారా హిప్పీల ద్వారా దిగుమతి అయిన కృత్రిమ సంస్కృతి.

పై ఉదాహరణలన్నీ ఈ నాటి యువతరాని కంతటికీ అంటకట్టడంలేదు. ఎక్కువ శాతం మాత్రం ఇందుకు లోబడిపోతున్నారు.

కొందరు యువకులు, తమవంటి వారివో, ఇంకెరివో, జీవితాలలో ఆసిక్తి చూపి ఆ పాత్రల కష్ట సుఖాలలో లీనమై ఒక విధమైన అనుభూతి పొంది తద్వారా తమ మేధస్సుతో జీవితం యొక్క లోతులు తెలుసుకొని తాత్వికంగా, ఆధ్యాత్మికంగా, ఒక స్థాయి విలువలకోసం సినిమాలను చూస్తున్నారు. అటువంటి చిత్రాల సంఖ్య ఎంత తక్కువో చూచే యువతరం కూడా అంత తక్కువే.

అలాగే వారిని ఎక్కువగా ఆకర్షించే వుత్తమ చిత్రం అదృష్టవశాత్తూ దొరకగానే దానిని చిరకాలం మరచిపోకుండా స్మృతిపథంలో దాచుకుంటారు.

ఇలాంటివారు ఒక కళాత్మక చిత్రం వచ్చిందంటే జన్మ తరించినట్లు భావిస్తారు.

మరి కొందరు యువకులు కేవలం వినోదం కోసం, పొద్దు పుచ్చటంకోసమే సినిమాకు వెళ్తారు. అటువంటివారు సినిమానుంచి ఏమీ ఆశించరు. సినిమా బాగుందంటే క్షణికానందంలో బాగుందంటారు. లేదా చెత్త పిక్చరని నిద్ర దండుగని చెప్పేస్తారు.

ఇంతకీ ఈనాడు సినిమాల ప్రభావం ఎంతవరకు వచ్చిందంటే, కాలేజీ యూనివర్శిటీ విద్యార్థిలోకం గుంపులుగుంపులుగా జంటలు జంటలుగా ఏకాంత ప్రదేశాలకు విహారయాత్రలకు పోయి ఆటలాడడం, పాటలు పాడడం, ఈలలు కొట్టడం, తినడం, త్రాగడం, దొర్లడంతో కాలక్షేపం చేస్తూ సాంఘిక విలువల్ని తగ్గించి వేస్తున్నారు.

ఈనాడు కేవలం సినిమా వ్యామోహంవల్ల అనేకమంది యువతీయువకులు చదువుల్ని వదిలిపెట్టి సమర్థత వున్నా లేకపోయినా సినిమారంగంలో ప్రవేశించటానికి తండోపతండాలుగా మద్రాసువచ్చి నానా అవస్థలూ పడిపోతున్నారు. వచ్చినవారు కొంతమంది తిరిగి వెళ్ళలేక ఏదో ఒక పనిలో ప్రవేశించి ఎటూ ఎదగలేక సతమతమౌతున్నారు. ఇక యువతుల విషయం మరీ దారుణంగా తయారైంది. సమర్థతవున్న యువతీయువకులు సినిమారంగంలో ప్రవేశించి అందుకోసం కృషిచేసి పైకి రావడంలో ఏమాత్రం ఆక్షేపణలేదు. కాని అది ఈనాడు మరీ పిచ్చి వ్యామోహం క్రింద మారిపోయింది.

ఈనాడు సినిమారంగంలో ప్రవేశించేవారుగానీ, సినిమాలు చూచేయువతరమంతా చెడిపోతూందనిగానీ నేను చెప్పటం లేదు. చెడిపోయే మనిషి ఎప్పుడైనా ఏవిధంగానైనా చెడిపోతాడు. అలాంటివారికి సినిమా ఆలంబనమైందని మాత్రమే చెపుతున్నాను. ఆసక్తి అంతగా లేకపోయినా సినిమాలు మరింత రెచ్చగొడుతున్నాయి.

ఉదాహరణకు ఈనాడు న్యూయార్కు, చికాగో వంటి నగరవీధుల్లో స్త్రీగాని పురుషుడుగాని సాయంత్రంపూట క్షేమంగా షికారుకు వచ్చే అవకాశం లేకుండా పోయింది. ఒక ఫర్లాంగు పొడువునా వీధిలో నగ్న దృశ్యాలతో, అసభ్య చిత్రాలతో దౌర్జన్యకాండతో ప్రాముఖ్యం వహించే చిత్రాలు ప్రదర్శించే థియేటర్లు 18 వున్నాయంటే నేడు ప్రపంచవ్యాప్తంగా యువతరం మీద సినిమా ప్రభావం ఎంత వుద్ధృతంగా వుందో పై ఉదాహరణను బట్టి తెలుసుకోవచ్చును.

ఈనాడు అందమైన ఆడమనిషి వీధిలో స్వేచ్ఛగా నిర్భయంగా నడిచే అవకాశంలేకుండా పోయింది. వెంటబడి ఈలలతో సినిమా ప్రేమగీతాలతో నానారభస పట్టిస్తున్నారు.

ఈనాటి చలనచిత్రాలు వాస్తవికంగా వుండటంలేదు. జీవిత సమస్యలన్నిటినీ తారుమారు చేస్తున్నారు. నిజంగా సినిమా కళద్వారా, దేశాన్నీ ప్రజలనూ అనేక విధాల బాగుచేయించవచ్చు. నీతి ప్రబోధాలు చేయవచ్చు. అభ్యుదయ పథకాలను ప్రచారం చేయవచ్చు. ఈ కళద్వారా ఎంతమంచైనా చేయవచ్చు.

కాని, ఈనాటి కథలను వ్యాపారం కోసం ఇష్టం వచ్చినట్లు మలుపులు తిప్పుకొంటున్నారు. అవాంఛనీయ సంఘటనలనన్నిటినీ చిత్రిస్తున్నారు. ఈ సంఘటనలతో ఉత్తేజితులైన అనేకమంది యువకులు అక్రమసంపాదనలకు, చాకచక్యంతో కూడిన దొంగతనాలకు, దౌర్జన్యాలకు, హత్యలకు, పాల్పడుతున్నారు.

ఈనాడు సినిమాల్లో ప్రవేశించిన అనేక మంది యువకులు అభ్యుదయ కరమైన చిత్రాలు తీయాలనే ఆశయం వున్నా, వారి అభిప్రాయాలను ప్రవేశపెట్టలేకపోతున్నారు. ఇది ముఖ్యంగా యువనిర్మాతలకూ, దర్శకులకూ సంబంధించిన విషయం.

ఈనాడు కేవలం ఆదర్శంకోసమే చిత్రాలు తీస్తే చేతులు కాల్చుకోవడమే. అటువంటి చిత్రాలను ఎక్కువమంది ప్రజలు ఆదరించడంలేదు. అలా ఆ ఆదర్శాలను ప్రవేశపెట్టి తీసిన చిత్రాలు బాగున్నవన్నారు కానీ, పైసా వాటికి రాలేదు. నిర్మాతలు నష్టపోతున్నారు.

కనుక నిర్మాతను బట్టీ, అతని పెట్టుబడికి గ్యారంటీని బట్టీ అతని చిత్రముంటుంది. అలాంటి చిత్రాన్నే అతను తీస్తాడు. ఎంత ఆశయమున్న యువదర్శకుడైనా అందుకు లోబడి అలాంటి నిర్మాతల క్రింద చిత్రాలు తీయాల్సిందే. అందువల్ల యువదర్శకులు అభ్యుదయాన్ని అవతలకు నెట్టి, ఆర్థికలాభాలకోసం అనువైన విధానాలనన్నిటినీ అనుసరిస్తున్నారు. ఒకవేళ తాను నమ్మిన సత్యంకోసమే చిత్ర దర్శకత్వాన్ని వహిస్తానని ఏ యువకుడైనా అంటే ఆయనకు అంతటితో స్వస్తి.

అయితే కొన్ని చిత్రాల్లో ఆశయాలనూ, ఆదర్శాలనూ ప్రవేశపెట్టడం

జరుగుతూనే వుంది. కాని అది ఏమంత చెప్పుకోదగిన అభివృద్ధి కాదు.

వింత వింత దోరణులను ప్రవేశపెడుతున్న చలనచిత్ర పరిశ్రమను జాతీయం చేస్తే బాగుంటుందంటున్నారు కొందరు. జాతీయం చేసినంత మాత్రాన ప్రభుత్వం దేశప్రజల నైతిక, సాంఘిక ప్రయోజనాలను అమాంతం ఒక్కసారిగా ఏమీ సాధించలేదు. ఇందుకు ప్రభుత్వ విధానాలు మారాలి. ఆ విధానాలు ప్రజలకుపయోగంగా వుండాలి. వాటిని వారు నమ్మి అనుసరించాలి. వారికి నమ్మకం కలగాలి. అలా కలిగిననాడు జనంలో చైతన్యం కలుగుతుంది. యువతలో ఉత్తేజం కలుగుతుంది. ప్రతివాడూ తన బాధ్యతల్ని గుర్తిస్తాడు. ప్రభుత్వం చెప్పేది నమ్ముతాడు.

కాని గుత్తపెట్టుబడిదారీ విధానం రాజ్యమేలినంత కాలం, ప్రజలను దోపిడీచేసే ద్రోహులున్నంతకాలం అలాంటి ప్రజాస్వామిక విధానాలను అమలుపర్చే, ఇతర సోషలిస్టు రిపబ్లిక్కులూ, సోషలిస్టు మూలసూత్రాల ననుసరించే ప్రభుత్వాలూ, సినిమాను జాతీయంచేసి జాతీయ విలువల్ని పెంపు చేస్తున్నాయి.

ఇక ఈనాటి సెన్సారుబోర్డు, చలనచిత్రాలమీద ఎంత కఠినంగా వున్నా, ఇంకా జుగుప్సాకరమైన విధానాలూ, దృశ్యాలూ వెలువడుతూనే వున్నాయి. సెన్సారుకు చూపించే షాట్స్ వేరు, రిలీజు ప్రింటులో చూపించేవి వేరు. ఇలా సెన్సారు బోర్డును మోసం చేయడంకూడా జరుగుతూ వుంది.

ఆమాత్రం సెన్సారు బోర్డు కఠినంగా వున్నందువల్లనే కొన్ని చిత్రాలైనా ఆసక్తితో చూడగలుగుతున్నారు. ఇక సెన్సారే లేకపోతే మనం న్యూడ్ పిక్చర్సును చూడాల్సి వస్తుంది.

అయితే సాహిత్యానికి లేని సెన్సారు విధానం సినిమాకెందుకూ అని కొందరంటున్నారు. కాని, సాహిత్యం చదివి చెడిపోయే కొద్దిమందికంటే సినిమా చూచి చెడిపోయే అసంఖ్యాక ప్రజానీకం ఎక్కువ.

మంచి సాహిత్యానికి సమాజంలో ఎప్పుడూ విలువుంది. చవుకబారు సాహిత్యం తాత్కాలికమైందే. అందుకు ఉదాహరణ డిటెక్టివ్ సాహిత్యమూ సెక్సు సాహిత్యమూ. వీటి ప్రభావం యువతరం మీద లేకుండా ఎలా పోతుంది?

నేటి సినిమాల్లోకూడా అశ్లీల దృశ్యాలను ప్రారంభంలో చూచినంత ఆసక్తితో ఈనాడు చూడలేకపోతున్నారు. స్తనాలనూ, తొడలనూ చూచి

విసుగెత్తి పోయారు. అలా అని వాటికి స్వేచ్ఛనీయడం మంచిదికాదు. అది యుక్తవయస్కులైన యువతరం మీద అంతులేని దెబ్బతీస్తుంది. అందువల్ల అలాంటి విచ్చలవిడితనం మంచిది కాదు.

యువతరం సమస్యలను ఈనాడు సినిమాలు ఏమాత్రం పరిష్కరించ లేకపోగా తప్పుమార్గాలు పట్టిస్తున్నాయి. వారి భవిష్యత్తుకు ఏ విధంగానూ మార్గం చూపలేకపోతున్నాయి. అయితే కొంతమంది యువకులు సినిమా కళా శిక్షణ కేంద్రాల్లో చేరి ఉత్తీర్ణులవుతూవున్నారు. అటువంటివారికి ఈనాటి నిర్మాతలు, దర్శకులు సాధ్యమైనంతవరకు అవకాశం కల్పిస్తున్నారు. ఇందుకు ఎక్కువ దోహదం చేసింది హిందీ చలనచిత్రరంగం, పూనాఇన్‌స్టిట్యూట్ నుండి వచ్చిన యువకులకు చాలామందికి అవకాశం కల్పించింది. తెలుగు సినిమారంగంలో కూడా కొత్త యువకలకు అవకాశాలనివ్వాలనే చైతన్యం నిర్మాతల్లో కలుగుతూ వుంది.

ఈనాటి యువకులు చాలమంది అభిమాన సంఘాలనూ, స్టార్‌నైట్లనూ ఏర్పాటు చేస్తున్నారు. కళాకారులపట్ల అభిమానం వుండటంలో తప్పులేదు. అభిమానాన్ని పెంచుకోవచ్చు. ఎవరికి అభిమానమున్న వారిని వారు ఆరాధించవచ్చు.

కాని, అవి దురభిమాన సంఘాలుగా వుండకూడదు. ఒకరికొకరు వారి అభిమాననటుల పోస్టర్లమీద పేడ ముద్దలు కొట్టుకోకూడుదు. అలా జరిగి తగాదాలకు, దెబ్బలాటలకు, హత్యలకూ దారితీస్తున్నాయి. ఇటువంటి పరిస్థితిని ఆయా పెద్ద నటులే అరికట్టాలి. అటువంటి సంఘాలకు ఆదరణ ఇవ్వకూడదు. ఇందువల్ల ఈనాటి యువతరం రెండు భాగాలుగా చీలిపోయింది. నిరుద్యోగం, పనిలేనితనం కూడ ఇలాంటి సంఘాల నిర్మాణానికి కారణమౌతుంది.

ఒకనాడు యువకులు దేశభక్తితో జాతీయతత్వంమీద అభిమానంతో వుండేవారు. అందుకోసం నిరంతరం పాటుపడేవారు. ప్రతి విద్యార్థికి ఒక ధ్యేయం అంటూ వుండేది. ఒక పవిత్రమైన ఆశయముండేది. అందుకోసం సాధన వుండేది. నిరంతరం తన కార్యక్రమంకోసం అన్వేషిస్తూ వుండేవాడు. బంగారు భవిష్యత్తుకోసం కలలు కనేవాడు. చిన్నాపెద్దా మంచీ చెడు తారతమ్యాల గౌరవించేవాడు. పెద్దలపట్ల గౌరవభావంతో మెలిగేవాడు. ఈనాడు అటువంటివి చాలవరకు శూన్యమై పోయాయి.

లక్ష్యమే కరువైంది. జీవితాన్ని తేలికగా చూస్తున్నాడు. దేనినీ సీరియస్‌గా తీసుకోవడంలేదు. నిబ్బరంగా నిలబడి దేనినీ చూడలేకపోతున్నాడు.

ఈనాటి యువతరం విదేశీ, సినిమా ప్రభావం వల్ల అనుకరణ తత్వానికి అలవాటుపడిపోయింది. సంప్రదాయ విలువల్ని నెట్టి పారేస్తుంది. దేశీయ నాగరికత మీద కంటే విదేశీ నాగరికత మీద మోజు పెంచుకున్నది. దేశీయ సంగీతం కంటే విదేశీ సంగీతం విని ఆనందిస్తూ వుంది. దేశీయ దుస్తుల మీదికంటే విదేశీ దుస్తులకు ఎక్కువ గౌరవం ఇస్తూ వుంది.

కాలానుగుణ్యంగా కొన్ని మార్పులు వస్తాయి. అలా రావడం సహజం. రావాలికూడా. కాని, అది వెర్రి తలలు వేయకూడదు. మన జాతీయతత్వాన్ని, సాంఘిక మర్యాదల్ని మంటలో కలపకూడదు. ముందు మన సంప్రదాయాలన్నింటినీ గౌరవించాలి.

# చిత్రరంగంలో యువతరం

చలసాని ప్రసాదరావు

చిత్ర కళా రంగంలో యువతరం అనీ, వృద్ధతరం అనీ తేడాలేమీ లేవు. అలాంటివి ఒకవేళ ఏమన్నా వున్నాయనుకున్నా అవి కేవలం ఆయా కళాకారుల మధ్యగల వయస్సంబంధమైనవే గానీ, వారి కళలోమాత్రం దాని ప్రభావం అంతగా కనుపించదు.

ఏ కళా రంగంలోనయినా యువకులూ, వృద్ధులూ కూడా వుంటారు. నిజమే. కానీ యువకళాకారుల్లో మానసిక వృద్ధులూ, వృద్ధ కళాకారుల్లో నిత్యోత్సాహులూ ఎదురవుతూండటం సర్వసాధారణం. ఇందులో ఆశ్చర్యపడవలసిం దేమీ లేదు కూడా.

ఏ సృజనాత్మకకళస్థాయినైనా నిర్ణయించేది దాన్ని సృష్టించిన కళాకారుని సాంకేతిక నైపుణ్యం. కళారంగంలో దాని స్థానాన్ని, విలువను నిర్ధారించేది అందులో వెల్లడయే భావజాలం. ఆ భావజాలం యొక్క ఔచిత్యానౌచిత్యాలకు కారణమయేది ఆ కళాకారుని మానసిక పరిణతి. ఈ మానసిక పరిణతికి వయోభేదం ఆటంకం కాజాలదు.

పెయింటింగ్, కమర్షియల్ ఆర్ట్, శిల్పం, డిజైనింగ్, గ్రాఫిక్స్ - వీటన్నింటి కూడలి స్థానం చిత్రకళారంగం. ఇవన్నీ చిత్రకళలోని అంగాలే. ఉన్న అంతరం అంతా వాటి టెక్నిక్‌లోనూ, ఉపయోగంలోనూ మాత్రమే.

వీటిలో దేని సృష్టికయినా కూడా కళాకారునిలో సృజనాత్మక ప్రతిభ తప్పనిసరి. అయినా పెయింటింగ్స్, శిల్పాలు, గ్రాఫిక్స్‌లను మాత్రమే. కళలుగానూ, వాటిని రూపొందించే వారినే చిత్రకారులు, లేదా కళాకారులుగానూ గుర్తించే ఆచారం ఒకటి పాతుకుపోయి ఉంది. డిజైనింగ్, కమర్షియల్ ఆర్ట్ పూర్తిగా వ్యాపారావసరాలకు వినియోగపడేవి కావటం ఇందుకు కారణం. ఈ విభజన చాలా కృతకమయినది. ఈ కృత్రిమ విలువలను గౌరవించబట్టే అఖిలభారత స్థాయిలో గోల్డ్‌మెడల్స్ పొందిన మన చిత్ర కారుల కన్నా పత్రికలలో కార్టూన్లూ, కథలకు చిత్రాలూ వేసే వారే ప్రజలకు సుపరిచితులై ఉండటం వంటివి జరిగిపోతున్నాయి. పెయింటింగ్‌కు అయినా, కార్టూన్‌కు అయినా అటు కళానైపుణ్యమూ, ఇటు సృజనాత్మక ప్రతిభా తప్పనిసరి అవసరాలే. అలాంటప్పుడు ఈ విచక్షణ అర్థ రహితం.

మన కళారంగంలో యువతరంవారి స్థానం, స్థాయి ఇదీ అని ప్రత్యేకించి విడదీసి నిర్ణయించటం కష్టతరం. నేటి ఆధునికాంధ్ర చిత్రకళారంగంలో ఉత్సాహంగా కృషి చేస్తున్న వారిలో వయసును బట్టి చూస్తే నూటికి ఎనభైమంది దాకా యువతరం వారే. అయితే, ఆ మిగిలిన ఇరవైమంది కళకూ, వీరి కళకూ మధ్య ఎన్నదగిన అంతరం కనుపించనపుడు మనం చేయవలసింది మొత్తం కళారంగాన్నే సమీక్షించుకుని అందులో యువతరం ముందున్న బాధ్యతలను గుర్తించవలసి ఉంటుంది తప్ప వానిని ఇతరులనుండి వేరుచేసి చూసేందుకు ఏమీ లేదు.

ముప్పయ్యేళ్ళ క్రితం మనకు స్వాతంత్ర్యం వచ్చేనాటికి కళలో శిక్షణ నిచ్చే కేంద్రాలు మద్రాసులోని స్కూల్ ఆఫ్ ఆర్ట్, బందరులోని ఆంధ్ర జాతీయ కళాశాల, ఈ రెండే. ఈనాటి వృద్ధతరం అనదగిన ఆనాటి యువతరంలో అధికసంఖ్యాకులు ఈ రెండు చోట్లా శిక్షణ పొందినవారే. మిగిలిన వారు బొంబాయి జె.జె. స్కూల్ ఆఫ్ ఆర్ట్‌లోనో, కలకత్తా శాంతినికేతన్‌లోనో శిక్షణ పొంది వచ్చారు. మరికొందరు హైదరాబాదులో గల కాలేజ్‌ఆఫ్ ఆర్ట్‌లో తర్ఫీదయ్యారు.

ఆనాడు జాతీయోద్యమ ప్రభావం అన్ని కళారంగాలమీదా సహజంగానే వుండేది. అది ఈనాటి కళాకారుల చిత్రాల్లోనూ ప్రతిబింబించేది. కనుక ఆనాటి కళ సహజంగానే ప్రజలనుద్దేశింపబడినదై వారిమధ్యకు వెళ్ళివారి ఆమోదాన్నీ, ప్రశంసనూ పొందగలిగేది.

స్వాతంత్ర్యానంతరం, మారిపోయిన లక్ష్యాలున్న నూతన వాతావరణంలో అందుకు తగిన నూతన ఇతివృత్తాలతో ప్రజలమధ్యకు పోవటంలో ఆనాటి చిత్రకారులు విఫలమయ్యారు. ఫలితంగా కళారంగంలో స్తబ్ధత ఆవరించుకున్నది. ఈ స్తబ్ధతను వదలగొట్టేందుకనే ప్రభుత్వస్థాయిలో అకాడమీలు వెలిశాయి.

ఈ అకాడమీలు కొద్ది మందిలో కొంత చలనాన్ని తేగలిగాయి తప్ప కళారంగంలో రావలసి ఉన్న ఊపుగానీ, సంచలనం గానీ తీసుకురాలేక పోయాయి. మన రాష్ట్రానికి సంబంధించినంతవరకూ లలిత కళా అకాడమీకూడా చేయలేక పోయిన ఘనకార్యాన్ని ఆశించకుండానే, ఏ ఆర్భాటంలేకుండానే సాధించిన ఏకైకవ్యక్తిగా చిత్రకారుడు 'బాపు'ను పేర్కొనవచ్చును. పత్రికాముఖంగా ఆయన పుంఖానుపుంఖంగా తెలుగుదేశంమీదకి వదిలిన కథలకు వేసిన చిత్రాలూ, కార్టూన్లూ సామాన్య

పాఠకులను అలరించటంతోపాటు యువతరంలో సహజంగా ఉండే చిత్రకళాభిమానాన్ని ఒక క్రమంలోకి మళ్ళించి, వారి దృష్టిని కళారంగంవైపుకు, కళాధ్యయనం వైపుకు మళ్ళించాయి. చిత్రకళపట్ల ఆసక్తితోపాటు ఆకర్షణను కూడా పెంపొందించాయి. కొందరు ఏకలవ్యశిష్యులుగా బాపును అనుకరించి ఒక దారికి రాగలిగితే మరి కొందరు ఆ ఉత్సాహంతో శాస్త్రీయశిక్షణకై ఎదురుచూశారు.

ఆ సమయానికి తెలుగుదేశపు రాజధానీ నగరంలో సకలహంగులతోనూ, సమస్త కళా విభాగాలలోనూ శిక్షణ నివ్వగల ప్రభుత్వ లలిత కళల, వాస్తు శాస్త్ర కళాశాల ఉన్నది. రాజమండ్రి, విజయనగరం, విజయవాడలలో కొందరు వ్యక్తులు నడిపే శిక్షణాసంస్థలుకూడా ఉన్నా అక్కడి సదుపాయాలు ఈ కళాశాలలో ఉన్నంత సర్వసమగ్రం కానందునా, ప్రభుత్వ కళాశాలలో శిక్షణ పొందిన వారికి మాత్రమే లభ్యమయ్యే డిప్లొమాలకే ఉద్యోగార్హతలుండటం వలనా సహజంగానే అందరూ హైదరాబాద్ కళాశాలలో విద్యాభ్యాసానికే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చారు. ప్రైవేట్ కళాశాలలు డ్రాయింగ్ టీచర్లను తయారుచేసేవిగానే మిగిలిపోయాయి.

ఇలా కళాభ్యాసం ప్రారంభించిన వారిలో అధిక సంఖ్యాకులు పెయింటింగ్ కోర్సునూ, ఆ తర్వాత కమర్షియల్ ఆర్ట్‌నూ, ఆఖరున మాత్రమే శిల్పశాస్త్రము అభ్యసించేందుకు ఉత్సాహించేవారు. ఇందుకు కారణం 'పెయింటిగ్స్' వేసేవారికే కళారంగంలో గుర్తింపు ఉండటం మొదటిది. అయిదేళ్ళకళాభ్యాసానంతరం జీవనోపాధికి కళ మీదనే ఆధారపడాలంటే అందుకు కమర్షియల్ ఆర్ట్‌లోనే అవకాశా లధికంగా ఉండటం రెండవది. శిల్ప శాస్త్రాధ్యయనంలోనూ, ఆ తర్వాత నిర్మాణ కృషిలోనూ అధికంగా శ్రమ, ఖర్చు అవసరమయినందువల్ల ఆ విభాగంలో ఎక్కువ మంది ఆసక్తి చూపేవారు కారు.

సమాచారంలో 'సరసతను, సౌందర్య పిపాసను పెంపొందింపచేయటమే కళ పరమ ప్రయోజనం' కాదు. కళాకారుడిది ముందుచూపు. అతని ఆలోచనా, అవగాహనా స్థాయీ సామాన్యునికన్నా ఒక మెట్టుపైనే ఉండగలగటమే అతని ప్రత్యేకత. ఈ ప్రత్యేకతలతో తాను గ్రహించిన దానిని తోటివారికి తనకున్న కళానైపుణ్యంతో ప్రతిభావంతంగానూ, వారిని ఆకర్షించి ఆలోచింపచేసేది గానూ వెల్లడించాలని అతను తాపత్రయపడతాడు. ఆ ప్రయత్నంలోనే అతని కళా సృష్టి సమాజం ముందుకు వస్తుంది.

అలా గ్రహించగలిగిందీ, అవగాహన చేసుకోగలిగిందీ ఏదీ లేనివాడూ,

తోటివారికి చెప్పగలిగేందుకు గానూ తన వద్ద 'విషయం' ఏదీ లేనినాడూ కళాకారుడు ఊరుకోకుండా ఏదో ఒకటి చెపుదామని ప్రయత్నిస్తే పుట్టేది అయోమయమే. ఈ అయోమయావస్థ ఈనాటి కళారంగంలో వృద్ధయువ తరాలు రెండింటా సమానంగా ఉంది.

ఈనాటి కళాకారునికి తనచుట్టూ గల సమాజజీవితంలో ఆర్థిక వ్యవస్థలోనూ, సాంఘిక రంగంలోనూకూడా పుష్కలంగా ఇతివృత్తాలు లభ్యం కాగలవు. సరైన అవగాహనతో కళాకారుడు ఆయా అంశాల్నీ, వాటి మూల కారణాల్నీ, పరిష్కార మార్గాల్నీ ముందు తాను అవగాహన చేసుకుని విప్పి చెప్పవలసి ఉన్నాడు. ఆ బాధ్యతను నిర్వహించలేనినాడు వారు కళాకారుల మనిపించుకోవడానికే అనర్హులు. "పవిత్రమైన కళను తాత్కాలిక విషయాలకై వినియోగించటం అపచారం" అని తప్పించుకో జూచేవారు వాగాడంబరులూ రాతియుగపు ఆలోచనా స్రవంతిలో మునకలు వేస్తున్నవారూ మాత్రమే తప్ప బాధ్యత గల సృజనాత్మక కళాకారులు కాజాలరు. వీరందరూ కూడా నెత్తిన పెట్టుకు పూజించే పికాసో చిత్రించిన 'గెర్నికా' ఒక్కటే వారికి తగిన సమాధానం.

సాంఘిక, ఆర్థిక రంగాలలో నెలకొన్న అస్తవ్యస్త పరిస్థితులే యువతరాన్ని కళలపట్ల ఇలాంటి వైఖరి తీసుకునేలా చేస్తున్నాయనేది యదార్థం కాదు. కళ ప్రజోపయోగకరమూ, ప్రయోజనకరమూనై ప్రజాజీవితంలో భాగం కాగలిగినదిగా ఉండగలిగినపుడు ఎలాంటి పరిస్థితులలోనూ అది తన ప్రాముఖ్యతను, ప్రభావాన్ని కోల్పోదు. కళాకారుడు మరే కారణంవలనగానీ తన కుంచెను మూలబెట్టవలసిన అవసరం రాదు. యువతరమే కాదు అందరూ కూడా గుర్తించవలసిన యదార్థ మిది.

తమ చుట్టూ గల సమాజాన్నీ, దాని పరిణామక్రమాన్నీ శాస్త్రీయ దృక్పథంతో అవగాహన చేసుకోలేక పోవటం వల్లనే కళారంగంలో యువతరం మధ్య నిర్వ్యాపారత గోచరిస్తున్నది తప్ప వేరు కాదు. ఈ రంగంలో యువతరమే కాదు, వారికన్నా ఎక్కువగానూ వృద్ధతరం కూడా నూతన ప్రయోగాలనేకం చేస్తూనే వున్నారు. అయితే లక్ష్యశుద్ధిలోపం వల్ల అవన్నీ కేవలం నేల విడిచిన సాముగానే మిగిలిపోతున్నాయి. తాంత్రిక విషయాలను గురించి ఇటీవల కాలంలో విపరీతంగా పెయింటింగులు వ్యాప్తిలోకి రావటం ఇందులో భాగమే.

స్వాతంత్ర్యానికి ముందు పరిమితంగానూ, ఆ తర్వాత బహుళంగానూ మనకు విదేశాలతో, ముఖ్యంగా యూరోపియన్ దేశాలతో సాంస్కృతిక

సంబంధాలు పెరిగాయి. ఆ దేశాలు పారిశ్రామికంగా బాగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ వ్యవస్థగలవి. అక్కడి కళాకారులకు ఈ ధనిక పారిశ్రామిక వర్గానికి చెందినవారే మహారాజ పోషకులు. వారిది ధనికసంస్కృతి. ఆ సంస్కృతిలో యదార్థ జీవన సత్యాలకు చోటు లేదు. కృత్రిమ విలువలకే ప్రాధాన్యమూ, గౌరవమూ, రాజపీఠమూనూ. సహజంగానే ఆయా కళాపోషకుల కళాభిరుచులు కూడా కృతకమైనవి. అందుకనుగుణంగా వారికి నచ్చిన, వారు మెచ్చిన కళాఖండాలే అనవసరంగా అనన్యప్రచారంలోకి వస్తుంటాయి. ఈ ప్రచారం కూడా యాదృచ్ఛికం ఏమీ కాదు. నిజమైన కళ, నిజమైన సాంఘిక విలువలు త్రొక్కి పెట్టబడిన నాడే ఆ వ్యాపార వర్గం ప్రయోజనాలు నెరవేరేది. ఫలితంగా నిజాయితీపరుల కళ గాక కొద్దిమంది 'ప్రముఖ, ప్రఖ్యాత' కళాకారులూ, వారి ఇజాలూ, వారి 'కళాఖండాలూ' విస్తృత ప్రచారంలోకి రాగలిగాయి. ఇది ఎంత వెర్రితలలు వేసేదాకా ముదిరిందంటే ఈనాడు ఆ బాపతు 'ప్రముఖ' చిత్రకారుల పెయింటింగులలో ఏమున్నదనే దాన్నిబట్టి విలువ నిర్ణయింపబడటం లేదు. ఆ పెయింటింగ్ వేయబడిన కాన్వాస్ సైజునుబట్టి చదరపు అంగుళాల లెక్కన ధరకట్టటం జరుగుతోంది.

ఇలాంటి కృత్రిమకళాభిరుచిప్రాచుర్యంలో ఉండబట్టే మ్యూజియం లలో పెద్ద సైజు చోరీలు సర్వసాధారణమై పోయాయి. చివరకి ఆశియా, ఆఫ్రికా దేశాలలోని ప్రాచీన కాలపు కళావశేషాల్ని కూడా పెద్ద ఎత్తున దొంగిలించుకుపోయి యూరప్ దేశాలలో విపరీతమైన ధరలకు అమ్మటం ఓ బిజినెస్ అయిపోయింది. తమిళనాడునుండి ఈ విధంగా దొంగిలించుకు పోయిన నటరాజ విగ్రహాన్ని అమెరికాలోని ఓ పెద్ద కళాభిమాని 75 లక్షల రూపాయలకు కొన్న ఉదంతం ఈ సందర్భంలో గుర్తు చేసుకోవచ్చును.

ధనికవర్గపు కృతకకళాభిరుచికి ఇంతకుమించిన ఉదాహరణ వేరే అనవసరం. దొంగిలించుకు రాబడిన 'కళాఖండాన్ని' కొనుక్కొని సంతోషించగల వారి కళాహృదయాన్ని ఎవరైనా ఆనందించగలరా!

ఈ కృతక విలువల, మర్యాదల మధ్య పూచి పుష్పించి అనన్య ప్రచారంలోకి వచ్చిన పాశ్చాత్య కళ సహజంగానే మార్గదర్శనం తోచని స్థితిలో కొట్టుమిట్టాడుతూన్న మన కళాకారులను ఆకర్షించింది. పాశ్చాత్య దేశాలతో పెరిగి సాంస్కృతిక సంబంధాల ఫలితంగా మన ఎరుకలోకి వచ్చిన ఆయా దేశాల సమకాలీన కళలో అధికశాతం ఈ కోవకు చెందినదే కావటాన సహజంగా మన యువతరంకళాకారులపై దాని ప్రభావం పడింది. వాటికి దొరికిన ప్రచారార్భాటం వీరిని సమ్మోహితుల్ని చేయటం ఇందుకు ప్రధాన కారణం.

అకాడమీలూ, అవి నిర్వహించే కళా ప్రదర్శనలు, వాటి విలువలను, నిర్ధారించే పాలకవర్గానికి ఇష్టులైన 'గొప్ప' కళాకారులు లేదా కళా విమర్శకులు కూడా ఈ ధోరణులను ప్రోత్సహించేందుకే తోడ్పడ్డారు. ప్రజలకు దూరమై పోయిన ఈనాటి కళాకారులకు పోషకులు ఈ అకాడమీలే. బొంబాయి, కలకత్తా, ఢిల్లీ వంటి మహానగరాల్లోమాత్రం పారిశ్రామికధనికవర్గం వీరిని కొంతవరకూ ఆదరిస్తోంది. కనుక మన యువకళాకారులుకూడా అందుకు తగ్గట్టు తమను 'కొనగల' అకాడమీల, మ్యూజియంల, ధనిక కళాభిమానుల అభిరుచుల పరిధుల్లోనే తమ చిత్రాలనూ యాంత్రికంగా రూపొందించే స్తున్నారు. స్వేచ్ఛ, కళావిలువలు, కళా స్వాతంత్ర్యంలాంటి పడికట్టు పదాల్ని సదా వల్లించే వీరు ఈ విధంగా తమకు తెలీకుండానే వాటన్నింటినీ అవగాహనలో కూడా ఉంచుకోకపోవటం వారి మేధావిత్వాన్నే శంకింప చేస్తున్నది.

కనుకనే ఈనాటి మన చిత్రకళారంగంలోని యువతరమైనా, వృద్ధతరమైనా వారి కళా సృష్టిలో మాత్రం చెప్పుకోదగిన అంతరంగానీ, వైవిధ్యం గానీ, భావసంఘర్షణగానీ కనుపించదు. వారందరూ కలసికట్టుగా, ఏకోన్ముఖంగా, లక్ష్య రహితంగానే సాగిపోతున్నారు. ఈ రెండు తరాల మధ్య ఎప్పుడైనా ఏదైనా సంఘర్షణ వచ్చిందంటే దానికి మూలం తమ తమ పెయింటింగులను అమ్ముకోవటానికి గల కొద్దిపాటి మార్కెట్టును పంచుకోవటంలో వచ్చే తగాదాలు మాత్రమే.

ఈ కారణంవలననే ఈతరంకళాకారులలో కళను వ్యాపారసరళిలో మాత్రమే చూడగలవారుంటున్నారు తప్ప స్వచ్ఛందప్రవృత్తి మృగ్యమనే విమర్శ ఒకటి వినవస్తుంటుంది. అయితే, ఇది కేవలం ఒక్క యువతరానికే పరిమితంకాదు. ఒకప్పుడు చిత్తశుద్ధితో, లక్ష్యశుద్ధితో కళాసృష్టి చేసిన వృద్ధతరం వారీనాడు చేస్తున్న ఘనకార్యం కూడా అదే. అయితే వారు ఈ వరకే లబ్ధ ప్రతిష్ఠులై పోయి ఉన్నారు గనుక వారిపని సులభం. నిలద్రొక్కుకునే ప్రయత్నంలో ఘర్షణ పడుతూన్న యువతరం పని కష్టతరం. అంతే తేడా.

ఈ లోపాలకు అతీతంగా నిలిచే నిజాయితీపరులైన కళాకారులు అటు వృద్ధతరంలోనూ, ఇటు యువతరంలోనూ కూడా లేకపోలేదు. కానీ, వీరందరి మధ్య సంఘీభావం, పరస్పరావగాహనలకు దోహదం చేసే వారి కళాసృష్టిని ప్రజలమధ్యకు తీసుకుపోగల పటిష్ఠమైన ప్రయత్నాలే లేవు.

మన కళాకారుల్లో నూటికి ఎనభైమంది దాకా యువతరానికి చెందిన వారేనని ముందు చెప్పుకున్నాం. వారిలో **లిటకేషన్ కళావ్యాపారంలో**

ప్రవీణులైన బహుకొద్దిమంది మినహా మిగిలినవారంతా వాస్తవంలో అమాయకులే తమ కళపట్ల గౌరవం, జిజ్ఞాస, తపస్సు ఉన్నవారే. ఏ కళాకారుడూ కూడా తన నైపుణ్యాన్ని, కాలాన్ని, శక్తిని ఎవరికీ అక్కర్లేని 'కళాఖండాల' సృష్టికై వ్యయం చేసేందుకు సహజంగానే ఇష్టపడడు. అయినా ఇలా జరిగిపోతూన్నదంటే అతను తనకు తెలియకుండానే సమిష్టి నుండి వ్యక్తి దృక్పథంలోకి నెట్టివేయబడి ఆచీకటిగూడులో తడుములాడుతూండటమే.

సాంఘిక దృక్పథం విషయానికి వస్తే మన కళాకారులందరూ ఒకరకంగా నిరక్షరాస్యులేననక తప్పదు. దీని ప్రభావాన్ని తేలికగా తీసివేయలేం. కృతక విలువలను ఆకర్షణీయంగా చూసే యురోపియన్ కళాప్రభావం, వాటినే వెనకేసుకువచ్చే మన కళాపోషకుల ధోరణివలన ప్రమాదాన్ని తక్కువగా అంచనా వేయటానికి వీల్లేదు. వీటన్నింటి ఫలితంగానే మన కళాకారులు తమ కళ ఎందుకు? ఎవరికోసం? ఏ ప్రయోజనార్థం? అనే ప్రశ్నల్నే మరచిపోయారు. ఆ విధంగా సామాజిక పరివర్తన కృషిలో తమ కళ శక్తిమంతమైన సాధనం అనీ, ఆ వినియోగంలోనే దాని సార్థకత ఇమిడి ఉందనీ గుర్తించి అం[illegible] దోహదం చేయలేకపోతున్నారు.

ఓ సెమినార్‌లో ఓ కేంద్రమంత్రిగారు కళాకారులు 'కమిటెడ్'గా ఉండాలని ఓ ప్రతిపాదన చేయగా అందులో ఆయన ఉద్దేశం ఏమిటనే దానితో ప్రమేయం లేకుండానే కళాకారులంతా అదేదో కంపు పదార్థమన్నట్లుగా ఆ ప్రతిపాదనను వ్యతిరేకించారు. ఆ విధంగా తామేదో స్వచ్ఛంద కళాకారులం, స్వేచ్ఛా లోచనాపరులం, సృజనాత్మక కళాజీవులం అన్నట్లుగా ప్రపంచానికి చాట జూశారు. కానీ, వాస్తవంలో వారు ఏ ఇజానికీ, అవసరానికీ కాకున్నా కనీసం తమ కళకు కూడా కమిటెడ్‌గా ఉండటం లేదు.

ఆ మర్నాడు సదరు మంత్రిగారి చుట్టూ ప్రైవేటుగా ఈ కళాకారులంతా మూగి పార్లమెంటుభవనంలో కుడ్యచిత్రాలను వేయించే ప్రతిపాదనను ఆధారం చేసుకొని ఎవరికి వారే తమకు కాస్త ప్రిఫరెన్స్ ఇవ్వాలని ప్రాధేయ పడటంలోనే ఆ కమిట్‌మెంట్ ఏమిటో తేలిపోయింది.

దేశఆర్థికవ్యవస్థే యూరప్‌దేశాలతో ముడిపడిఉన్న ఈనాటి పరిస్థితుల్లో అక్కడి సంస్కృతిప్రభావం ఇక్కడిదాకా ప్రసరించడంలో, ప్రభావితం చేయటంలో ఆశ్చర్యంలేదు. అయితే ఆయాదేశాల కళాకారులు తమ రంగంలో అవధుల్ని ఏనాడో అధిగమించేరు. సాంస్కృతిక పునరుజ్జీవన కాలంనాడే ఆరంభమై పెట్టుబడిదారీయుగపు అత్యున్నత దశలోకి ప్రవేశించిన ఈనాటి

వరకూ అక్కడి కళారంగంలో ఎన్నెన్నో ఉద్యమాలు, తుఫాన్లు వచ్చి ఉన్నాయి. ఆయా దశల్లో అక్కడి కళాకారుల సృష్టి ప్రమాణాల్లో అత్యున్నత స్థాయిని అందుకోగలిగింది. ఈనా డది ధనిక స్వామ్యపు కృతక విలువల మధ్య దారీ-తెన్నూ తోచని విపరీతస్థితితో వెర్రితలలు వేస్తున్నది.

కానీ, మన పరిస్థితి అలా లేదు. మనం ఇంకా పూర్తిగా పారిశ్రామిక యుగంలో స్థిరపడిపోయామనేందుకే అవకాశంలేదు. అయినా కళారంగంలో మాత్రం ఒక పెద్ద అంగవేసి అక్కడి వారిని అందుకో యత్నిస్తున్నాం. అందుకునేందుకు అక్కడ ఏమీ లేదు గనుక చతికిలబడలేక త్రిశంకు స్వర్గంలో వ్రేలాడుతున్నాం.

ఈ ఆరోపణకు ఎవరు గానీ బాధపడనవసరంలేదు. ఈ మధ్యే అమెరికాలో తొలిపర్యాయంగా భారతీయ చిత్రకారుల ఎన్నిక చేసిన 'అత్యుత్తమ శ్రేణి చిత్రాల' ప్రదర్శన జరిగింది. ఆప్రదర్శనను బహుళ ప్రచారంగల 'సండేస్టార్ అండ్ డెయిలీ న్యూస్' పత్రికలో సమీక్షిస్తూ బెంజిమన్ పోర్జీ అనే ప్రముఖ కళావిమర్శకుడు ఇలా వ్రాశాడు.

'ఈ 'సమకాలీన భారతీయ చిత్రకళ' ప్రదర్శనలో ఎన్నదగిన గొప్ప చిత్రాలుగానీ, కనీసం ద్వితీయ ప్రపంచయుద్ధానంతరం యూరప్‌లో సాధించబడిన ఆధునిక చిత్ర కళా విలువలతో సరితూగగల చిత్రాలుగానీ లేవు. వాస్తవంలో యూరప్ దేశాలలో రూపొంది ఉన్నత ప్రమాణా లందుకున్న కొన్ని రకాల కళాఖండాలకు చవకబారు నకళ్ళవంటి చిత్రాలు మాత్రం కొన్ని ఈ ప్రదర్శనలో ఉన్నాయి."

ఈలాంటి విమర్శలు చూసుకొని మన యువకళాకారులు గుండెలు బాదుకుని ఏం ప్రయోజనం? తెలిసి కొంతా, తెలియక కొంతా మన యావత్ కళారంగమే ఒక ఊబిలో దిగి నిద్రబోతున్నది. ఆ విషయం ఎత్తి చూపినందుకు అభినందించాలి తప్ప బాధపడనవసరంలేదు. అందులోంచి బయటపడే ప్రయత్నం చేయటం ఆరోగ్యప్రదం.

అయితే యూరప్‌లోనే ఒక భాగమైన సోషలిస్టు - కమ్యూనిస్టు దేశాల్లో కళలన్నీ సాంఘిక ప్రయోజన లక్ష్యంతోనే ఉంటున్నాయి కదా! మరి వాటి ప్రభావం మన కళాకారులపై ఎందుకు పడటంలేదనే ప్రశ్న వస్తుంది.

సోషలిస్టు దేశాలతో మనకున్న సంబంధాలు సోషలిస్టేతర యూరప్ తో పోలిస్తే తక్కువే. పైగా పెద్ద ఎత్తున జరిగిన దుష్ప్రచార ఫలితంగా సోషలిజమన్నా, కమ్యూనిజమన్నా జడుసుకునే మేధావుల సంఖ్య మన దేశంలో

ఎక్కువ. కనుక సోషలిస్టు దేశాల్లో కళాకారులకు స్వేచ్ఛలేదు, వారు కేవలం ప్రభుత్వ బానిసలు మాత్రమే లాంటి భావాల్ని చక్కగా ప్రచారం చేసి ఉంచారు. ఫలితంగా చిత్ర కళారంగానికి సంబంధించినంతవరకూ మన కళాకారులకు సోషలిస్టు దేశాల కళ అనేది వెలివేయదగినదై పోయింది.

కానీ, వాతావరణం మారుతోంది. నేడు కాకుంటే రేపైనా మన కళాకారులు కూడా మారకతప్పదు. ప్రచారార్భాటాలతో ప్రముఖమైన పెట్టుబడిదారీ దేశాల 'కళాఖండాల' ప్రభావంనుండి బయటపడక తప్పదు.

ఈ పరిస్థితులు తప్పని సరిగా మారి తీరుతాయి. మార్గదర్శనం చేసేవారే చివరికి మిగులుతారు. ఇది జరగాలంటే మన కళాకారుల ఆలోచనా రీతిలోనే పెద్ద మార్పు, మలుపు రావలసి ఉంది. అదికూడా పెనుతుఫానులా వచ్చి ప్రస్తుత కళారంగంలోని కృత్రిమ విలువల్ని ఊడ్చివేయవలసి ఉంది. అది కళాకారునికి తన కళ ఎందుకో, ఎవరికోసమో, ఏ లక్ష్యసిద్ధికో తెలియజెప్పేదిగా ఉండాలి. తన కళకు ఇతివృత్తంకోసం ఎక్కడో గాక తనచుట్టూ గల భౌతిక ప్రపంచంలోనే వెదుక్కునేటట్లు చేయగలగాలి. సమాజం పట్ల అతనికి శాస్త్రీయ దృక్పథం అలవడగలిగేట్లు చేయగలగాలి.

ఆనాడు మన కళ సార్థకమవుతుంది. కళాకారుల సృష్టి ప్రజలమధ్యకు చొచ్చుకుపోయి సమాజ జీవితంలో అదీ ఒక భాగమవుతుంది. ఒక చారిత్రక కర్తవ్యన్ని నెరవేర్చ గలిగినదవుతుంది.

ఈ బాధ్యత యువతరానిదే. తన కళకు గల శక్తిని, దానిని సద్వినియోగ పరచటంలో తనకు గల బాధ్యతను గుర్తించవలసి ఉన్న యువతరానిదే.

ఈ పని జరగనంత వరకూ మన యువకార్టూనిస్టులూ, పత్రికలలో కథలకు బొమ్మలు గీస్తున్న చిత్రకారులూ వీరే ప్రజలదృష్టిలో అసలైన కళాకారులు.

# యువతరం నాటకరంగం

గొల్లపూడి మారుతీరావు

'యువతరంయొక్కనాటకరంగం' అంటూ ప్రత్యేకించి చెప్పక్కరలేదు. ఎందుకంటే నాటకాన్ని చూడటానికి నాటకశాలకు వచ్చే ప్రేక్షకుని శారీరకమయిన వయస్సు ఏదయినా మానసికంగా అతను యువకుడయిపోతాడు. నాటకం చూస్తూ వున్నంత సేపూ ఒక యువకునిలాగే రససిద్ధిని పొందుతాడు. అందుకని నాటకశాలలోని ప్రేక్షకుల గురించి చెప్పేటప్పుడు స్థూలంగా యువతరాన్ని గురించి చెప్పున్నట్టే లెక్క. ఇందుకు Samuel Seldon వాక్యాలను ఉటంకిస్తాను.

"The attitude of a typical audience is young. The play-goer what ever maybe his biological age, is, during the period he is watching a theatrical performance, fundementally a youthful person.

అయితే యువతరం జీవిస్తున్న సమాజం, కాలమాన పరిస్థితులు, నమ్మకాలు - యివన్నీ వారి దృష్టినీ, వారి దృష్ట్యా నాటకరంగాన్ని ప్రభావితం చేస్తాయి.

తెలుగు నాటకరంగంలో ఈ శతాబ్దపు తొలి రోజుల్లో వెలువడిన సంగీత, పద్య, పౌరాణిక నాటకాలు దాదాపు అన్నీ పురాణ చారిత్రక ఇతివృత్తాలతో వచ్చినవే. ఇతివృత్తాల ప్రాచుర్యం కారణంగా సంగీత పద్య రచనలలో ఉన్న ఆకర్షణ శక్తి కారణంగా అవి ప్రజలను రంజింపజేస్తూ వచ్చాయి. క్రమంగా నటులలో పద్యాలుచదవడంలోగల గాత్రమాధుర్యం మిగిలిన నటనాసామర్థ్యం వెనకబడింది. ఈ శతాబ్దపు తొలిరోజుల్లో ప్రాచుర్యంలోకి వచ్చిన లేదా మొన్నమొన్నటివరకు ప్రచారాన్ని సాధించిన వారందరూ తమగాత్ర మాధుర్యంతో ప్రేక్షకులను ఆకట్టుకున్నవారే. అప్పటి నాటకాలలో విజయానికి నాటకీయత, సామాజిక సమస్యల విశ్లేషణ - ఇలాంటివేవీ కారణంకాదు.

ఈ దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక, అంతకు ముందు - అనగా రెండవ ప్రపంచపు యుద్ధపు తొలిరోజుల్లో నాటక రచయిత, సామాజికులు వ్యక్తి సమస్యలను గురించి ఆలోచించడం ప్రారంభించారు. అవి కొత్త సమస్యలు.

సమాజంలోని ప్రతి వ్యక్తినీ వెంటనే ఆలోచించేటట్లు చేసేవి. ఆధునిక నాటక రంగం ఎంత ప్రగతిని సాధించిందో తర్వాత చూద్దాం. కాని సామాజిక దృక్పథంలో మార్పు దృష్ట్యా, సంగీత పౌరాణిక నాటకాల స్థాయి టెక్నిక్‌లో, ప్రదర్శనలో పడిపోయిన కారణంగా నేటి యువతరాన్ని అవి ఆకర్షించలేక పోతున్నాయి.

అయితే, ఆధునిక నాటకరంగం తనకు కావలసిన రచనలని సిద్ధం చేసుకోవలసి వచ్చినట్లే తన నటుల్నీ, ప్రేక్షకుల్నీ ఎన్నిక చేసుకోవలసి వచ్చింది. మరొక ముఖ్యమైన అంశం ఆనాటి రచనలు ప్రజాజీవితంలో చిరస్థాయిగా చోటుచేసుకున్న ఆధ్యాత్మిక పౌరాణికేతివృత్తాలతో కూడినవి. ఈనాటి సమాజంలో అనుక్షణం సమస్యలు మారుతున్నాయి. సమకాలీన సమాజంలోని సమస్యను ఎత్తిచూపే ఈనాటి గొప్ప రచన రేపు అంతే బలంగా అప్పీల్ చేయలేకపోవచ్చు. అంటే ఈనాటి రచనల్లో వేగంగా మారుతున్న సమాజ స్థితి దృష్ట్యా నాటకరచయితలు ఎన్నిక చేసుకుంటున్న టాపికల్ ప్రాబ్లమ్స్ దృష్ట్యా చిరకాలం రంజింపచేసే అవకాశం లేకపోతోంది. అందువల్ల ఇదివరకు లాగా ఆధునిక నాటకరంగంలో బలమైన రిపర్టరీ థియేటర్ ఏర్పడలేక పోయింది. ఎప్పుడైతే 'పోషణ' లోపించిందో నాటక సమాజాలలో శ్రద్ధ కూడా ఆ మేరకు లోపిస్తోంది. నాటకరంగంమీదా నటనమీదా రచనమీదా అభిమానం, ఆర్తి వున్న ఔత్సాహిక సమాజాలలోనే ఆధునిక నాటకరంగం ఊపిరి నిలుపుకుంటూ వుంది.

ఈ యువతరం ప్రదర్శిస్తున్న నాటకాలలో ప్రామాణికమైన నటనా సామర్థ్యం కనిపిస్తున్నదా అన్నది ప్రశ్న. అయితే నటనకు ఏది ప్రమాణం? అది అనుక్షణం కొత్తరూపులు దిద్దుకొనే కళ. అయితే నేటి యువతరంలో యిది వరకెన్నడూ లేని నటనాసామర్థ్యం వున్నదని మాత్రం చెప్పక తప్పదు.

నాటకం అనగానే వాస్తవిక రచన అని ఇప్పటి నటులలో ఒక ఉద్దేశ్యం ఎందుకనో నిలద్రొక్కుకున్నది. Costume plays, Symbolic plays, Mask acting, Fantacies - యివేవీ నేటి నాటకరంగంలో అంతగా కనిపించవు. అందుకనే తప్పని సరిగా నేటి నటులు స్వాత్వికాభినయంపైనే ఎక్కువ ఆధారపడుతున్నారు.

యువతరం ప్రదర్శిస్తున్న నాటకాల పట్ల నిన్నటి తరం వారికి అంతగా ఆదరాభిమానాలు లేనిమాట నిజం. దీనికి కారణం Generation Gap. కొన్ని

దశాబ్దాలుగా తాము నమ్మిన, తమని రంజింపచేసిన నాటకరంగాన్ని కాదని ఆధునిక రంగాన్ని - ఇంకా నిలదొక్కుకోని రంగాన్ని -వారు నమ్మడం లేదు. అందుకు వారిని నిందించి ప్రయోజనం లేదు. మనదేశపు నాటకరంగానికీ ఇతరదేశాల నాటకరంగాలకీ ఒక ముఖ్యమైన తేడా వుంది. Our theatre is not a consequence of our treaditional theatre. పాత కొత్తలమధ్య 'వార' వుంది. నేటి తరంవారుకూడా అంతగా ఆసక్తిని కనపరచడం లేదు - ఎందుకు? ఇక్కడ సమాధానం చెప్పడానికి వ్యవధి చాలదు.

మహారాష్ట్ర, వంగదేశాలలో నాటకరంగాలలో వలె ఈతరం వారు తెలుగుదేశంలో ఉన్నత ప్రమాణాలను అందుకోలేక పోతున్నారు. కారణం - ఈనాటి నాటకరంగంమీద ప్రేక్షకులకు సానుభూతిని నమ్మకాన్ని ఆకర్షణని తగినంతగా సృష్టించుకోలేకపోవడమే.

సంపన్నదేశాలలో నాటకప్రయోగాలను పరిశీలించే అవకాశాలు ఈనాడు మనకు ఎక్కువగా ఉన్నాయి. విదేశీపాలన మనకు చేసిన కీళ్ళతో పాటు ఇచ్చిపోయిన మేలు యిది. కాని మన రచయితలు, నటులు చాలా మటుకు ఔత్సాహికులు. ఎక్కువ భాగం ఆంగ్లభాషా ప్రాపకం లేనివాళ్ళు. సామాజిక సమస్యలను విశ్లేషించే అద్భుతమైన పాశ్చాత్యధోరణులైనా ఆకట్టుకోగలిగితే నాటకరంగంలో కొంత నవ్యత రాగలదని నా ఉద్దేశ్యం. ఐతే చదివిన ఒకటి రెండు రచనలకూ అసందర్భమైన అనువాదాలు వస్తున్నాయి. అందువల్ల తెలుగు నాటకరంగంలో అపశ్రుతీ, ఆంగ్ల నాటకరంగానికి అపఖ్యాతీ మిగులుతుంది.

ఇప్పటి తరాన్ని సతమతం చేస్తున్న సమస్యలను వస్తువులుగా తీసుకొని ఎంతమంది ప్రయోగాలు చేస్తున్నారు? రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు రాసిన 'విషాదం'లాంటి ఏ ఒకటి రెండు రచనలో మినహాయిస్తే చాలామంది నేల విడిచి సాము చేస్తున్నారు. నాటకరంగానికి రావాలసిన ప్రాచుర్యం రాకపోవడానికి అదికూడా ఒక కారణం.

నేడు యువతరం సామాజికులను ఆకట్టుకోలేకపోవడం - నేడే కాదు ఏనాడయినా అది నాటకరంగంలోపమే. సామాజికుల లోపం కాదు. మంచి సరకు అమ్మకానికి పెట్టిందే కొనుగోలుదారుడు రాలేదని బాధపడడం అన్యాయం. నేటి లోపానికి ముఖ్యకారణాలు - నాటకరచయిత, నాటక సంస్థలు, మంచి పోషకులు (సంస్థలుగాని, వ్యక్తులుగాని), నాటకశాలలు - ఆ

వరుసలో వస్తాయి.

**మంచి పోషణను** ఇవ్వగలిగిన సంస్థలు సామాజికులను ఆకర్షించగలిగే బలమైన **ఇతివృత్తాలతో** నాటకాలను ఒక అలవాటుగా సామాజికులకు అందచేయగలగాలి. ఇదే ధోరణిలో వంగదేశపు నాటకరంగం ప్రాముఖ్యాన్ని పొందింది. Theatre going is a habbit. Theatre goer sits in the auditorium investing confidence on the play. అతని విశ్వాసాన్ని నెమ్మదిగా సాధించగలగాలి. ఇవ్వాళ సామాజికులకు కావలసిన వేవో మొదట ఎక్కువ పాళ్ళలో ఇచ్చి అంటే సినిమానటులతో నాటక ప్రదర్శనలు, ముఖ్య అతిథులను ఆహ్వానించడం ప్రచారంలో వున్న రచనల్ని ఎన్నుకోవడం ఇలాగ ప్రారంభించి ఆప్రదర్శనలకు వచ్చిన ప్రేక్షకులలో సంస్థమీదా, సంస్థలో వున్న ఇతర నటులమీదా విశ్వాసాన్ని పెంపొందింపచేసుకోవాలి. అప్పుడు పదవ ప్రదర్శనైనా ప్రచారం సాధించకుండా పోదు. దీనికి కార్యదీక్షా చిత్తశుద్ధి కావాలి. సంస్థలో చిత్తశుద్ధిలోపం వుంటే ప్రేక్షకులు సులువుగా పసిగట్టేస్తారు. అప్పుడిక ఆ సంస్థ ఏం చేసినా లాభంలేదు.

సినిమాలు నాటకరంగానికి ఎన్నటికీ ఆటంకం కానే కావు. ఏవిధంగా చూసినా నటులకు ప్రేక్షకులకు communion ఏర్పరచడంలో నాటకమే అగ్రతాంబూలం తీసుకుంటుంది. దీనికి సాక్ష్యం విదేశ నాటకరంగమే. బలహీనంగా ~~ఈడిగిలబడుతున్న~~ మన నాటకరంగాన్ని సినిమా dominate చేస్తోందని బాధపడడంలో అర్థంలేదు.

నేటి యువతరంలో కనిపిస్తున్న ఉత్సాహం, కార్యదీక్షా, చిత్తశుద్ధీ ఇదివరకెన్నడూ లేనివి, కనిపించనివి. అయితే ఈ ఉత్సాహం, కార్యదీక్షా ఒక గమ్యంలేకుండా అనవసరమైన కార్యసాధనలకు మళ్ళిపోతూంది. తాము ఎదుర్కుంటున్న కొత్త సమస్యలకు అద్దంపట్టే రచనలను చేపట్టి తమ శక్తులను సమీకరించి ఒక తపస్సులాగా కృషిచేస్తే నేటి నాటకరంగం పరిపుష్టం కాగలదనడంలో సందేహంలేదు. అయితే ఈ పని ఎక్కడ ఎవరు ప్రారంభించాలి? ఎవరు చేస్తారు?

మరొక్క విషయం – నేటి నాటకరంగంలో వాస్తవికత పేరిట మరీ చచ్చు ప్రయోగాలు అనవసరమైనవి అక్కరలేనివీ జరిగిపోతున్నాయి. మనం చూసే చిరికిపాతలు, మాసిన గుడ్డలు, ఆఫీసు ఫైళ్ళు, మానభంగాలు – వీటిని యథాతథంగా చూపడం మాత్రమే వాస్తవికత కాదు. అది చూపడానికి నాటకం

అక్కరలేదు. నాటకం కళ. దానిలో సామాజికుడు చూడని కోణాన్ని రచయిత తన దృష్టితో చూపాలి.

Lonesco మాటల్లో What is interesting in a man is not to know 'what' he thinks, but discover 'why' he thinks what he thinks.

ప్రఖ్యాత అమెరికన్ నాటకకర్తను ఒక ఇంటర్వ్యూలో వాస్తవికత పేరిట మీరు నాటకాల్లో కవిత్వం చెప్తారెందుకని ఎవరో అడిగారట. ఆయన చెప్పిన సమాధానం ఇది -

Realism is why people do it, not merely the account of what happens. A play is an interpretation, not a report. And that is the beginning of its poetry because, in order to interpret, you have to convince, you have to distort towards a symbolic construction of what happened, and as the distortion takes place you begin to leave art and over- emphasise and consequently deliver up life as a unity rather than as a chaos, and any such attempt, the more intense it is more poetic it becomes.

# యువత – పత్రికాప్రపంచం

ఇంద్రగంటి శ్రీకాంతశర్మ

రాజకీయాలు, సినిమా, సెక్సు అనేవి ఈనాడు యువతరాన్ని తీవ్రంగా ప్రభావితం చేస్తున్న రంగాలు. సాహిత్య ప్రభావంకూడా వున్నా, అది రాజకీయ భావవాహినికి అంతర్వాహినిగా మాత్రమే ప్రస్తుతం పరిగణించవలసివుంది.

పత్రికాప్రపంచంతో సంబంధాలదృష్టిలో మొట్టమొదటగా యువతరాన్ని రెండు శాఖలుగా విభజించాలి. తమ తమ వృత్తులను, వ్యాపకాలను ప్రధానంగా చూసుకొంటూ అప్పుడప్పుడు, తీరిక దొరికినప్పుడు పత్రికలు చదివేవారు, కేవలం కాలక్షేపంకోసం పత్రికలు చదివేవారు, – వీరొక శాఖ క్రిందకు వస్తారు. ఒకమాటలో చెప్పాలంటే, పత్రికల సర్క్యులేషన్‌కు సంబంధించి వీరే ప్రధాన పోషకులు.

రెండోశాఖ యువతరం రచయితలు. వీరు మంచికో, చెడ్డకో, పత్రికలకు రచనలు పంపడం, అవి ప్రచురణావకాశాన్ని పొంది పదిమందీ చదివినప్పుడు సంతోషించడం పరిపాటి – నిజానికి పత్రికలు వేసే రచనలతో ప్రత్యక్షంగా సంబంధం ఉండే యువతరం ఇదే.

ఈరెండుశాఖలకు సంబంధించిన యువతరంలో జ్ఞానులు, సెమీజ్ఞానులు, అజ్ఞానులు, జ్ఞానసముపార్జనకోసం ప్రయత్నించే విద్యార్థులుకూడా ఇమిడి ఉన్నారు.

ఆంధ్రదేశంలో దిన పత్రికలు, వార, మాస పత్రికలు, చిరుచిరుస్థానిక పత్రికలు కలుపుకుంటే సుమారు ఏభైకిపైగా వున్నాయి. వీటిలో (ఆరు) దినపత్రికలను తీసివేస్తే మిగిలినవన్నీ సాహిత్యం, సినిమా, రాజకీయాలు, సెక్సు, అపరాధ పరిశోధనలు, బాలల విషయాలు, నియమం తప్పకుండా వెలువరించి, పాఠకులకు ఆనందాన్నో, ఆందోళననో, విసుగునో విధిగా కలిగిస్తున్నాయి.

ప్రస్తుతదశలో వార, మాసపత్రికల భవితవ్యం మూడువంతులు యువతరంచేతుల్లో వుంది.– –ఈతరానికి చెందిన గృహిణులు, కాలేజీ అమ్మాయిలు, ఉద్యోగినులు, విశేషించి వార, మాస పత్రికలలో కథలనూ, సీరియల్స్‌నూ చదివి, పోషిస్తున్నారు. వీరిలో రచనావ్యాసంగానికి

ఉపక్రమించేవారు కూడా ఎక్కువే.

యువతరంలో ఇతరవర్గాలవారు - సినిమా- అపరాధపరిశోధక పత్రికలు, సెక్సు పత్రికలు విశేష ప్రచారం పొందడానికి ఎక్కువమంది దోహదం చేస్తున్నారు.

ఈదృష్ట్యా ఇప్పటి వార, మాస పత్రికలు కథలకు, సీరియల్స్‌కు మాత్రమే ఎక్కువ అవకాశాలను కల్పిస్తున్నాయి. ప్రచురిస్తున్నాయి. వీటికితోడు కార్టూనులు, జోకులూకూడా ఎక్కువ శ్రమపడనవసరంలేని కాలక్షేపం సమకూరుస్తున్నాయి. ఏ తరహాకథలు ప్రచురించే పత్రికలకైనా, ఈ విధి ఇల్లాగే వుంది. యువతరం మేధాసంస్కారం అభివృద్ధి చెందడానికి, ప్రస్తుతపు యువతరం పాఠకుల అభిరుచుల పరిధిలో - పత్రికలు ఎంతవరకు నిజాయితీగా తమ బాధ్యతను నెరవేర్చగలవో వివరించిచెప్పనక్కరలేదు.

సాహిత్యం, సినిమా, రాజకీయాలు, సెక్సు అనే విషయాలగురించి నేటి యువతరం కోరుకొనేది నిశిత మైన పరిజ్ఞానంకాదు; మేధాసంస్కారాన్ని అభివృద్ధి చేయగల వస్తు సంచయం కాదు; కథలపట్ల కళాత్మకమైన సదసద్వి మర్శన విచికిత్స కాదు. కేవలం సుగర్‌కోటెడ్ కాలక్షేపాన్ని మాత్రమే కోరుకొంటున్నది. నూటికి తొంభైఅయిదు వంతుల యువతరం పాఠకుల పరిస్థితి ఇంతకు మించి వుందనుకుంటే అది మన పొరపాటు.

రాజకీయ, సామాజిక లక్ష్యాలకోసం, సాహిత్యపు విలువలకోసం, భావ తీవ్రతతో పోరాడేవారు యువతరంలో వున్నా, ఎప్పుడూ వారిసంఖ్య అతి స్వల్పం. అంతేకాదు; వారి అభిప్రాయాలు మాత్రమే యువతరం మొత్తం అభిప్రాయాలనే భ్రమకూడా మనకు వుండకూడదు. కనుక, యువతరంలోని సమన్వైరుధ్యాలనూ మనం పరిగణించాలి. అంటే, మనం మెచ్చే అభిప్రాయాలు గల యువతరమే కాకుండా, మనం హర్షించలేని యువతరం కూడా ప్రస్తుత సమాజంలో వుందన్న విషయం గుర్తించాలి.

కాగా, ప్రస్తుతం పత్రికలను పోషిస్తున్న యువతరం సంఖ్యలో ఆ రెండో రకం వారి సంఖ్యే ఎక్కువ గనుక, వారి అభిరుచుల చరిత్రే ప్రస్తుతం మన పత్రికల చరిత్ర అని చెప్పుకోక తప్పదు.

ఇప్పుడిక, యువతరం రచయితల దగ్గరకు వద్దాము. యువతరం అభిప్రాయాలను ప్రకటించడానికి ఈ పత్రికలు ఎంతవరకు అవకాశ

మిస్తున్నాయో పరిశీలిద్దాము.

ఏ తరానికి సంబంధించినా, అభిప్రాయాలనేవి రాజకీయ, సాంఘిక వ్యవస్థలకు సంబంధించి వుంటాయి. కొంతవరకు సాహిత్యానికి సంబంధించి వుంటాయి. సాధారణంగా, సర్క్యులేషన్ పరమావధిగా గల పత్రికలు ఆ మేరకు దెబ్బతగలనంతవరకు 'అభిప్రాయాలకు' చోటిస్తాయి. 'కస్టమర్ ఈజ్ ఆల్వేజ్ రైట్' అనే సూత్రాన్నే ప్రధానంగా ఈ పత్రికలు అంగీకరిస్తాయి. ఇక్కడ ఇంకొక చమత్కారం వుంది. ఫలానా అభిప్రాయాలు ప్రకటించే రచనలు వేయడం వల్ల, మరికొందరు పాఠకులను ఆకట్టుకోగలం అనే నమ్మకం వుంటే, తప్పకుండా ఎంత తీవ్రమైన అభిప్రాయాలకైనా ఆ పత్రికలు చోటిస్తాయి.

సారాంశం ఏమంటే, యువతరం అభిప్రాయాలు కూడా కొంతవరకైనా సర్క్యులేషన్ సేవచేయగలిగితే, తప్పకుండా ప్రముఖ పత్రికలు ఆ అభిప్రాయాలకు చోటిస్తాయి.

ఇదిట్లా వుండగా, అభ్యుదయ అభిప్రాయాలు గల కొందరు సంపాదకులు తమ పత్రికల్లో అప్పుడప్పుడు యువతరానికి సంబంధించి కొన్ని శీర్షికలను నిర్వహించడం గమనించదగ్గది. ఈ శీర్షికలు స్త్రీ, పురుషుల జీవితసమస్యలను స్వేచ్ఛగా చర్చించడంకూడా పాఠకుల్లో చాలామందికి తెలుసు. ఇంతేకాక, కథలు, కవితలు, ఎన్నికచేసే సందర్భాల్లో కూడా ఈ దృష్టితోనే చూడడం గమనించదగ్గది. అయితే ఈ ఒకటి రెండు పత్రికల్లో, ఒక రిద్దరు సంపాదకులలో, కొద్దిమంది రచయితలో కడవరకూ ఈ పనికి న్యాయం చేకూర్చజాలరు.

ఏ వ్యవస్థ అస్తిత్వమైనా దానిని పరిపాలించే రాజకీయ సూత్రం మీద ఆధారపడి వుంటుంది. ఆ సూత్రంలో ఎన్ని మెలికలూ, ముడులూ, వుంటే అవన్నీ ఆ వ్యవస్థలో వుండే జనం గొంతుకలకు చుట్టుకుంటాయనేది భౌతిక సత్యం, అప్పుడు. ఒక వ్యవస్థలో వుండే యువతరం సమస్యల స్వభావం ఒక్కొక్కరకంగా వుంటుంది. వీటి నన్నిటినీ, ఆ వ్యవస్థలో వివిధ సొంత ప్రయోజనాలతో బ్రతికే పత్రికలు ప్రతిబింబించజాలవు.

అట్టి సందర్భాల్లో మనిషికీ, సంఘానికీ గల పరస్పర సంబంధాలలో వుండే సమస్యలను చర్చించడానికి ఏవో పత్రికల్లో అనామకంగా వుండే ఒక శీర్షిక సరిపోదు. విస్పష్టత్రపాతిపదికమీద ప్రత్యేక పత్రికలే వుండాలి. వుండగానే

సరిగాదు. అవి ప్రచురించే రచనల్లోశైలి, విషయసేకరణ నిర్దుష్టంగా వుండి యువతరం పాఠకుల వీపులు చరిచి చదివించగలగాలి. అటువంటి బలమైన ప్రత్యేకపత్రికలు వెలువడేవరకు ప్రముఖపత్రికలలోని ఒక్కొక్క శీర్షిక కొంతవరకే యువతరానికి న్యాయం చేయగలుగుతుంది.

ఈనాడు యువతరంరచయితలనుంచి రోజుకు వందలసంఖ్యలో రచనలు పత్రికాకార్యాలయాలకు వస్తున్నాయి. వీటిలో చాలాభాగం ఆయా పత్రికలు తరచు ప్రచురించే రచనలను ఆదర్శంగా తీసుకుని తయారయేవి మాత్రమే. అంటే ఆ రచయితల వుద్దేశ్యం తమ అభిప్రాయాల విలువకంటే, ఫలానా పత్రికలో, అది అంగీకరించగల తమ రచనలు అచ్చుకావడానికి విలువ ఎక్కువ వుంటుందన్నదన్న మాట. కథలు, వ్యాసాలు, కవితలు ఏవైనా ఇదేవిధిని తరుచు పాటిస్తుంటాయి. కాని, వీటిచాటునుంచే ఆకుచాటు పిందెల్లాగ గొప్ప కథలు, కవితలు సంపాదకుడి చేతికి తగిలి అమితానందం కలిగిస్తాయి. వ్యాపార దృష్టి, పత్రిక పాలసీ ఎంతగా వున్నా, రచనల్లో కళాత్మకపు విలువలు వుంటే, స్వీకరించని సంపాదకుడు సాదారణంగా వుండడు. కానైతే తగినంత పారితోషకం ఇవ్వలేకపోవచ్చును. సాంకేతికంగా వుండే ఇబ్బందులవల్ల ప్రచురించడంలో జాప్యం చేయవచ్చును. అంతే టన్నులకొద్దీ వచ్చే రచనల్లో ఒక మంచి రచన ఎదురుపడితే, తమ వెదకులాటకి సాఫల్యం వుందన్న తృప్తి కోసమైనా సంపాదకులు – విరలంగానే కావచ్చు – మంచి రచనలు విధిగా ప్రచురిస్తూనే వున్నారు.

పెద్దతరం రచయితలు సాధారణంగా ఎవరైనా అడిగితే తప్ప తమంత తాముగా రచనలు పత్రికలకు పంపడం అరుదు. సంపాదకులు కూడా వారిని ఎక్కువ ఇబ్బంది పెట్టక, తమ దగ్గరకు వచ్చే యువతరం రచనలనుంచి మంచిని ఎంచాలని నిజాయితీగా ప్రయత్నిస్తున్నారు. ఆ నిజాయితీలోకూడా పత్రిక పాలసీ ప్రతిఫలించవచ్చు కొన్ని సందర్భాల్లో – అదివేరే విషయం. 'మేం యువతరంవారముగనుక, కొన్ని సాంఘిక, రాజకీయ సమస్యలను పట్టించుకొని రచనలను చేస్తున్నాము కనుక, మా కథలనో, కవితలనో విధిగా వేసి తీరాలి' అని యువతరంవారు ఆశించడంలో తప్పు లేక పోవచ్చును. కాని, పైన భగవంతు డున్నాడో, లేడో కాని, పాఠకుడు మాత్రం వున్నాడు. అసమర్థత, కళారాహిత్యం తమ రచనల్లో గర్వకారణాలుగా అనుకుంటే, దానికి సంపాదకులు బాధ్యులు కారు.

నిజానికి, సాహిత్యప్రవాహాన్ని ఒకమలుపు తిప్పగల రచనలు తొలుతవచ్చేది యువతరంనుంచే - అట్టి రచనలను - ముఖ్యంగా తెలుగు పాఠకులు - మంచిరచనలుగా అంగీకరించడానికి ముందు మొరాయిస్తారు. సంప్రదాయసౌధం కూలిపోతోన్నట్టు బెంగపెట్టుకుంటారు. ఆ తరువాత తరువాత దృష్టిసారించి, కడకు అంగీకరిస్తారు. ఒకసారి అంగీకరించారా, ఇంక ఆ రచయితలమీద ఈగవాలనివ్వరు. అలనాటి కాల్పనిక సాహిత్యోద్యమం మొదలు నేటి విప్లవ కవితావుద్యమంవరకూ ఈచరిత్ర ఇంతే.

అదలా వుంచుదాం - గతతరానికీ, ప్రస్తుతతరానికీ జరుగుతున్న ఘర్షణలను, అన్ని రంగాలలో మారుతున్న విలువలను, పత్రికలు ఎంతవరకు ప్రతిబింబిస్తున్నాయో చూద్దాం.

నిష్కర్షగా చెప్పుకోవలసి వస్తే ప్రముఖ తెలుగు వార, మాస పత్రికలలో ఈ మేరకు కృషి జరగడంలేదు. సృజన, జీవనాడి, 'పిలుపు' వంటి చిన్న పత్రికలు ఇందుకు గట్టి ప్రయత్నాలు చేశాయి. చేస్తున్నాయి.

వర్గ దృక్పథంతో చేసినా, చెయ్యకపోయినా, పత్రికల్లో ప్రచురించే కథల్లోగాని, నవలల్లోగాని, అప్పుడప్పుడు ప్రచురించే కథల్లో గాని, నవలల్లోగాని, అప్పుడప్పుడు ప్రచురించే వ్యాసాల్లో గాని ప్రముఖపత్రికలు ఈ తరాల అంతరాలను చిత్రించే రచనలను సరిగా పట్టుకోలేక పోతున్నాయి. ఈ ఫిర్యాదు సంపాదకులపై కాక, రచయితలపై చేయవలసి వుంది.

అప్పుడప్పుడు ఇటువంటి ఘర్షణను చిత్రించే ప్రయత్నం కొందరి రచయితల్లో కనిపించినా అది జీవితంనుంచి సహజంగా మొలిచినది కాక, రచయిత అభిప్రాయాల ప్రసవవేదననుంచి పుట్టినదే అవుతున్నది. పాత్రలు, సంఘటనలు, సజీవంగా కనిపించే వివిధ రచనలు ఇంకా వెలువడాలి. ఆ రచనలను కనీసం కొన్నిపత్రికలైనా స్వీకరించడానికి సిద్ధంగా వున్నాయి. ఇందుకు సంపాదకులు సిద్ధంగా వుంటే చాలదు. తమ రచనలను చదివించగల శైలీ నైపుణ్యం రచయితలకు కావాలి. అప్పుడే యువతరం ప్రత్యేక శ్రద్ధ వహించి, ఆ రచనలను ఆదరించడం జరుగుతుంది.

విశేషప్రచారం గల పత్రికలు కొంతలో కొంత సాహిత్య సందర్భంగా యువతరం అభిప్రాయాలకు, అభిరుచులకు దోహదం చెయ్యగలుగుతున్నవి కాని, వారి రాజకీయ, సాంఘికచైతన్యాలకు సంబంధించి తగినంత శ్రద్ధ

వహించలేకపోతున్నాయి. యువతరం సమస్యల స్వరూప స్వభావాలను విశ్లేషించి, ప్రజల ముందుంచడం జరగడంలేదు. అంటే ఫిక్షన్, నాన్ ఫిక్షన్ అనే విభాగాల్లో నాన్ ఫిక్షన్‌కు తగినంత ప్రోత్సాహం లభించటం లేదని నా భావం.

నాన్ ఫిక్షన్‌కు సంబంధించిన వివిధశాఖలు పరిపుష్టిని సంపాదించుకో గలిగిననాడు యువ పాత్రికేయులు చేసే కృషికి రాణింపు వుంటుంది.

రాజకీయాలలో స్థానిక, జాతీయ, అంతర్జాతీయ సమస్యల గురించిగాని, సంఘటనల గురించిగాని, లేక వివిధకళారంగాలపైగాని, సైన్సుకు సంబంధించి గాని, తెలుగుపత్రికాప్రపంచంలో, స్వతంత్రంగా, సమర్థంగా, ఎంతమంది రచనలు చేయగలుగుతున్నారు? నిజానికి అవకాశం పూజ్యం.

ఈనాడు తెలుగు దినపత్రికల్లో వర్కింగ్ జర్నలిస్టుగా జేరిన యువకుడు చేయగల పని ఒక్కటే. అది ఇంగ్లీషు వార్తలకు అనువాదాలు రాయటం. మహా అయితే, పబ్లికేషన్స్ సిండికేట్‌వారు సిద్ధాన్నంలా పంపిన వివిధ విషయాలపై వ్యాసాలను అనువదించటం - ఈ పద్ధతి, వార్తలప్రచురణవరకు జరగక తప్పదు. పోతే, ఇతరవిషయాలకు సంబంధించి - ప్రత్యేక శిక్షణను ఇచ్చి అయినా సరే - వ్యాసాలను విరివిగా పత్రికలే వ్రాయించాలి.

ఇప్పుడు పత్రికల్లో పనిచేస్తున్న రచయితలుగాని, బయట వేరే వృత్తుల్లో వుంటూ వివిధ రచనలు చేసేవారు గాని, ఫిక్షన్‌కు సంబంధించి ఏం చెయ్యాలో బాగా అలవాటుపడ్డారు. కథలకూ, కవితలకూ, సీరియల్స్‌కూ, మన దేశంలో కొరత లేదు. ఇతరరంగాల్లోనే రచయితలనుంచి మంచి రచనలను పత్రికలు రాబట్టాలి.

పాఠకుడిచేత పత్రికను చదివించాలంటే మంచి రచనలు వుండగానే సరికాదు. ఆ రచనలను అచ్చువెయ్యడం, చిత్రాలను, గ్రాఫులను, మేప్సను, ఫొటోలను, శీర్షికలను అమర్చడంలో ఎంతో నేర్పు తెలుగు పత్రికలింకా అలవర్చుకోవలసి వుంది. అంటే ప్రస్తుతం వున్న వార, మాస పత్రికల గెటప్ మారాలి. టైపోగ్రఫీ, లే-ఔట్ టెక్నిక్స్ బాగా అభివృద్ధి చెందాలి. ఒక్కొక్క విషయానికి ఒక్కొక్క శీర్షికను ఏర్పరిచి, సమర్థంగా వాటిని నిర్వహించాలి. ఆపైని కొంతకాలం గడిచి, పాఠకులు వివిధ విషయాల ప్రాముఖ్యాన్ని, వాటిలో తమ జీవితాలకు గల సంబంధాన్ని ఆకళింపు చేసుకొన్నాక ప్రత్యేక పత్రికలకు మనుగడ బాగుంటుంది. అన్నిటికంటే ముఖ్యంగా నేటి మన వార, మాస

పత్రికల్లో సినిమా శీర్షికల ప్రాముఖ్యం తగ్గాలి. ముఖ చిత్రాలలో వైవిధ్యం 'పండగల'కే పరిమితం కారాదు. ఇతర రంగాలలో విషయాలను చర్చించడానికైతే ప్రత్యేక పత్రికలు లేవు గాని, సినిమారంగానికి సమృద్ధిగా వున్నాయి. వాటికి పాఠకులు కూడా వున్నారు. ఇట్లా ఎన్నో సాహసోపేతంగా మార్పులు జరగాలి. తెలుగుపత్రిక తెలుగుకళలో నూ, జీవితాన్ని, సమస్యలనూ, చరిత్రనూ, సంస్కృతినీ ప్రతిబింబించగల రీతిగా రూపొందిన నాడు యువతరానికి పత్రికాప్రపంచం ఎంతో సంస్కారాన్ని, మానసిక ఔన్నత్యాన్ని కలిగించగలుగుతుంది. "నిజమే, మారాలి. పత్రికలవారు అటువంటి రచనలు వేస్తున్నారు గనక మేం చదువుతున్నాం" అనే పాఠకులూ, "వారు ఆదరిస్తున్నారు గనుక మేం ఆరచనల నందిస్తున్నాం" అనే పత్రికాధిపతులూ, తమ పాతపాటలను విరమించి, మరింత అవగాహనతో దగ్గరకు రావాలి.

యువతరం మాత్రమే అధికాధికంగా పోషిస్తున్న పత్రికాప్రపంచంలో అప్పుడే వారి సమస్యలకూ, అభిరుచులకూ తగిన స్థానం లభిస్తుంది.

# యువతీ యువకుల సమస్యలు

**పురాణం సుబ్రహ్మణ్య శర్మ**

యువతీయువకుల సమస్యలగురించి ఆలోచించే ముందు - యువతీయువకు లంటే ఎవరు? సమాజంలో ఏ వర్గానికి సంబంధించిన వారో తెలుసుకోవాల్సి వుంటుంది. వర్గం ఏదైనా ముఖ్యంగా వీరంతా ఏదో ఓ కుటుంబానికి లేదా కొన్నికుటుంబాలకి చెందినవారై వుంటారు. ఆ కుటుంబాల సాంఘిక ఆర్థిక రాజకీయ మతపరమైన విశ్వాసాలూ, అలవాట్లూ, జీవనవిధానం ఈ యువతీయువకుల జీవితాలను శాసిస్తాయి, లేదా ప్రభావితం చేస్తాయి. కుటుంబాలలోని సమస్యలే యువతీయవకుల్ని వ్యక్తిగతంగా కలవరపెడ్తాయి.

మనదేశంలోని కోట్లాది అజ్ఞానులూ, నిరక్షరాస్యులు, పూటకు గతిలేనివాళ్ళు, హరిజనులు, గిరిజనులు, అలగాజనులుగా రిఫర్ చేయబడేవాళ్ళూ - యిలాటి బాపతు సరుకులోంచి పుట్టుకొచ్చిన యువతీయువకుల సమస్యలు సోషియాలజిస్టులు కుర్రలెక్చరర్లు థీసిస్సులు దంచడానికి, డాక్టరేట్లు పుచ్చుకోడానికి, డ్యాక్యుమెంటరీ చిత్రాలు తీయడానికి పనికొస్తాయి. లేదా పోలీసువార్నడిగితే ఈ యువతీయువకుల చరిత్రలు వీళ్ళు దేశానికి ఎలా సమస్యలు కల్పిస్తున్నారో తెలుస్తాయి. అది ప్రస్తుతాంశం కానట్లు తోస్తోంది.

కాని, యువభారతివారు యువత సర్క్యులర్‌లో ప్రస్తావించిన చర్చనీయాంశముల సరళినిబట్టి మొత్తం సమస్యలన్నీ మధ్య తరగతి జనాభాను దృష్టిలో వుంచుకునే రూపిందినట్లు కనిపిస్తున్నది.

మధ్య తరగతి యువతీయువకుల సమస్యలే దేశం యావత్తు కుర్రకారు స్త్రీ పురుషుల సమస్యలు కాజాలవు.

1. యువతీయువకులు ఉద్యోగాలలో పోటీపడటం ఎందుకు అవాంఛనీయం అవుతుంది? యువతి అనగానే అక్కో, చెల్లెలో, వదినో, మరదలో, క్లాసుమేటో, స్నేహితురాలో ఏదో ఒకటి అవుతుంది. ఒక ఆడది ఉద్యోగం చేస్తే ఒక మగాడికి ఉద్యోగం పోయినట్టు గోలపెట్టే మనస్తత్వం - ఆ తర్కం చాలా తప్పు. ఈ లోకంలో ఎవరిజీవితాలు వారివి, ఎవరి కష్టాలు వారివే. ఆమాటకొస్తే కొన్ని ఆడవారి కష్టాలు మగవారికి లేనేలేవు. అందుకు సంతోషించక పోటీపడుతున్నారని

ఏడవటం దేనికి? సోషలిస్టు దేశాలలో స్త్రీ పురుషులు ఉద్యోగాలకు పోటీ పడటమనేది ఒక సమస్య కాదు. యోగ్యత అనేది ప్రధానం కానప్పుడే - సమస్య కాని, ఎవరు ఎక్కువ ప్రతిభ కలవారయితే వారికే ఆ అవకాశం యివ్వటం న్యాయం. నన్నడిగితే పోస్టాఫీసుల్లోనూ, బ్యాంకుల్లోనూ, విద్యారంగంలోనూ వైట్‌కాలర్డ్ క్లెరికల్ ఉద్యోగాలన్నీ స్త్రీలకే యిచ్చి - యువకుల్ని hard duties - production units లో వేయాలంటాను. మన యువతులను వంటయింటికి పడకగదికి కట్టిపడవేయకుండా సమాజంలోని అన్ని రకాల వృత్తులలోను వారిష్టానుసారం తెలివితేటల్ని పట్టి జాబ్స్ చేయనివ్వాలి. మన కుటుంబ వ్యవస్థ అందుకు అనుగుణంగా మారాల్సి వుంటుంది. స్త్రీపట్ల మనకు వున్న నిశ్చయాభిప్రాయాలతో ఆమెను అనవసరమైన పోటీదారుగా భావించి 'నీ స్థానం ఫలానా' అని నిర్దేశించబూనటం మగవాళ్ళ అంగీకారం క్రిందకే వస్తుంది. అయితే యువతులు కూడా బయట ప్రపంచంలో మసలుకొనే స్థైర్యాన్ని, శక్తినీ పెంపొందించుకోవాలి. సంకుచితమైన పరిధిలో ఆలోచించడం కట్టిపెట్టి లోకాన్ని అర్థం చేసుకోగలిగి వుండాలి. అయితే, వేలు లక్షల సంఖ్యలో యువతులు కుటుంబజీవితాలకు దూరమయి వృత్తులు, ఉద్యోగాలు చేపట్టినపుడు స్త్రీ పురుష సంబంధాలలో కొత్తమార్పులు వస్తాయి. ఆధునికయువతి జీవితపోరాటంలో కొంత గెలుచుకున్నప్పుడు కొంత కోల్పోతుంది. ప్రతిగెలుపులోనూ కొంత కోల్పోవడం వుంటుంది. పాత సంఘం నిర్దేశించిన నీతుల కొలతలను పాత విలువలను ఆధునిక యువతి కొంతమేరకు తృణీకరించవచ్చు. నా జీవితం నా ఇష్టం వచ్చినట్లు మల్చుకుంటాను అని ఆమె అనుకోవచ్చు. మానవ సంబంధాలు ఎల్లకాలమూ ఒకే రకంగా వుండాలని ఆశించలేము కదా. అయితే అపారమైన ఈ స్త్రీజనశక్తి వంటయిళ్ళలో దుర్వినియోగం కాకుండా కొంతమేరకు సంఘానికి ఉపయోగపడితే సంతోషించనివారుండరు. మనం స్త్రీలను రెండవతరగతి పౌరులుగా చూస్తున్నాం. స్త్రీ పురుషులమధ్య వున్న అంతరానికి స్త్రీకో న్యాయం, పురుషునికో న్యాయం అనే పద్ధతిని సమర్థిస్తున్నాం. ఈ బానిస ప్రవృత్తి పోవాలంటే పాతకళ్లద్దాలతో కొత్తతరంసమస్యలను పరికించడం మానుకోవాలి. రేపటియువతి పెంకులెగురకొడ్తుంది. ముక్కు పగులకొడ్తుంది. పురుషాధిక్యతను నిరసిస్తుంది. అన్ని రంగాలలో నూతన

ప్రతిభను చాటుతుంది. అందుచేత ఉదయిస్తున్న సూర్యుడ్ని అరచేయి అడ్డంపెట్టి ఎవరాపగలరు?

2. మతప్రభావం తగ్గినట్లు కనిపిస్తుంది కాని, తిరుపతి, అన్నవరం, సింహాచలం, కాశీ వెళ్ళి చూస్తే, మన తల తిరిగిపోతుంది. మతప్రభావం పాత ఫక్కీలో లేదు. అది కొత్త పద్ధతుల్లో విజృంభిస్తోంది. అయితే, దేశం బాగా పారిశ్రామికం అయితే జనంలో మత పిచ్చి చాలావరకు తగ్గిపోతుంది. బాబాలు, స్వాములు, బోడిగుళ్ళు ఎక్కువవుతున్నాయేగాని తగ్గటం లేదు. మన లాభాలకీ మన ఇష్టాలకీ మన సరదాలకీ అడ్డురానంతకాలం దేవుడు, మతం ఎలా వున్నా ఫరవాలేదు అనే మనస్తత్వం - దేవుడ్ని డబ్బులో, కానుకల్తో, ముడుపుల్తో కొనెయ్యగలం అనే ధీమా ఎక్కువగానే వుంది. ఈ కలియుగంలోకూడా దేవుళ్ళూ మతాలూ యధాశక్తి చెయ్యగలిగినంత అపకారం మనుష్యులకి చేస్తూనే వున్నారు. మనకు మతం వుంది, గతం వుంది. లేనిది భవిష్యత్!

3. భార్యాభర్తలు ఇద్దరూ ఉద్యోగాలు ఎందుకోసం చేస్తారు? డబ్బుకోసం - డబ్బు ఎందుకు? చాలక -కోరికలు తీరక - కష్టాలు ఎక్కువయి. డబ్బు సంపాదనకోసం పడే కష్టంలో భాగమే యింట్లో యిబ్బందులు. ఆడది కూడ మగవానిలా బయట కష్టపడి వచ్చి మళ్ళీ యింట్లో కష్టపడాలంటే ఆమెకు నరకంలా వుంటుంది జీవితం. పైగా ఉద్యోగం చేసినా ఆడదాని సంపాదనమీద అన్ని హక్కులూ పురుషుడివే - సాధారణంగా వదులుకోలేడు. కుటుంబమా - ఉద్యోగమా అన్నప్పుడు చాలామంది స్త్రీలు కుటుంబంకోసం ఉద్యోగాలు మానుకుంటున్నారు. పైగా ట్రాన్స్‌ఫర్లు వగైరాలొచ్చి సంసారజీవితం దెబ్బతినే ప్రమాదం వుంది. భర్త భార్యను ఉద్యోగినిగా కాక నేరస్థురాలిగా చూసి అనుమానించి అవమానించే ప్రమాదం వుంది. కాని, ఇవన్నీ తప్పేవికావు. ఆర్థిక సంపాదనవలన కుటుంబపరిధిలో స్త్రీకి బాధ్యతలు బరువులు పెరగడం తప్ప కొత్తగా ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చినట్లు భావించరాదు. ఆమె ప్రతిపత్తిలో మార్పులేదు. హైరానా, బాధలూ తప్ప. సంపాదనా పరురాలు కావడంతో స్త్రీకి నిజమైన ఆర్థికస్వాతంత్ర్యం రాదు. అది స్త్రీలపట్ల దృక్పథంలో, కుటుంబంలో ఆమె స్థానంలో, సమాజంలో ఆమె వ్యక్తిత్వం పట్ల వున్న విలువలలో మార్పు రానిదే, స్త్రీల బానిసత్వపు సెంకెలలు తెగాయనుకోవడం

దుర్భ్రమ. వ్యక్తుల మనస్తత్వాలలో మార్పులవలన వారు బాగుపడరు. అలాటి కేసులు చాలా తక్కువ. మొత్తం సంఘం బాగుపడినపుడు స్త్రీలూ పురుషులూ అందరూ బాగుపడతారు. ఈ సమస్యలు చైనాలో రష్యాలో ఉన్నవా? లేవని అన్నాను.

4. కార్యాలయాల్లో వ్యాపారసంస్థల్లో కార్మాగారాల్లో పనిచేసే యువతులకు ప్రత్యేక సమస్యలంటూ వుంటే - వ్యక్తిగతమైన వాటికి తప్ప చట్టాలు వుండనే వున్నాయి. అక్కడ పని ప్రధానం. ఆడా మగా అనేది బాత్రూంల వరకే. ఇతర సమస్యలేవీ పరిగణనలోకి తీసుకోకూడదు. అలా అయితే పనులు జరగవు. పనివిషయంలో నిర్దయగా వుండాలి. వారి వారి హక్కుల విషయంలో చాలాసరళంగా ఉదారంగా వుంటే సరిపోతుంది.

5. సహవిద్య చాలామంచిది. ఒకవేళ యిష్టంలేకపోతే ఆడపిల్లలకు వేరే కాలేజీలు వున్నాయి. పుట్టినప్పటినుంచీ ఆడపిల్లలంటే చులకనభావన మగపిల్లల్లో కలిగించటం వలన కుర్రాళ్ళు వికారపు చేష్టలు చేస్తారేకాని నిజంగా ఒంటరివ్యక్తులుగా వారంత మంచివాళ్ళు వుండరు. ఎక్కువగా ఆడపిల్లలు మగపిల్లలు కలిసి మెలిసి వుంటే పరస్పర అవగాహన పెరుగుతుంది. పీకి పారేసే కలుపుమొక్కల్ని గురించి బాధపడనవసరంలేదు.

6. లైంగిక జీవితం పూర్తిగా వ్యక్తిగతం. అది ఒక ఘోరమైన నేరంగా భావిస్తే అలానే కనిపిస్తుంది. కట్నండబ్బు లేకుండా వరుని పొందలేని పరిస్థితులు సమాజంలో వున్నపుడు, సంప్రదాయవివాహాలు దోపిడీవ్యవస్థలో భాగమైనపుడు, పెళ్ళి ఒకవ్యాపారం అయి అందులో పెళ్ళికూతురికి పెళ్ళి కొడుక్కి ఏమి ప్రాముఖ్యం లేనపుడు- వ్యక్తుల లైంగికజీవితాలను, ప్రేమ వివాహాలను, ప్రేమకలాపాలను ప్రశ్నించే హక్కు ఈ ఎముకలు కుళ్ళిన వయస్సు మళ్ళిన దుష్టసంఘానికి లేదు.

నేను మరొక సవాల్ చేస్తున్నాను. ప్రభుత్వ ఫ్యామిలీ ప్లానింగు పిల్లలు పుట్టకుండా అనేక సదుపాయాలను యువతీ యువకులకు అందుబాటులో వుంచింది. వారు వాటినుంచి రక్షణలను పొందుతారు. ఆడపిల్లలు తెలియక తప్పుచేసినా తెలిసి తప్పుచేసినా అరిటాకులా నష్టపోవడానికి సిద్ధంగాలేరు. భారత సర్కారు వారి ఎర్రత్రికోణం స్త్రీలకు లైంగిక స్వేచ్ఛకు స్వర్గ ద్వారాలను తెరిచింది. ఈ మాట పురుషులకు

కొంచెం కష్టంగానే వుండవచ్చు. కాని నిప్పులాంటి నిజం.

7. వరకట్నాలు పూర్తిగా తల్లిదండ్రులకు సంబంధించిన సమస్య. దానీ ప్రభావం యువతీయువకుల వైవాహిక జీవితంపై వుంటుంది. వివాహం నూరేళ్ళ పంట అంటారు. అంటే పొలం మీంచి వచ్చినట్లు రాబడి నూరేళ్ళు వుండాలని. వర్ణాంతర, మతాంతర, ప్రేమవివాహాలు విజయం పొందాలంటే పెద్దలు ఏర్పాటుచేసిన వివాహాల పద్ధతి పోవాలి. అది పోతే దోపిడీ పోతుంది. స్త్రీల ప్రతిపత్తి పెరగనిదే, మొత్తం వ్యవస్థ మారనిదే వివాహపద్ధతులలో మార్పురాదు. ఈ వ్యవస్థా, సమాజం, కులాలూ హెచ్చుతగ్గులూ ఇలా వుండగానే మనుషులంతా మంచివాళ్ళయిపోయి దోపిడీ మానేసి కట్నాలు లేకుండా పెళ్ళిళ్ళు చేసుకుంటారని, ఆడపిల్లల జీవితాలు బాగుపడతాయని ఆశించడం సినిమాలో జరుగుతుంది. ఈ సమాజానికి కావలసింది చికిత్సకాదు. శస్త్ర చికిత్స.

8. పాతవిలువలు పూర్తిగా పోకుండా కొత్త విలువలు ఏర్పడకుండావున్న సంధికాలం ఇది. యువతీయువకులు పరస్పరం గౌరవమర్యాదలు యిచ్చి పుచ్చుకోవడాల విషయంలో వ్యక్తిగతంగా అందరూ మంచివారే. పదిమంది కలిసినపుడు స్త్రీని తక్కువచేసిచూసి మిఠాయి పొట్లంలా భోగవస్తువులా చూసే మనస్తత్వం పెట్టుబడిదారీ సమాజంలో ధనికస్వామ్యంలోనే వుంది. అభివృద్ధి చెందిన దేశాలలో కూడా స్త్రీని మనిషిగా కాక భోగవస్తువుగానే భావిస్తున్నారు. ఈ తత్వం యిప్పుడిప్పుడే మన కుర్రవాళ్ళలోకూడా కనిపిస్తుంది. ఈ విషయంలో - వెనుకటితరంవారు ఎక్కువ బాధ్యతగా మసలుకొని వుండవచ్చు. లైంగిక స్వేచ్ఛ సమాజంవైపు పరిగెడితే అక్కడ స్త్రీ పరిస్థితి ఇంకా అధోగతే.

ఇప్పుడు ముఖ్యంగా మనకు కావలసింది- పాపం మన పూర్వులు చెప్పినట్లు - 'యత్రనార్యస్తు పూజ్యంతే। రమంతే తత్ర దేవతాః' కాదు. వారిని పూజించనవసరంలేదు. తోటిమనుష్యులుగా మనతో సమానులుగా గుర్తిస్తే చాలు. మాంసపుముద్దలు, మిఠాయిపొట్లాలు, పరుపులమీదకు పనికివచ్చే పదార్థాలుగా భావించకుండా వుంటే చాలు.

# యువతరం - వివాహాలు

యలమంచిలి తాయారు

స్త్రీ - పురుషుల భౌతిక ఆత్మికావసరాలను సమగ్రంగా క్రమబద్ధంగా తీర్చగల కట్టుబాటే వివాహం. ఈ కట్టుబాటులో ఆ స్త్రీ పురుషుల ప్రయోజనాలతోబాటు సామాజిక ప్రయోజనం కూడా ఇమిడి యున్నది. ఈ భౌతిక సత్యాన్ని మరుగుపరచి దీనికి మతమపరమైన ఆచార వ్యవహారాల రూపం మాత్రమే ఇవ్వడం జరిగింది.

"అపుత్రస్య గతిర్నాస్తి" అని పున్నామనరకాన్ని ఒక దానిని సృష్టించి భయపెట్టడం జరిగింది. పితృస్వామ్య వ్యవస్థ రక్షణ ధర్మంపేరిట, సంస్కృతి పేరిట కొన్ని కట్టుదిట్టాలు చేయబడ్డాయి. ఇక్కడే స్త్రీ ఒకవంక ఆర్థిక పరాధీనతకు, మరొకవంక ధార్మికమాయాజాలానికి గురిచేయబడింది. ఫ్యూడల్ వ్యవస్థ సృష్టించిన ఆర్థిక విధానం, దాని ననుసరించిన సంస్కృతి, స్త్రీని ఘోరాతిఘోరంగా సాంఘిక అన్యాయాలకు, అక్రమాలకు గురిచేసింది. ఒకనాడు అతి క్రూరమైన సతీసహగమనం సనాతన ధర్మంపేరిట అమలు జరుపబడింది. మతం మత్తునెక్కించి, ధర్మం నిషా తెప్పించి తప్పెట్ల తాళాల మ్రోతలలో ఒక అసహాయురాలిని సజీవదహనం చేయడం జరిగింది. బహు భార్యాత్వం అమలులో ఉన్న రోజులలోనే; శిశుహత్యలు దర్మబద్ధమైన రోజులలోనే; సతీసహగమనం అమలుపరచబడ్డ విషయం ఆలోచించదగ్గది. భార్య చచ్చిన పురుషు డెవ్వడూ భార్యతో సహగమనం చేయలేదు. ఫ్యూడల్ వ్యవస్థలో తమ కెందరు భార్య లున్నారో తెలియని వాళ్ళుకూడా వుండవచ్చు. అది ఆ సంస్కృతి ధర్మం. ఒక స్త్రీ పట్ల. "పతిననుసరించే ఆమె సతి" "సహమరణం విధవరారాలి విద్యుక్తధర్మం, మన ధర్మశాస్త్రాలను ఉగ్గడించండి. మన పూర్వీకులకు ప్రణమిల్లండి. వైధవ్యం పొందిన పతివ్రతలకు పరమపదం చూపెట్టిన బ్రాహ్మణ పురోహితులకు నమస్కరించండి"- ఇవి ఒకనాటి ధర్మసూత్రాలు. వివాహ వ్యవస్థ, శీ ధర్మాన్ని, మతాన్ని, ఎంతకపటంగా పురోహితవర్గం; రాచరికం చొప్పించగలిగిందో ఆనాటి ఈ దురాచారం మనకు తెలియజెప్పుతుంది.

"లేమిలో అవసరం ఆన్నాడు. భార్య బానిసలాగా పనిచేస్తుంది. కలిమిలో

భర్త ఇంకొక భార్యను చేరదీస్తాడు. ఐహికలోలత్వంలో విలాసంగా ఉంటాడు. సర్వ సాధారణంగా భార్యను కొడతాడు. శీలాన్ని శంకిస్తాడు. ఈ హింసలన్నీ ఎందుకంటే భర్త తన భార్యపై ఏ అత్యాచారం చెయ్యడానికైనా తనకు హక్కు ఉన్నదనుకోవడం వల్లనే".

తనవదినగారిని సజీవదహనంనుండి తప్పించడానికి విఫలప్రయత్నం చేసి ఆదురాచారాన్ని సమూలంగా నాశనం చేయడానికి జీవితాన్ని అంకితం చేసిన మాననీయుడు రాజారామమోహనరాయని మాట లివి:

"పిత్రార్జితంలోను, భర్త ఆస్తిలోను స్త్రీలు సమభాగినిలు అవ్వాలన్న" ఆయన మాట గమనార్హమైనది. సామాజిక రంగానికి, ఆర్థిక రంగానికి ఉన్న అవినాభావసంబంధాన్ని నేటిశాస్త్రీయపద్ధతిలో ఆయన ఆనాడు గుర్తించక పోయినా సహగమన దురాచారం ఆయనను స్త్రీ ఆర్థిక పరాధీనతను గూర్చి ఆలోచింపచేసింది ఆనాడు కూడ.

తరువాత "హిందూకోడ్ బిల్లు" వల్ల స్త్రీ భర్త ఆస్తిలో వారసత్వ హక్కును పొందింది. విడాకుల హక్కును కూడ. కాని, తన తండ్రి ఆస్తిలో నేటికి సమభాగిని కాలేదు. అందుకే ఎంత గగ్గోలు పెట్టినా వదలని ఈ కట్నాల బెడద. ఏకొద్దిమందో విడాకులచట్టాలని అమలుపరచగలగవచ్చుకాని అధికసంఖ్యాకు లకు సాంఘిక వాతావరణం అందుకనుగుణంగా లేదు. ప్రస్తుతము ఉన్న చట్టాలన్నీ ఈ ఆర్థికచట్రంలో నిరుపయోగమే.

వర్గరహిత సమసమాజమే స్త్రీ విద్యకు, ఉద్యోగానికి సమానాధికారాలు, బాధ్యతలతో పెనవేసికొని ఉన్న అవకాశాలు కల్పించగలదు. అన్ని రంగాల లోను అభిరుచులననుసరించి వారి సృజనాత్మక శక్తులకు విలువైన రూపం ఇవ్వగలదు. వర్గదోపిడీ జరుగుచున్నంతకాలం ఆ దోపిడీలో ఒక భాగంగా స్త్రీని, ఆమె వ్యక్తిత్వాన్ని వ్యక్తిగత అభిరుచులను, ఆశయాలను, సృజనాత్మక శక్తులను ఈ సమాజం అణచిపెడుతుంది.

తండ్రి, భర్త, సోదరుడు, కొడుకు ఆమెను జీవితాంతం శాసించగలరు. విధినిషేధాలు నిషేధించగలరు. ఇదంతా వ్యక్తిపరమైనది కాదు సమాజసూత్రాలకు చెందినది.

ఈనాటికీ స్త్రీ పనిముట్టుగానే చూడబడుచున్నది. ఒక వస్తువును మరియొకరికి దానిమిచ్చినట్లుగా ఇచ్చే ఈ దానములోకి అర్థపర్థాలు తెలిసికోలేని

స్త్రీలే దీనిమీద (కన్యాదానం) ఎక్కువగా మోజుచూపుతున్నారు. ఆర్షధర్మం పేరిట అమలులోకివచ్చిన అష్టవిధ వివాహాలలో ఇదికూడా ఒకటి.

ఒకప్పుడు కన్యాశుల్కం అమలులో ఉండేది. ఇది ధనరూపంలోనే కాక జంతు జాలాలరూపంలోకూడ అమలులో ఉండేదన్న విషయం మనలో చాలమందికి తెలియదు.

'ఓల్గానుండి గంగవరకు' 'కుటుంబం పుట్టుపూర్వోత్తరాలు' (వ్యక్తిగత ఆస్తితో జతబడివున్న) 'పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాలు' మొదలైన గ్రంథాలు చదివిన వారికి మానవపరిణామం చరిత్ర వ్యక్తిగత ఆస్తి ఏర్పడిన తరువాత కుటుంబానికి వచ్చిన ప్రాధాన్యత, వివిధరూపాంతరాలలో యువ వివాహపద్ధతులు అర్థమవుతాయి.

ఒకప్పుడు మధ్య ఆసియా మార్కెట్టులలో ముక్కుపచ్చలారని పిల్లలు భార్యలుగా అమ్మబడేవారు. ఎంత వయస్సు ఉన్నా ఎంతమంది భార్యలున్నా మరొక ముక్కు పచ్చలారని కన్యను భార్యగా కొనగలహక్కు పొందియుండేవాడు మగాడు. సోషలిస్టు వ్యవస్థ దాన్ని రూపుమాపి అన్ని రంగాలలోను స్త్రీ విముక్తి పొందేలా చేసింది.

స్త్రీలందరూ సాధుమూర్తులనో, పురుషులందరూ దుష్టులనో కాదు. స్త్రీపై జరిగే అత్యాచారాలకు ఆర్థిక సామాజిక విధానం (అసమానతలతో కూడినది) మూలకారణం. వివాహవ్యవస్థతో బలిపశువుగా స్త్రీ మార్చబడినది. వితంతు వివాహాల నిషేధం, అతి బాల్య వివాహాలు కన్యాశుల్కం, వరశుల్కం ఇవన్నీ ఆయా ఆర్థిక వ్యవస్థలనుండి వచ్చిన మార్పులే. సహగమనం లేకపోయినా నేటికి భర్త చచ్చిన స్త్రీ అనేక సాంఘిక అవమానాలకు గురవుతూనే ఉన్నది.

శాసనాలు, ప్రమాణాలు ఎలా ఉన్నా అన్నిమతాలవారితోను స్త్రీలు వివాహవ్యవస్థలోని అన్యాయాలకు గురవుతూనే ఉన్నారు. ఇది వర్గవ్యవస్థకు చెందిన కారణం కాబట్టి అన్ని మతాలలోను ఆ వర్గవ్యవస్థయొక్క అసమనాతలు అమలులోనే ఉంటాయి. స్వర్గంలోనే వివాహాన్ని దేవుడు నిర్ణయిస్తాడని, ఇది జన్మ జన్మాంతరాల సంబంధమని మోసపు కబుర్లు చెప్పి స్త్రీని నమ్మించారు. ఇప్పటికి ఈ స్వర్గ నరకాల ఆట ఆడుతూనే ఉన్నారు. ఈ దేశంలో ధర్మంపేరిట, మతంపేరిట అబద్ధపు అశ్లీలపు వేషాలెన్నయినా చెల్లుతాయి.

రాధామాధవగోపికాలీలలు ప్రచారం చేయబడి కంచుక క్రీడలుగా (రవికల పండుగలుగా) అమలులోకి వచ్చాయి. మన వివాహ సూత్రాలలో నీతి, న్యాయము అనే అర్థాల తావెక్కడా లేదు. రెండెద్దులను ఒకే కాడిన కట్టేటప్పుడు వాటికి భౌతిక, మానసిక ధర్మాలను అధ్యయనం చేసేటంతయినా వివాహాన్ని గురించి ఆలోచించరు. దర్మపరమైన ఉపన్యాసాలు మాత్రం దంచుతారు. వీటిని గుడ్డిగా అనుసరించుతారు.

నేటి యువతరం కూడ ఇవన్నీ చర్చించే స్థితిలో లేదు. స్త్రీని సమభాగినిగా గుర్తించలేదు. స్త్రీ వ్యక్తిత్వమంటేనే భయం వీరికి. ఇందుకు కారణం? వారు నేర్చే విద్య హేతుబద్ధమైనది కాదు. ఏది చేసినా ఎందుకు చేస్తున్నామో అనే ప్రశ్న వారిలో ఉదయించదు. స్త్రీని సమభాగినిగా స్వీకరించే సంస్కృతికూడా వారికి అందుబాటులో లేదు. "నీపాదదాసిని", "నీ పాదధూళి ధరించి జీవించగలను, నీ నీడను" "నీవనుభవించే భోగ్యవస్తువును" అని రకరకాల పాటలు పాడుతూ తనుకూడ భర్తను అనుసరించి త్రాగుతూ తూలుతూ ( అతనిలో మార్పు తేవడంకొరకు) పాటలు పాడుతుంది సినిమాలలో నేటి స్త్రీ. నవలల్లో కథలలో నీతోటి విహారం చాలంటుంది. నీతోటి షికారు చాలంటుంది. నీతోటె హాయి, హాయి చాలంటుంది. ఇక పార్యగ్రంధాల్లో శూద్రుడు నరబలికి అర్హుడు కాడన్న నాటినుండి వీరశైవ, వీర వైష్ణవ గాధలతో నిండి వుంటయి. పుష్పలావిక లుంటారు. అందమైన స్త్రీల అంగాంగాల సొగసు సొంపు ఉంటుంది. అసలే అక్షరాస్యులు నూటికి ముప్పైమంది. ఆ అక్షరాస్యులు విద్యలో పొందే పరిజ్ఞానం ఇది. ఇక యువత ఏమాలోచిస్తుందో మనము సులభంగా ఊహించుకోగలం.

వివాహవ్యవస్థ లోపభూయిష్ఠంగా ఉంచుకొని నైతిక విలువలన్నీ నశించి పోతున్నాయంటూ కాకిగోల చేస్తే ప్రయోజనవంలేదు. పడుపువృత్తిలో జీవించేవారు కూడా తాము ఆ వృత్తిని మనసార కోరుకోవడంలేదని, అతి బాల్య వివాహాలు, భర్తల దౌర్జన్యాలు, త్రాగుబోతుతనం, స్త్రీలోలత, వైధవ్యం, మనసులేని వివాహాలు పొట్టపోసుకునే ఆర్థిక స్థోమత లేక పోవడం కారణాలుగా చెపుతున్నారు. ఆనందకరమైన కుటుంబజీవితాన్ని ఈ ఆర్థిక వ్యవస్థ అందించ్చలేదు.

ఏటికి ఎదురీది మతాంతర వర్ణాంతర వివాహాలు చేసుకొన్న వారు ఎదుర్కొనవలసిన ప్రధానమైనది ఆర్థిక సమస్య. ఈ వివాహాలపై జరిగే

సామాజికదాడి, ఇరుపక్షాలవారు ఆ దంపతులను వేధించే వేధింపులు, ఆచార వ్యవహారాలలో, ఆహారాదులలో ఉన్న విభిన్నతలు, వీటిని సరిదిద్దుకోలేని సంస్కార శూన్యత ఇవన్నీ ప్రేమ వివాహాలను కూడ విఫలం చేయవచ్చు. అసలు వివాహాలు నూటికి ఎన్ని ఫలవంతమవుతున్నాయి అనేది ప్రశ్న. ఫలవంత మవడమంటే పురోహితుడు వేసిన పీటముళ్ళు తెగకుండా యాంత్రికంగా జీవనయాత్ర సాగించడమేనా? వ్యక్తిగౌరవ, ధైర్యసంస్కారం ఆసరాగా అక్కడక్కడా ప్రేమవివాహాలు వర్ణాంతరాలుగాని, మతాంతరాలుగాని, దేశాంతరాలుగాని సఫలమవుతూ ఉండటం చూస్తున్నాము.

ఇక వివాహపద్ధతులు; సనాతనవివాహపద్ధతిలో చేయించబడే ప్రమాణాలు 'నాతిచరామి' ఎందరు అమలు పరుస్తున్నారు? వాటి అర్థాలు ఎందరికి తెలుసు? అలాగే నూతన పద్ధతుల్లో వివాహం చేసుకొనేవారు కూడ తమ ప్రమాణాలను ఎంతవరకు నిలబెట్టుకుంటున్నారు? రీతి మారినా ప్రయోజనం శూన్యమే వివాహంలోని అసలు ఆంతర్యాన్ని గ్రహించనంతవరకు ఆచరించనంతవరకు.

మనిషి ఎప్పటికప్పుడు జీవితంలో మార్పులకు తప్పనిసరిగా గురియవడం జరుగుతుంది. విజ్ఞానం దూరతీరాలకు లేకుండా చేసిన ఈ రోజులలో ఇది మరీ సహజం. అవసరాలనుబట్టీ ఆలోచనను బట్టీ ఈ మార్పులు కొందరు భహుతక్కువమందైనా ఆహ్వానిస్తున్నారు. ఐదు రోజులు రంగరంగ వైభవాలతో బహుప్రయాసలతో జరిగే వివాహాలకు బదులు ఒక్కరోజో ఒక్కపూటో జరిగే వివాహాలు అమలులోనికి వచ్చాయి. పురోహితునికి ప్రాముఖ్యత తగ్గి ఉంగరాలమార్పిడి, సంస్కృతశ్లోకాలకు బదులు, మాతృభాషలో ప్రమాణాలు అమలులోనికి వచ్చాయి. కేవలం పూలదండల మార్పిడే వివాహచిహ్నంగా కూడా వివాహాలు జరుగుతున్నాయి. కాని, వీటిసంఖ్య చాల పరిమితం.

ఒక స్త్రీ ఒక పురుషుడు కలిసి జీవితభాగస్వాములుగా జీవించడంలో పనికివచ్చే కట్టుబాటు వివాహం. ఇందులో మత ప్రమేయం, దేవుని ప్రమేయం, అలాగే డబ్బు ప్రమేయం, ఇంకా ఇతర ప్రమేయాలు ఉండరాదు. భార్యాభర్తల మధ్య సంబంధం అతి సున్నితమైనది, మిక్కిలి బాధ్యతాయుతమైనది. స్త్రీ పురుషుల వ్యక్తిత్వాలకు సమగ్రతనిచ్చే బాంధవ్యం, సమాజానికి ఆరోగ్యాన్నిచ్చే బంధంకూడ ఇది. సృష్టి పరంపర ఇందులోని ప్రధానాకర్షణ. ఆదిమ

సమాజంలోలా మనిషి తన ఇచ్ఛవచ్చినట్లు గుంపు పద్ధతిలో జీవించలేడు. తన అవసరాలను తీర్చుకోలేడు. అతని మేధ నాటికన్నా చాల పెరిగింది. నాగరికత ఎంతో వృద్ధి చెందింది. అందుకే నేటి యువతరం ఇదంతా సమగ్రంగా ఆలోచించాలి. వివాహమంటే పిండివంటలు, వంటలు, కట్నాలు, కానుకలు, లాంఛనాలు కాదు. కేవలం స్త్రీపురుషుల ఆకర్షణా కాదు. వ్యక్తిగత, సామాజిక బాధ్యతలు ఇమిడిఉన్న జీవితాంతర సంబంధం. అందుకే ప్రస్తుతం యువత ఎదుర్కొంటున్న సమస్యలలో వివాహం కూడ ఒకటే అయినా వారికున్న అన్ని సమస్యలతో పెనవేసికొని యున్న సమస్యేగాని ప్రత్యేక సమస్యకాదు. ప్రస్తుత ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక చట్రాలలో ఈ సమస్యకు సరైన పరిష్కారం దొరకదు. అందుకే నేటి యువత కర్తవ్యం ఈ విషవలయాలను ఛేదించటం. అందుకు నిరంతర పోరాటం జరపడం.

అర్ధ ఫ్యూడల్ కాపిటలిస్టు ఆర్థిక విధానాల మిశ్రమ సంస్కృతి, మనం దిగుమతి చేసికొనే చిత్రాలలో సెక్స్ జీవిత సిద్ధాంతమని చెప్పే సంస్కృతి నేరహంతక విషబీజాలను వెదచల్లే సంస్కృతి, ధనం ప్రధాన విలువలుగా గల సంస్కృతి స్త్రీ పురుష సంబంధాలలో వివాహ జీవితంలో కావలసిన బాధ్యతాయుతమైన ప్రవర్తన నుండి దారితప్పించి చిత్రవిచిత్రమైన వెర్రితలలను కూడ వేయించుతుంది. స్త్రీ పురుషులిద్దరూ ఈ ప్రభావంనుండి తప్పించుకోలేరు. అలా అని ఈ సంస్కృతులే శరణం గచ్ఛామి అని మిన్నకుండటంకాదు. వీటిలో పోరాటం సాగించటమే నేటి యువత కర్తవ్యం. అక్షరాస్యులుగా పౌరులందరూ రూపొందటం, ఆర్థిక అసమానతలు అంతరింపచేయటం, స్త్రీ సామాజికోత్పత్తిలో పాలుపంచుకోవడం (సమభాగినిగా) జరిగిననాడే నేటి వివాహవ్యవస్థలోని బూటకాలు నాటకాలు కృతక ధర్మపన్నాలు సమసిపోగలవు.

# సెక్సు విజ్ఞానం – యువతరం

**ధనికొండ హనుమంతరావు**

మానవ జీవితంలో సెక్స్‌కు ఎంత ప్రాధాన్యత ఉన్నదనే విషయాన్ని పరిశీలించినట్లయితే – ఆకలికన్నా కూడా సెక్స్ తీవ్రమైనదనే చెప్పవలసి ఉంటుంది. పంచేంద్రియాలద్వారా కదా మనం అనుభూతుల్ని పొందుతున్నది! ఆకలి తీర్చుకునే సందర్భంలో పంచేంద్రియాలలోనూ కర్ణేంద్రియం పనిచేయదు. కాని సెక్స్ విషయంలో పంచేంద్రియాలూ పాల్గొంటున్నవి. అందుకనేనేమో కామదేవుడైన మన్మథుణ్ణి 'పంచబాణుడు' అనడం! దీన్నిబట్టి సెక్స్ ఎంత తీవ్రమైనదో తెలుస్తూనే వుంది.

సెక్స్‌ను అసహ్యించుకోవటంవేరు; దానినుంచి తప్పించుకోగలగటం వేరు; అసలు సెక్స్‌ను అసహ్యించుకోవలసిన అవసరం ఏమున్నది? సెక్స్ అంగాలే నీరుడును బహిర్గతం చేసేవి కనుక, వాటిని అసహ్యించుకోవటం జరిగింది. దానికితోడు పుట్టిననాటినుంచీ పరిసరాల్లో బహిరంగంగా సెక్సును అసహ్యించుకునే వాతావరణమే ఉండటం వల్ల, దాన్ని అసహ్యించుకుంటున్నట్లు ప్రవర్తించటం సంస్కృతికి చిహ్నమనే దురభిప్రాయం గూడుకట్టుకుంటోంది. ఐతే స్థూలంగా ఆలోచించినట్లయితే సెక్స్ ప్రాధాన్యత ఎలాటిదో చూద్దాం.

కొన్ని విషయాలు సెక్స్‌కన్నా అధికమైనవి కావచ్చు, మరికొన్ని వియాలు సెక్స్‌కన్నా అల్పమైనవి కావచ్చు, కాని సరిగ్గా సెక్స్ అనుభూతి లాటిది మరొకటి ఉండబోదు, లేదు.

అలెగ్జాండర్ గ్రహంబెల్ టెలీఫోన్ కనిపెట్టాడు. మార్కొని రేడియో కనిపెట్టాడు. థామస్ ఆల్వా ఎడిసన్ ఎలెక్ట్రిసిటీ కనిపెట్టాడు. ఇలాగే అనేకమంది మేధావులు అనేకం కనిపెట్టారు. ఐతే వీరినందర్నీ కనిపెట్టగలిగిందెవరు? సెక్స్! కనుక సెక్స్ కొత్త విషయాలను కనిపెట్టిన వారిని కనిపెట్టగలిగేది – అంటే Inventor of Inventors! అంత గొప్ప పదాన్ని విస్మరించి, తోసి పారెయ్యటం ఎలా సాధ్యం.

మన జన్మలకి కారణభూతమైన సెక్స్‌ను గూర్చి తెలుసుకోవాలనే కుతూహలం అందరికీ ఉండటం సహజం. సెక్స్‌ను ఏవగించుకోవడమంటే అందులోనుంచే జన్మించే మనలను మనం ఏవగించుకోవడమే అవుతుంది.

దాన్ని అసహ్యించుకొని దాచటం వల్ల ప్రయోజనం ఉండదు. ఎందుకు? ఎలా? అనే ప్రశ్నలే సకల విజ్ఞానాన్వేషణకు మొదలు. అవే ప్రశ్నలు సెక్సును గూర్చి వచ్చినప్పుడు మనం అసహ్యించుకుంటున్నాం - అంతకన్నా అసహ్యించుకొంటున్నట్లు దొంగవేషం వేస్తున్నాం. అంతమాత్రం చేత తెలుసుకోవాలనే కుతూహలం మాయమవదు సరికదా - పట్టుదల అధికమౌతుంది. అది సహజం. సక్రమమార్గాన సాధించలేనిదాన్ని అక్రమ మార్గాన పొందటం జరుగుతోంది. అది అనేక ప్రమాదాలకు దారితీయకమానదు.

కనుక నిజాయితీగా సెక్స్ సమస్యల్ని విశదీకరించుకోవటం అత్యుత్తమ మార్గం. కొన్ని మూర్ఖపు అభిప్రాయాలూ, సంకుచితత్వం ఇమిడివున్న మాటలూ, కేవలం కుతూహలాన్ని తగిన కారణం లేకుండానే అణచివేసే ప్రయత్నాలూ సెక్స్‌నుంచి దూరతీరాలకు తరిమెయ్యబడే ఉద్దేశాలూ నిష్ప్రయోజనాలేగాక, తప్పుదార్లను పట్టిస్తవి.

సామాన్యాభిప్రాయాల లోతూపాతూ ఎలా ఉంటవో చూద్దాం.

మొక్కకు పూవు ఏమిటి? అది మొక్క తాలూకు స్త్రీ రహస్యాంగమనీ, మానవస్త్రీ రహస్యాంగభాగాల్లాటివే దానికి వున్నవనీ, వృక్షశాస్త్రంమీది ఏ ప్రాథమిక పాఠ్యపుస్తకమైనా తెలియజేస్తుంది. మొక్కకు అది సెక్సు అంగం కనుకనే దానికే అందమూ, చందమూ, సువాసనా, ఆకర్షణా ప్రకృతి ప్రసాదించి ఉండాలి. సెక్స్‌ను ఏవగించుకునే మనం - ఆ పుష్పాలను దండలుగా గుచ్చి గొప్పవారికివేసి గౌరవిస్తున్నాం. ధరించి ఆనందిస్తున్నాం. పరమ పవిత్రమైన దేవతా విగ్రహాలను వాటితో పూజిస్తున్నాం. ఐతే పువ్వు మొక్క తాలూకు సెక్స్ అంగమనే అభిప్రాయం మనకు రావటంలేదు. ఆ అభిప్రాయాన్ని మనం విని ఉండకపోవటమే కారణం. అంతమాత్రం చేత 'నిజం' నిజంకాకుండా పోదు కదా! పోతే సెక్స్‌ను గూర్చిన అసహ్యత ఎక్కడున్నది? అసలు విషయంలో కాదు - మన తలకాయలో - మన ఆలోచనల ధోరణిలో! ఆ ధోరణికూడా మనం పుట్టి పెరిగిన వాతావరణం ప్రసాదించిందే కదా!

ఇలాటి సామాన్యాభిప్రాయాలూ, తప్పుడు notionsను వొదిలించుకోకుంటే జీవితం దుర్భరమౌతుంది. నిజస్వరూపాలు కఠినంగా వుండటం మాత్రమే కాదు - వెగటుగా కూడా వుంటవి. 'చేదునిజం' లాటిదాన్ని

దిగమింగక తప్పదు. రోగం మధురమైనది కనుకనా, మందు చేదుగాఉంటుందని విచారించేందుకు!

ఐతే సెక్స్ విజ్ఞానప్రచారం ఏవిధంగా సాగాలనే గడ్డు ప్రశ్న ఉండనే వుంది. కథలద్వారా జరిగేది బహుకొద్ది; ఆయా పాత్రల చుట్టూ అల్లిన అల్లికలో విజ్ఞానానికి తగినంత వైశాల్యం కనిపించదు. కథాశిల్పం, వైజ్ఞానిక భాగాన్ని దిగమింగుతుంది. అదీగాక సెక్స్ కథల్లో సర్వసామాన్యంగా భావోద్రేకం ఉండక తప్పదు. ఉద్రేకం ఎప్పుడైతే ఉద్భవించిందో, విజ్ఞానం అట్టడుక్కు పోతుంది.

కనుక వ్యాసాల ద్వారానే సమస్య స్వరూపాన్ని విడమరిచి, అన్ని కోణాల్లోనూ చర్చించటం ద్వారా మాత్రమే విజ్ఞానం వెదజల్లబడే అవకాశం వుంది. ఈ పద్ధతి అంతగా మింగుడు పడేది కాకపోయినప్పటికీ సరైనదనే అనాలి.

సెక్స్ ప్రకృతి శాసనం; ఏ మానవనిర్మాత శాసనం కూడా ప్రకృతి శాసనమంత తీవ్రతరంగా ఉండనేరదు. సెక్స్ పట్ల కుతూహలం ఉండటం ఎంత సహజమో. దాన్ని గూర్చి తెలుసుకోవటంలో కూడా అంత కుతూహలమూ ఉండటం సమంజసం. దాన్ని పిచ్చి పిచ్చి కారణాలతో ప్రతిఘటిస్తే, వెర్రితలలు వేసి తప్పుదార్లలో పడక తప్పదు. ఏ ఇతర విజ్ఞానాన్నైనా బోధించే పద్ధతే, సెక్స్ విజ్ఞాన బోధనకూ వర్తిస్తుంది.

సెక్స్ విజ్ఞానమ్ అనగానే రహస్యాంగాలకు మాత్రమే సంబంధించిన విజ్ఞానం అనుకోవటం శుద్ధ పొరపాటు. అది శారీరక శాస్త్రానికీ, మానసిక శాస్త్రానికీ, సృష్టి విస్తరణశాస్త్రానికీ, జీవశాస్త్రానికి, జెనిటిక్స్ మొదలైన అనేక శాస్త్రాలకు సంబంధించి వుంది. శరీరంలోనూ, జీవితంలోనూ ఒక ముఖ్య విభాగంగా ఉన్న సెక్స్‌ను విడిగా చూసి ఏవగించుకోవటం అర్థంలేని పిచ్చి ఊహ మాత్రమే అవుతుంది.

వైద్య విజ్ఞానాన్ని సాధించే విద్యార్థీ, చిత్రకళను అభ్యసించే విద్యార్థీ స్త్రీ నగ్న శరీరాన్ని పరిశీలించేప్పుడు సాధారణ ఉద్రేకాలకు గురికాడు. వాళ్ళ దృక్కోణాలు వేరు విధంగా ఉంటవి. అదే విధంగా సెక్స్ విజ్ఞాన సాధకుడు ఉద్రిక్తపడకుండా ఉండటం అత్యవసరం. బోధకుడుకూడా సాధకుని మనస్సు ఉద్రేకంవైపు మొగ్గకుండా చూడవలసిన అవసరం ఎంతైనా వున్నది.

ప్రపంచాదినుంచీ మానవుణ్ని ఉర్రూతలూపుతున్న విషయాలు రెండు. ఒకటి - మతం, రెండు - సెక్స్. ఈ సత్యాన్ని నేటి వాతావరణంలోకూడ

చూడవచ్చు. యీ రెండు విషయాల్లోనూ తప్పుదారులు తొక్కిన వారి జీవితం ఎంత దుర్భరమౌతుందో కూడా మనం గమనించవచ్చు. ఈ రెండూ కూడా మానవుని 'కామన్‌సెన్స్'ను కూడా విస్మరించేట్లు చేసి ఒక మూర్ఖునివలె ప్రవర్తించేట్లు చేయగల అత్యంత శక్తి వంతమైనవి.

ఉదాహరణకు యీ సంఘటన చూడండి. బజారులో ఒకడు మానవశారీరక శాస్త్రానికి సంబంధించిన రంగుబొమ్మలు నేల మీద పరచి, పెద్ద కర్రతో ఆయా విషయాలను విశదపరుస్తూ, బొమ్మలో సూచిస్తూ హిందీలో ఉపన్యాసం సాగిస్తున్నాడు. తెలుగులో మరొకడు అనువదిస్తున్నాడు. విషయం ఇది.

చిన్న తనంలో హస్తప్రయోగాది దురభ్యాసాలకు లోనైనవారు, సంసారిక జీవితంలో కోల్పోయిన శక్తిని తిరిగి పొందలేకపోతున్నారు. పటుత్వం కోల్పోయిన శక్తిని తిరిగి పొందలేక పోతున్నారు. పటుత్వమున్న వీర్యం వ్యయమై పోగా, కేవలం నీళ్ళవలె ఉండే వీర్యాన్ని మాత్రమే కలిగి ఉంటున్నారు - యీ మాట చెబుతూ ఒక గ్లాసులో నీళ్ళవలె ఉండే పాలను ఎత్తి చూపుతూ, కొంచెం కొంచెం నేల మీద పారబోస్తూ 'అలాటి వ్యక్తుల వీర్యం ఇలా నీళ్ళవలె వుంటుంది!' అన్నాడు.

దీని రియాక్షన్ వినేవారిలో ఎలా ఉంటుందో ఉపన్యాసకుడికి తెలుసు. దాదాపు అందరూ కాస్తో, కూస్తో హస్తప్రయోగం చేసినవారే! తమ వీర్యం నీళ్ళవలె మారిపోయి వుంటుందనీ, దాని శక్తి సామర్థ్యాలు క్షీణించినవనీ ఇంతకుముందెప్పుడూ లేని దిగులు వినేవారికి పట్టుకుంటుంది. హఠాత్తుగా మనసులో 'డిప్రెషన్' ఆరంభమౌతుంది. ఐతే ఎవరిని సంప్రదించి లేక ఎవర్ని అడిగి ఈ సందేహం తీర్చుకోవాలి? సందేహం తీరినా చికిత్స పొందటమూ, నయం చేసుకోవటమూ ఎలా? యీ విధంగా మనస్సు తపిస్తున్న సమయంలో ఉపన్యాసకుడు ఒకదారి - తేలిక దారి - అడ్డదారి చూపుతున్నాడు.

"అలాటి వ్యక్తులకు హిమాలయయోగిపుంగవుడు కనిపెట్టిన యీ గుళిక అమోఘంగా పనిచేస్తుంది. ఎవరికి ఏలాటి సందేహం ఉన్నా, ఇప్పుడే, ఇక్కడే మీ కళ్ళ ఎదుట అలాటి అనుమానాన్ని పటాపంచలు చేస్తున్నాను - చూడండి!" అని ఆ చిన్న గుళికను నీళ్ళవలె ఉన్న పాలలో పడేస్తాడు. అంతే - క్షణాలమీద ఆ నీళ్ళవలె ఉన్న పాలు గడ్డకట్టుకున్నవి. గ్లాసు తలక్రిందులుగా ఉంచినా కింద పడటంలేదు.

'సంభోగ సమయంలో యీ గుళికను బుగ్గను పెట్టుకున్న పురుషుని వీర్యం ఈ విధంగానే గడ్డకట్టుకుపోయి, శీఘ్రస్ఖలనం జరగకుండానూ, శక్తివంతంగా రాయల్లే వుంటుంది. ఖరీదు ఒక్కరూపాయి!' అని ఉపన్యాసాన్ని ముగించాడు.

అంతావిని ఎవరిదారిన వారు వెళ్ళారు, ఒక్కడూ కొనలేదు. ఇంత కంఠశోషకూ వాడు ఈ గుళికల్ని అమ్మలేకపోతే, ఇక ఆ వ్యాపారాన్ని సాగించలేడు. చిత్రం. పది నిమిషాలయ్యాక, ఒక్కొక్కడే రావటం, రూపాయి ఇవ్వటం, వెంటనే అమ్మకపుదారు ఒక గుళిక ఇవ్వటం, క్షణంలో కాతాదారు మాయమవడం జరుగుతుంది. కాతాదారు తానెవరో ఎవరికీ తెలియకూడదనే ధోరణిలో ఉంటాడు. అమ్మకపు దారుడు తన రూపాయి గుంజుకొనే తొందర్లో ఉంటాడు. కంఠశోషకు తగిన ప్రతిఫలం లభిస్తుంది. వ్యాపారం నిరాటంకంగా సాగిపోతుంది.

అసలు అలాటి 'గుళిక' అలాటి మహాత్మ్యం ఉన్నది సాధ్యం కాదనే ప్రాథమికలోకజ్ఞానం జనానికి ఉండదు. ఒకవేళ ఉపన్యాసకుడు చెప్పే విషయాలు నగ్న సత్యాలని అనుకున్నప్పటికీ - నిజంగానే వీర్యం ఘన రూపం ధరించి, రాయివలెనే రూపొందినట్టయితే, అది వెలికి రావటం ఎలా? నీరుడు విడవటం ఎలా సాధ్యం? పురుషాంగాన్ని చీల్చి, ఆ రాయిని బైటికి తీస్తేనే తప్ప బతకడే! యీ మాత్రం కామన్‌సెన్స్‌కూడా లేకుండా ఆ గుళిక ఎలా కొన్నాడు? ఎంత ఫూల్ అవుతున్నాడు!

ఈ బజారు దుకాణాలే కాకుండా పెద్ద పెద్ద మందుల కంపెనీలుకూడా సెక్స్ విషయాల్లో మానవుని బలహీనతల్ని ఆధారం చేసుకొని పెద్ద ఎత్తున వ్యాపారాలు సాగిస్తున్నవి. ఎలాగో చూద్దాం?

ఒక కంపెనీవారు లేపనశక్తికి ఒకమందు తయారు చేశారు. అది భస్మం. ఆ భస్మాన్ని సంభోగానికి పది నిముషాలముందుగా పురుషాంగం మీద చల్లి రుద్దితే, అది బిగిసి పిడివలె అవుతుందని సూచన. జనం కొంటూనే ఉన్నారు. వాడి సత్ఫలితాలను పొందుతూనే వున్నారు. ఐతే నిజం ఏమిటంటే - ఆ భస్మం లేకుండా రుద్దినప్పటికీ పురుషాంగం ఉద్దీపనమౌతుంది. అలా కాకపోతే అది నిష్ప్రయోజనమైన పురుషాంగమే అవుతుంది. ఆ కామన్‌సెన్స్ కూడా లేకుండా ఆ భస్మాన్ని కొని వాడుతున్నాడు. ఒకవేళ అది పనిచెయ్యకుంటే, ఎవరితో, ఏమని చెప్పుకుంటాడు? పనిచేస్తే తన స్నేహితుడెవడో దాన్ని వాడి మంచి

ఫలితాలు పొందాడని ఇతర మిత్రులకు సిఫారసు చేస్తాడు. ఏమైనా భస్మం తయారు చేసే కంపెనీ వారి వ్యాపారం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా సాగిపోతూనే వుంటుంది.

సెక్స్ విజ్ఞానం పేరిట వెలువడుతున్న సాహిత్యం రెండు రకాలు. ఒకటి కామప్రేరితం, రెండు విజ్ఞాన ప్రేరితం. కామ ప్రేరితమే జనబాహుళ్యం ఆదరణ పొందుతోంది. కనుక డబ్బు చేసుకునేందుకు మొదటితోవ సాహిత్యమే అత్యధికంగా తయారౌతోంది. రెండో తోవ విషయం పట్టించుకుంటున్న వారు అల్ప సంఖ్యాకులు. ఐతే జీవిత సౌఖ్యానికి అవసరమైనది విజ్ఞాన ప్రేరితమైన సెక్స్ విజ్ఞానమే.

సెక్స్ విజ్ఞానం సామాజిక జీవనం మీద ఎలాంటి ప్రభావాన్ని ప్రసరిస్తుందో చూద్దాం!

నేటి జనాభా సమస్య, దాన్ని అనుసరించే ఉద్యోగ సమస్యా, ఆహార సమస్యా మొదలైనవి - సెక్స్ విజ్ఞానానికి సంబంధించినవే కదా! ఏ కోవకు చెందినవారు, ఆ వర్గాలను పులుముకుంటున్నారు. ఉదాహరణకు రాజకీయాలవారు రాజకీయ సమస్య అంటారు. ఆరోగ్యశాఖవారు ఆరోగ్య సమస్య. ఆర్థిక శాఖవారు ఆర్థిక సమస్య అంటున్నారు మొదటికి వస్తే అది సెక్స్ సమస్యే!

ఇదే విధంగా వ్యభిచారసమస్యకూడాను. వ్యభిచారం కేవలం ఆర్థిక సమస్య మీదనే ఆధారపడిందనుకోవటం పొరపాటు. వ్యభిచారిణులందరి ఆర్థిక బాధలను తీర్చగలిగినా ప్రయోజనం లేదు. ఎందుకంటే వ్యభిచారంలో ఇద్దరు - ఒక పురుషుడు, ఒక స్త్రీ ఉండనే ఉన్నారు. అందులో స్త్రీ తాలూకు సమస్యతీరినట్లనుకుంటే పురుషుని సంగతేమిటి? స్త్రీ ప్రేరణలేకుండానే పురుషుడూ, పురుషుని ప్రేరణ లేకుండానే స్త్రీ వ్యభిచారానికి దిగటం లేదు కదా? చట్ట నిర్మాతలకూ, పోలీసు శాఖకూ సంబంధించిన సమస్య కాదిది. దీన్ని చర్చించదగినవారు - డాక్టర్లూ, మానవ మనస్తత్వవేత్తలు మాత్రమే!

ఈనాడు కొత్తకొత్త పద్ధతుల్లో ఆహారపదార్థాలు పండించే పద్ధతులన్నీ సెక్స్‌విజ్ఞానం మీదనే ఆధారపడి ఉన్నవి. అదే విధంగా ఉత్తమ పశుసంపదను చేకూర్చడంలోకూడా సెక్స్ విజ్ఞానమే ఉపకరిస్తున్నది.

నేటి నవలల్లోనూ, కథల్లోనూ, సినిమాల్లోనూ ప్రదర్శించబడేది సెక్స్

విజ్ఞానం కానేకాదు. కామప్రేరితమైనది. దానివల్ల సంఘశ్రేయస్సు జరుగుతుందనిచెప్పలేము. సందర్భానుసారంగా ఉండే సెక్స్ ఘట్టాలను నిజజీవితంతో సరిచూసుకొని, అలాటి పొరపాట్లే పడకుండా తననుతాను కాపాడుకో గలిగేందుకు మాత్రమే అవి ఉపకరిస్తవి. ఐతే కేవలం నీతి కథలు చదివినందువల్ల నీతి అలవడుతుందనేది భ్రమ! నిజ జీవితంలో ఎవరికి వారుగా తర్కించుకొని నిశ్చయించుకున్న మార్గమే అనుసరిస్తారు కాని, నీతినే అంటిపెట్టుకొని ఉండాలంటే కుదరదు.

సెక్స్ విజ్ఞానాన్ని ప్రచారం చేయటమెలా? సెక్స్ విషయాలనూ ఎంత మరుగున ఉంచాలని ప్రయత్నిస్తామో, వాటిని తెలుసుకోవాలనే ఆత్రుతను అంతగా పెంచటంగా పరిణమిస్తుంది. అలాగాక వాటిని సాధారణ విషయాలవలెనే చర్చించినట్లయితే, ఆ ఆత్రుత ఉండదు. తేలిగ్గా లభ్యమయ్యే దానికోసం అక్రమ మార్గాలను అనుసరించవలసిన అవసరం లేకుండా చేయడం అవసరం. అందువల్ల వెర్రి వెర్రి అభిప్రాయాలు ఏర్పడవు.

స్కూలు దశలోనే ఇలాంటిది ఆరంభమవటం మంచిది. జీవ శాస్త్రానికి జోడించినట్లయితే ఏ ఉద్రేకమూ కలగకుండానే సాఫీగా విజ్ఞానాన్ని అందివ్వటం సాధ్యం. నగ్న శరీరం ఉద్రేకాన్ని రెచ్చగొడుతుంది. ఐతే, వైద్య విజ్ఞాన సాధకునికి నగ్న శరీరం ఉద్రేకాన్ని రేకెత్తించదు. అతని మనస్సంతా విజ్ఞాన సాధన మీదనే కేంద్రీకరించబడటం కారణం. అదే విధంగా శారీరక శాస్త్ర విజ్ఞాన సాధకునికి సెక్స్ ఉద్రేకాలు కలగవు. అలాటి ప్రమాదం జరగకుండా ఉండే విధంగా పుస్తకాలు రాయబడాలి. చెప్పేవారికి సిగ్గుచేటుగానూ, inconvenient గానూ ఉండకుండా సాధారణ విషయం వలెనే చెప్పినట్లయితే ఏ గొడవా రాదు.

భారతీయ ప్రాచీన సెక్స్ గ్రంథాలు సెక్స్ జీవితాన్ని తృప్తిదీరా అనుభవించేందుకు ఉపకరించేవిగానే ఉన్నవి. అవి ఉద్రిక్త పూరితాలైనవి. అవి సెక్స్ విజ్ఞానాన్ని వెదజల్లటం లేదు. నిత్యజీవితానికి అవసరమైన సమస్యలను ఆ గ్రంథాలు చర్చించలేదు. ముఖ్యంగా దాంపత్య జీవితంలో ఉన్నవారికి మాత్రమే అవి ఉపయుక్తంగా ఉన్నవి. సెక్స్ సమస్యలతో లంకెలు వేసుకున్న అనేక సామాజిక సమస్యలను పరిష్కరించుకునేందుకు ఉపకరించే సెక్స్ విజ్ఞానమే ఆధునిక ప్రపంచానికి అవసరం. కనుక శాస్త్రీయమైన ఆ విజ్ఞాన సాధనకు కృషిచేయడం జీవిత సమస్యలను పరిష్కరించుకోవటమే అవగలదు.

# తరాలలో అంతరం – మనోవైజ్ఞానిక పరిశీలన

ఎస్. యాదగిరి రెడ్డి

చాలా 'ముతక' భావాలు గల నా పాతకాలపు మిత్రుడు ఒక రోజు 'గొట్టం పాయింటు', "సైడ్‌బర్న్స్" లతో ప్రత్యక్షమయ్యాడు. ఆయన వేశాన్ని చూచి "ఇదేం పోయేకాలం? ఈ అవతారం ధరించావేమి? అని ప్రశ్నించాను. ఆయన ఏడ్పుముఖం పెట్టి 'ఏం చేయాలి?' మావాడిని చూచి 'గొట్టం పాయింట్లు' పట్టించుకున్నాను. తీరా నేను అవి వేసుకున్నాక వాడు కాస్తా "బెల్‌బాటమ్స్" లోకి దిగాడు. ఎక్కడ చచ్చేది? వాడు మారిన 'స్పీడు'లో నేనెలా మారేది?" అని వాపోయాడు. ఇదీ మనం దుస్తుల విషయంలో చూస్తున్న తరాల మధ్యనుండే అంతరం.

కొన్ని యేళ్ళ క్రితం అమెరికా దేశంలోని విద్యార్థి వసతిగృహాలలో అబ్బాయిలు ఉండే రూంల లోకి అమ్మాయిలు రాకూడదని, అమ్మాయిల గదులలోకి అబ్బాయిలు రాకుడదని విద్యాధికారులు నిబంధనలు విధించినపుడు అక్కడి విద్యార్థి లోకం గగ్గోలెత్తింది. Inter Vistations (అంటే ఒకరి వసతి గృహములోకి మరొకరు వెళ్ళే సదుపాయాలు) కావాలని పెద్ద యెత్తున ఆందోళన చేశారు. ఈ విషయము యువతీ యువకులకు అట్టే ఎబ్బెట్టుగా కనబడదు. కాని ఇదే విషయం వయసు మళ్ళిన వాళ్ళకు చాలా కంగారు ఎత్తించేదిగా కనబడుతుంది. ఇదీ విభిన్నతరాలకు సంబంధించిన వ్యక్తుల దృక్కోణాలలో ఉండే భేదము. ఇక భావాల విషయంలో చెప్పనక్కరలేదు.

సుప్రసిద్ధ గ్రీక్ తత్వవేత్తయైన సోక్రటీసు తన కాలం యువకులలో విప్లవభావాలను రేకెత్తిస్తున్నాడనే నేరంపైన సమకాలీన సంఘ పెద్దలు ఆయనకు విషం పెట్టి చంపారు. ఈ శతాబ్దంలో వ్యక్తుల భావాల విషయంలో ఎన్నో మార్పులు వచ్చాయి. డార్విన్ పరిణామ వాదమూ, కారల్‌మార్క్స్ సామ్యవాదమూ క్రొత్త తరం వారిలో ఎంతో భావసంచలనం కలిగించాయి. ఈ తరం యువతీ యువకులలో ఈ మేధావుల ప్రభావానికి లొంగిపోనివారు చాలా అరుదు. కాని పైతరం వారిలో ఇంత విజ్ఞానాత్మక విమర్శనాత్మక భావాలు చాలా తక్కువ. దీనికి కారణం నూతన సాంఘిక పరిణామాలు, జీవిత సమస్యలకు

సంబంధించిన తాత్వికవాదనలు, ఎప్పటికప్పుడు అభివృద్ధి చెందుతున్న విజ్ఞాన సాంకేతిక శాస్త్రాల ప్రభావాలని చెప్పవచ్చును.

తరాలలో అంతరానికి ప్రపంచవ్యాప్తంగా ఈ రోజుల్లో విద్యార్థులలో చెలరేగిన అలజడిని కూడా ఒక నిదర్శనంగా సామాజిక శాస్త్రజ్ఞులు పేర్కొంటారు. 1968లో డిగాల్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా విద్యార్థులు లేవదీసిన "ఫ్రెంచిమిని" విప్లవము, ఇదే సంవత్సరంలో 'షికాగో' విశ్వవిద్యాలయ విద్యార్థులపైన జరిగిన పోలీసు చర్య, రవాణా టికెట్ల ధర పెరిగిందని జర్మనీ పట్టణాలలో వేలాది విద్యార్థులు నిర్వహించిన ప్రదర్శనలు మొదలైనవి విద్యార్థులలో చెలరేగుతున్న అలజడికి కొన్ని నిదర్శనాలు మాత్రమే. ఇక మనదేశం సంగతి వేరే చెప్పాలా? ప్రతిరోజూ ఏదో ఒక కాలేజిలో ఏదో ఒక గొడవ. కాలేజీలో అడ్మిషన్స్ మొదలుకొని పరీక్షలలో పాసయ్యేదాక ఏదో ఒక రకంగా విద్యార్థులు తమ దుడుకుతనాన్ని ప్రదర్శిస్తూనే వున్నారు.

ఒక విద్యాలయాల్లోనే కాదు - విశ్వవ్యాప్తంగా ఈతరానికి చెందిన పిల్లలు ప్రతి జీవిత రంగంలో పాత భావాలపై సనాతన పద్ధతులపై, అధికారంలో ఉన్న వ్యక్తులపై చివరికి తల్లితండ్రులకు కూడా వ్యతిరేకంగా తిరుగుబాటు చేస్తున్నారు. దీనికి కారణాలు ఎన్నో ఉన్నాయి. ఈ తిరుగుబాటునే మారు మాటలో 'తరాల అంతరం' అని సాంఘిక శాస్త్రజ్ఞులు వర్ణిస్తారు.

అసలు తరాల - అంతరమంటే ఏమిటి? ఇది ఆధునిక సమాజానికి సంబంధించిన దృగ్విషయమా? విద్యార్థులు, యువతీ యువకులు లేవదీస్తున్న తిరుగుబాటును బట్టి తరాలలో అంతరం వుందని చెప్పవచ్చునా? ఈ తరాల అంతరం సమాజ ప్రగతికి ఉపకరిస్తుందా? ఈ ప్రశ్నలన్నింటికి సమాధానాలను వెదికినప్పుడు మనకి విషయం చాల వరకు బోధపడుతుంది.

ఒక తరానికి మరో తరానికి మధ్య దాదాపు 20 యేళ్ళ భేదం ఉంటుందని శాస్త్రజ్ఞులు భావిస్తారు. అంటే నేటి యువతీ యువకులు ఒక తరానికి చెందిన వారైతే వారి తల్లితండ్రులు పై తరానికి చెందిన వారని చెప్పవచ్చును. ఈ ఉభయతరాలకు చెందిన వ్యక్తుల మధ్య నున్న వయో భేదాల మూలాన వీరి అనుభవాల తీరు, ప్రకటించే వైఖరులు, విలువలు, ప్రత్యక్ష,ప్రక్రియలు (Perceptual processes) అన్ని భిన్నంగా ఉండే అవకాశముంది. ఎందుకనగా వీరుభయులు, కాలమానంలో రెండు విభిన్న బిందువులకు సంబంధించిన వారు

కాబట్టి, వీటినన్నింటిని బట్టి సాంఘిక శాస్త్రజ్ఞులు, మనో వైజ్ఞానికులు తరాల మధ్య అంతరం ఉంటుందని సిద్ధాంతీకరించారు. ఈ సిద్ధాంతానికి సంబంధించిన మరికొన్ని ప్రశ్నలు మనముందు నిలుస్తాయి. తరాల మధ్య ఉండే అంతరం ఆయా వ్యక్తుల భౌతిక, శారీరక పరిణామాలను బట్టి సంభవిస్తుందా! లేదా వారి సంస్కృతి సాంఘిక వాతావరణాల బట్టి ఉద్భవిస్తుందా? వీటికి సమాధానాలు కొంతవరకు వికాసమనోవైజ్ఞానికుల (Developmental Psychologists) పరిశోధనలలో లభిస్తాయి.ఉదా: 1904లో "స్టెన్లిహాల్" అనే మనోవైజ్ఞాని తరుణవయస్సులో ఉన్న పిల్లలు అనగా 13 నుండి 24 యేళ్ళ మధ్యనున్న వారి శారీరక మార్పులను క్షుణ్ణంగా పరిశీలించాడు. ఈ మార్పుల మూలాన వారి జీవితంలో ఉడుకుతనంతో కూడుకున్న ఒడుదుడుకులు బాగా ఏర్పడుతాయని సిద్ధాంతీకరించాడు. పిల్లలు పెరిగిన కొలది రకారకాల శారీరక మార్పులకు గురిఅవుతారు. పదమూడు లేక పదునాల్గుయేళ్ళ ప్రాయంలో వీరిలో కొన్ని అకస్మాత్తు పరిణామాలేర్పడుతాయి. వీటికి ముఖ్యకారణం వారి జననేంద్రియాలు పరిపక్వదశకు రావడము - తత్ఫలితంగా అవి క్రియాత్మకం కావడం. శారీరకంగా వారెంత పెరుగుతారో మానసికంగా అంత పెరగలేరు. ఇది ఆడపిల్లల్లో మరి ఎక్కువ, తత్ఫలితంగా శారీరక మానసిక వికాసంలో బాగా తేడా లేర్పడుతాయి. ఈ తేడాలే వారిలో కొన్ని మానసిక సంక్షోభాలు కలిగిస్తాయి. మగపిల్లల్లో ప్రథమ స్ఖలనం, ఆడపిల్లల్లో 'రజస్వల' వారిని ఒక వినూత్న సంభ్రమాశ్చర్యాలతో కూడుకున్న అనుభూతికి గురిచేస్తాయి. ఇది వారి జీవితానికి మొదటి షాక్. ఈ పరిస్థితితులలో తరుణ వయస్కులు నూతన విలువలను, తమ పాత వైఖరులలో మార్పును రూపొందించుకోవలసిన అవసరం ఏర్పడుతుంది. కాని ప్రస్ఫుట విలువల వ్యవస్థను నూతన వైఖరుల సముదాయాన్ని ఏర్పరుచుకునే వరకు కొన్ని యేళ్ళు పడుతుంది. అందుకే వారు ఏది మంచో, ఏది చెడో తెలియని పరిస్థితిలో ప్రవర్తిస్తారు. ఇప్పటిదాకా హద్దుపద్దులో పెరిగిన పిల్లవాడు తమ మాటలనే 'ఖాతరు' చేయటం లేదని తల్లితండ్రులు బాధపడతారు. తమ కుర్రవాడు చెడిపోతున్నాడని, రకరకాల సావాసదోషాలకు గురిఅవుతున్నాడని వాపోతారు. తరుణవయస్కులలో కనబడే ఈ ధోరణులను తిరుగుబాటు ధోరణులని వర్ణించవచ్చును. ఈ తిరుగుబాటు ధోరణులు కొంత వరకు శారీరక పరిణామాల కారణాల వలన అయినప్పటికీ చాలా వరకు సామాజిక సాంస్కృతిక పరిస్థితుల వలన కూడా తరుణ వయస్కులలో రేకెత్తుతాయని కొందరు సామాజిక శాస్త్రజ్ఞులు

ధృవపరిచారు. ఉదాః సుప్రసిద్ధ మానవశాస్త్రజ్ఞురాలైనా (Anthropologist) మార్గరెట్ మీడ్ "అరపేష్" "ముండుగుమోరు సమెవా" మొదలగు ఆదిమజాతుల పిల్లలపై పరిశోధనల జరిపి కొన్ని విచిత్ర ప్రవర్తనల ధోరణులను వారిలో కనుగొన్నది. " అరపేష్" జాతి పిల్లలు తరుణ వయస్సులో కూడా ఏ మాత్రం మానసిక ఆందోళనలకు గురికారని, వీరితో పోల్చి చూస్తే "ముండుగుమోరు" జాతి పిల్లలు చాలా Aggressive గా ప్రవర్తిస్తారని ఆమె పరిశీలనల వలన బయట పడింది. దీని వలన ఆయా జాతి సంస్కృతి, పిల్లలను పెంచే విధానాలు వ్యక్తుల ప్రవర్తనలపై చాలా ప్రభావం వేస్తాయని చెప్పవచ్చును. అయితే నాగరిక సమాజాలని పిలువబడే పాశ్చాత్య ప్రాచ్య సమాజాలు తమ తమ 'పకడ్‌బంది" సాంస్కృతిక సామాజిక వ్యవస్థల రూపేణా తమ సంఘ సభ్యులపై చాలా నిబంధనలు పెడతాయి. కొండజాతి పిల్లలు అనుభవించినంత స్వేచ్ఛాస్వాంతంత్ర్యాలను నాగరిక జాతుల పిల్లలు అనుభవించలేరు. అందుకే కాబోలు పారిశ్రామిక సమాజాలలో తరుణవయస్కుల సమస్యలు చాలా అధికంగా ఉంటాయి. ఈ జాతులలోనే బాలనేరస్థుల సంఖ్య ఎక్కువ.

మొత్తముపై కౌమారదశ ఒక సున్నితదశ అని చెప్పాలి. ఈ దశలో పిల్లలకు మంచీ,చెడు అనే విచక్షణాజ్ఞానం తక్కువ. పై పెచ్చు వీరిలో ఉద్వేగాలు, లైంగికవాంఛలు, ప్రయోగాత్మక ప్రక్రియలు జాస్తి, క్రియాత్మక శక్తి, క్రొత్త పోకడలపై మోజు తరుణ వయస్కులలో ఎక్కువగా ఉండటం వలన వారి తల్లితండ్రుల, అధ్యాపకుల భావాలు చాలా బూజు పట్టినవిగా అగుపడతాయి. అందుకే కాబోలు క్లేట్టిజా. వై. గాసెట్ అనే సాంఘిక శాస్త్రజ్ఞుడు తక్కువ వయసు గలవాళ్ళకు భావాలు ఎక్కువ, వయసు మళ్ళిన వాళ్ళకు అధికార వాంఛ జాస్తి అని చెప్పాడు.

తరాల మధ్య అంతరానికి మూలకారణం Deceleration ప్రక్రియ అన్నాడు మరో మనోవైజ్ఞాని కింగ్స్ లీడేవిస్ ఈయన వాదన ప్రకారం పిల్లల మధ్య వారి తల్లితండ్రుల మధ్యవుండే వయోభేదం 18నుండి 20 యేళ్ళవరకు ఉంటుంది కాబట్టి ఈ ఉభయ తరాల వ్యక్తులు బిన్న బిన్న సాంఘిక, చారిత్రాత్మక, మానసిక అనుభూతులకు గురిఅవుతారు. ఈ అనుభూతులు కాలమానంలో వేరు వేరు బిందువులకు చెందినవి. కాబట్టి అవి సామ్యంగా ఎప్పుడూ ఉండవు. అంతెందుకు? ఈ క్షణంలోని అనుభూతులు మరో క్షణంలో ఉండవు. అందుకే కాబోలు " బర్గ్‌సన్" అనే పాశ్చ్యాత్యతత్వవేత్త

"నిన్నటిమనం " ఈ రోజు కాము, ఈరోజుమనం రేపు అదే ప్రకారం ఉండబోము అని చెప్పాడు. అవిరళ మార్పు మానవస్వభావానికి సహజలక్షణం. ఈ కాలాల మధ్య తేడాయే భిన్న భిన్న తరాల వ్యక్తుల మధ్య వాళ్ళ వైఖరుల విషయంలోనైతేనేమి విలువల వ్యవస్థలో నైతేనేమి అగాధాన్ని సృష్టిస్తుంది. మారుమాటల్లో చెప్పాలంటే ఈ తేడాలు లేకుండా చేయడం మనకు సాధ్యం కాని పని. అయితే ముందెన్నడు కనీ, వినీ ఎరుగనంత తేడాలు యువకులకూ మధ్య, వయసుమళ్ళిన వాళ్ళల్లో మధ్య ఈ రోజు కనబడుతున్నాయంటే వాటికి కారణాలు యింకా వున్నాయి. అందులో ముఖ్యంగా పేర్కొనదగినది అతిచురుకుగా మారుతున్న మన సాంఘిక వ్యవస్థ, విజ్ఞాన శాస్త్ర సాంకేతిక శాస్త్ర పరిణామాలు మొదలైనవి. సాంఘిక వ్యవస్థ పరిణామం చాలా వరకు విజ్ఞాన సాంకేతిక శాస్త్రప్రగతిపై ఆధారపడిఉంటుంది. ఈ ప్రగతి ఇరవయ్యోశతాబ్దిలో జరిగినంత వేగంగా ముందెన్నడూ జరుగలేదు. ఉదాః పెన్సిలిన్, క్లోరోమైసిన్, స్ట్రెప్టోమైసిన్, మొదలగు ఔషధాలను కనిపెట్టడంతో జనావళి చావురేటును బాగా తగ్గించారు విజ్ఞాన శాస్త్రజ్ఞులు. చావు రేటును తగ్గించడంలో పందొమ్మిది వందలనలభైలేక ఏభైల్లో పుట్టిన శిశువులు వారి పైతరం వారి కంటె ఎక్కువ సంఖ్యలో బ్రతుకగలిగారు. వారే ఇప్పుడు యువతీయువకులై కూర్చున్నారు. జనాభాలో వీరినిష్పత్తి చాలా ఎక్కువ. ఈ యువతీకువకుల సంఖ్యవల్లనేతేనేమి, నూతన విజ్ఞాన ప్రభావం వలననైతేనేమి ఒక యువశక్తి (Youth force) గా రూపొందారు.విజ్ఞాన సాంకేతిక మార్పుల వలన పాతతరం వారి పద్ధతులు, జీవిత విధానాలు, భావాలు, మొదలైనవి వీరికి ఎబ్బెట్టుగా, బూజుపట్టినవిగ అగుపడుతున్నాయి. ఉదాః దేవునిలో నమ్మకం, జీవితవిధానంలో మతప్రమేయం, కనబడ్డరాయికెల్లా దేవుడనే పేరు మీద మ్రొక్కడమూ మొదలగునవి వీరి దృష్టిలో చాలా తాత్కాలికం. ఇది "జెట్" యుగము, తృటి కాలములో ఒక చోటునుండి మరో చోటుకు సునాయాసంగా ప్రయాణం చేయవచ్చు. తత్పరిణామంగా ప్రపంచంలో దూరదూరంగా ఉండే దేశాలు కూడా చాలా దగ్గరై పోయాయి. ఒక దేశం వ్యక్తులు మరో దేశం వారితో కలిసే అవకాశాలు బాగా పెరిగిపోయాయి. ఒక దేశంలో భావసంచలనం వచ్చిందంటే మరో దేశంలో కూడా దాని ప్రభావం పడక తప్పదు. చైనా దేశంలో ప్రభంజనంగా బయలుదేరిన మావోవాదము, బెంగాలు లోని 'నక్సల్‌బరీ' యువతీయువకులను కదిలించింది. ఈ రోజు అది యువతీ యువకులలో నక్సలైట్ ఉద్యమంగా వేళ్ళుపాతుకొని పోయింది. వీళ్ళను చూసి పైతరంవాళ్ళు

విప్లవవాదులని, సంఘవిద్రోహశక్తులని, వట్టి భావోద్రేకులని, బెదిరిపోతున్నారు. ఇదేవిధంగా వియత్నాం యుద్ధం అమెరికా దేశపు విశ్వవిద్యాలయ విద్యార్థులను బాగా కదిలించింది. ఆ దేశపు బుద్ధి జీవులు అందులో ముఖ్యంగా యువతీ యువకులు జాన్సన్, నిక్సన్, పరిపాలనలపైన ఎంతో ఒత్తిడి తెచ్చారు. చివరికి అక్కడి యుద్ధసాంద్రతను తగ్గించగలిగారు.

సాంకేతిక విజ్ఞానాభివృద్ధితోపాటు పారిశ్రామికాభివృద్ధి బాగా పుంజుకుంది. తత్పరిణామంగా 'నగరీకరణం' (urbanisation) చాలా వ్యాప్తి చెందింది. దీనిలో పల్లెవాసులు చాలా అధికసంఖ్యలో పట్టణాలకు తరలిపోతున్నారు. ప్రతికుటుంబంలో ఆడ, మగ భేదం లేకుండా విద్యావకాశాలు పెంచుకుంటున్నారు. ఉద్యోగాలలో పరిశ్రమలలో, వ్యాపారాలలో చేరిపోతున్నారు. ఒకప్పుడు అత్యధిక సంఖ్యలో వ్యవసాయంపై ఆధారపడివున్న మనదేశమే స్వాతంత్ర్యం వచ్చిన తరువాత రక రకాల రంగాలలోకి తనదృష్టిని మళ్ళించింది. తత్ఫలితంగా ఉమ్మడికుటుంబం విచ్ఛిన్నం చెందడమూ. బాల్యవివాహాలలో మార్పులు రావడమూ మొదలగుపరిణామాలతో పాటు వ్యక్తులలో నూతనవైఖరులు రావడమూ సహజం. యువతీయువకులలో ఈ వైఖరులు బాగా వచ్చాయి. కాబట్టి వీళ్ళ దృక్పథాలు పై వారి దృక్పథాలకంటే చాలా విభిన్నంగా ఉంటున్నాయి. ఈ దృక్పథ అగాధాన్ని తరాల అంతరంగా వర్ణిస్తారు సాంఘిక శాస్త్రజ్ఞులు.

తరాల అంతరానికి మరో కారణం మనోవిజ్ఞానశబ్దజాలంలో చెప్పాలంటే ఉన్నత పదవులలో వున్న పెద్ద తరం వ్యక్తులలో సునిశిత శక్తి సన్నగిల్లడం. ఇది ముఖ్యంగా విద్యాలయాల్లో చూస్తున్న విషయం. ఏదో ఒక సమస్యపై విద్యార్థులు, పై అధికారులదృష్టిని మళ్ళించాడానికి ప్రయత్నించడమూ, వాళ్ళు దాన్ని చేపట్టకపోవడమూ, యువతీయువకులు ధ్వంసప్రకాండకు దిగడమూ అప్పుడు గాని వాళ్ళు వినకపోవడమూ నేడు మన విద్యావ్యవస్థలో పరిపాటి అయిపోయినవి. దాదాపు ఇదే పరిస్థితి ఏ సాంఘిక రంగంలోనైనా కొద్ది తేడాలతో కనబడుతుంది. మన విద్యావిధానం గురించి ఎన్నో విమర్శలు వచ్చాయి. కాని ఇప్పటికీ ఆంగ్లేయులు తమ స్వప్రయోజనాల కవసరమయ్యే విధంగా రూపొందించిన వ్యవస్థనే తు.చ.తప్పకుండా పాటిస్తున్నాము. "కాపీ" కొట్టడమూ మొదలగు సమస్యలు మన విద్యావిధానం ఎంత కుళ్ళిపోయిన వ్యవస్థో చూపిస్తున్నాయి. ఒక పరీక్షల్లోనే కాదు -తరగతులలో కళాశాల ఆవరణలలో విద్యార్థుల తిరుగుబాటుధోరణులు కొల్లలుకొల్లలుగా కనిపిస్తున్నాయంటే దీనికి ముఖ్యకారణం మన విద్యావిధానంలో, తదనుగుణంగా సాంఘికవ్యవస్థలో మార్పులు తీసుకురాకపోవడమే. ఈ విధంగా మార్పుచెందని

పాతవైఖరులతో కరుడుగట్టుకపోయిన సమాజవ్యవస్థ, పై తరం వారి మధ్య ఈతరం వారిమధ్య పెద్ద అగాధాన్ని సృష్టించిందని చెప్పడంలో అతిశయోక్తి లేదు. అమెరికా మొదలగు పాశ్చాత్యదేశాలలో యువలోకం "హిప్పీ" "బీట్నిక్స్" మొదలగు ఉద్యమాల ద్వారా తమకు ఎక్కువ స్వేచ్ఛ కావాలని కోరుతున్నారు. ఈ ఉద్యమాలు ఎంతవరకు వాంఛనీయమో, ఎంతవరకు కాదో చెప్పడం కష్టం. మొత్తానికి పాతవిలువలపై క్రొత్తవిలువలదాడి ఈ రకా రకాల ఉద్యమాల ద్వారా ప్రస్ఫుటమౌతూఉందని చెప్పవచ్చును.

తరాల అంతరం సమాజ ప్రగతికి ఎంతవరకు ఉపకరిస్తుందన్న ప్రశ్నకు రెండు రకాల జవాబులున్నాయి. సమాజంలోని ఛాందసధోరణులను విమర్శించి వాటిని మార్చే అంతవరకు యువలోకపు కృషిని శ్లాఘించవచ్చును. కాని యువతీయువకులు అవలంబిస్తున్న ప్రతి వైఖరీ ఉపయోగకరమని చెప్పడానికి వీలు లేదు. ఉదా: ఆరాధన భావాలు ఉండరాదంటారు. తార్కికంగా ఇది పుష్టికరమైన వాదనే. మనిషిలో తన స్వశక్తిపై విశ్వాసాన్ని పెంపొందించే వైఖరి ఇది. కాని ఆరాధన ఉండరాదని చెప్పి, దేవుళ్ళస్థానంలో రాజకీయ నాయకులనో, సినిమాహీరోలనో ఆరాధించడం మంచి పోకడేమీ కాదు. వేలం వెర్రిగా ఏ సినిమా చూస్తే ఆ సినిమా లోని నాయికానాయకుల్లా పిచ్చి పిచ్చి వేషాలు వేయడం అన్ని విధాల వాళ్ళను నిత్యజీవితంలో అనుకరించడం చౌకబారు తనానికే దారితీస్తుందిగానీ నిర్మాణాత్మక కార్యక్రమాలవైపు మన యువతీయువకుల దృష్టిని మళ్ళించదు. సాహిత్యంలో, పఠనా పద్ధతులలో కూడా ఈనాటి యువతీ యువకుల వైఖరి అంత శ్లాఘనీయంగా లేదమో అనిపిస్తుంది. చౌకబారు సినిమా సాహిత్యం, ఉద్వేగాలు కలిగించే సెక్సు పుస్తకాలు వారి ఆలోచనాశక్తిని క్షీణింపచేస్తాయేగాని మెరుగుపరచడం లేదు. అందరు యువతీయువలకులలో ఈ అలవాట్లే ఉన్నాయని చెప్పడం కష్టం. మొత్తంపై సంఘ విద్రోహక శక్తులను, సంఘానికి ఉపయోగపడని భావాలను ప్రతిఘటించే వరకు ఈతరం వారిని అభినందించవచ్చు. అది మానవజాతి చరిత్రలో ప్రతి యువతరం వారు ఏదో ఒక మోతాదులో చేస్తున్నపనే.

నేటి యువతీ యువకులు, సుప్రసిద్ధ గ్రీక్ రాజకీయ శాస్త్రజ్ఞుడు అరిస్టాటిల్ చెప్పిన " The young love honour and victory more than they love money which indeed they love verty Itiile, not having yet learnt what it mean s to be without it". అనే మాటలకు అనుగుణంగా ప్రవర్తిస్తే ఏ సమాజానికైనా వారొక నిర్మాణాత్మక శక్తిగా వెలుగు స్తంభాలుగా నిలిచిపోతారు.

# యువత – జాతీయత

**కసిరెడ్డి వెంకటరెడ్డి**

తరాలు మారుతున్నాయి. తిలక్, గాంధీ, నేతాజీల్లాంటి నేతలు కనిపించడంలేదు. అయినా సగటుమనిషికి భవిష్యత్తు మీద ఆశచావలేదు. భారతీయాభ్యుదయసాధనిర్మాణానికి జాతీయతనే పునాదిగా స్వీకరించి, ఈ దేశయువత పయనిస్తుందన్న స్వామి వివేకానందుని బోధలు ఉత్సాహాన్ని నింపుతూనే ఉన్నాయి. భారతీయ సమాజం కుల,వర్ణ, వర్గ, ప్రాంత, భాషాదిబేధాల్ని వదలి ముందుకు నడవాలని వివేకానందుల భావాత్మక, దృక్పథం, సావర్కర్ సంస్కార దృక్పథం, డాక్టర్జీ నిర్మాణ దృక్పథం, అంబేద్కర్ పోరాట దృక్పథం ... ఈ దేశ జనతను చైతన్యం దిశగా నడిపిస్తూనే ఉన్నాయి. ముఖ్యంగా యువతకు వీరితో పాటు, తిలక్, స్వామిరామతీర్థ, స్వామిశ్రద్ధానంద, గాంధీజీ, అరవిందులు, దయానందులు, నేతాజీ, భగత్సింగ్, చంద్రశేఖర్ ఆజాద్, ప్రకాశం పంతులు, వీరేశలింగం, అల్లూరి సీతరామరాజు ప్రభృతులెందరో స్ఫూర్తినందిస్తూన్నారు. భారతమాత ఆర్తి తీరుస్తున్నారు.

తెలుగుకవుల్లో "దేశమును ప్రేమించుమన్నా" అని గురుజాడ సూటిగానే చెప్పాడు.

" ఏదేశమేగినా ఎందుకాలిడినా
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనినా
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండు గౌరవము ... "

– అని రాయప్రోలు చెప్పడం వెనుక ఈ జాతీయతా ప్రబోధమే ఉంది. ఇక్కడ జాతి అంటే భారతజాతే; జాతీయత అంటే భారతజాతీయతే. కరుణశ్రీ ఆ అర్థంలోనే ఈ ప్రయోగం చేశారు.

" చచ్చిన జాతికాదు, మరి చావదు వేయి యుగాలకైనా, వె
న్నిచ్చిన జాతికాదు, పరులెత్తు విరోదిని బిల్చి, కౌగిటన్
గ్రుచ్చిన జాతిరా! యిది మరుత్తరు శాఖలతోడ హాయిగా
అచ్చన కాయలాడుకొనె రా! మనకీర్తి లతామ తల్లికల్ "

భారతీయుడు ఒకరికి పెట్టిన వాడే గాని, ఒకరిని కొట్టినవాడు కాదు. కడుపు చేతపట్టుకొని వచ్చినవారికందరికి ఆశ్రయమిచ్చాడు. అది విశాల

దృష్టితో చేసిందే. అది బలహీనతగా ప్రపంచం ముద్రవేసింది. ఆశ్రయం పొందిన జాతులు ఇక్కడ అధిపత్యం చలాయించాయి. భారతీయతను అణచిపెట్టాయి. అప్పుడు తన అస్తిత్వం నిమిత్తం పోరాడవలసి వచ్చింది. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం జరిగిన 1857 లోనే మంగళ్‌పాండే లాంటి కొంత మంది వ్యక్తుల తొందరపాటు కారణంగా స్వాతంత్ర్యం రావడంలో 90 సం॥ల ఆలస్యం జరిగింది. ఈ మధ్యకాలంలో నిరంతర సంఘర్షణ జరిగింది యువత ఏదిశలో పయనించాలి అనే అంశం మీద భారతీయ మేధావులెందరో సూచనలు చేశారు. భారతయువజనుల్ని, ప్రభోదిస్తూ ఈ కాలంలో శాశ్వత స్ఫూర్తి ప్రదాతగా స్వామి వేవికానందులే నిలిచారు.

" భారతదేశము లోకమును జయింపవలయును. నాగమ్యార్థము అంతకు తగ్గునది కాదు. ఇది చాలా గొప్పదిగా కాన్పింపవచ్చును. కాని నిజమ్మునకు అది అంతటిదే. మనము ప్రపంచమును జయించియే తీరవలయును. వికాసమును పొందవలయును; చైతన్యమును ప్రకటింపవలయును; లేదా పతితులమై మురిగి చావలవలయును. ఇంతకన్న మార్గంతరము లేదు. బ్రతుకుటో లేక చచ్చుటో, రెంటిలో ఒక దానిని నిర్ణయంచుకొనుడు ... "

వంటి మాటల ప్రేరణతోనే భారతజాతీయత పునర్వికసించింది. " అసలు తరతరాలనుంచీ నిత్యనైమిత్కి నిషేద కామ్య కార్యక్రమల్లో " ..... జంబూద్వీపే , భరతవర్షే, భరత ఖండే.... " అని చెప్పుకోవడంలో. స్నానం చేస్తూ, తింటూ, ఆడుతూ, పాడుతూ ఉత్పత్తి కళాసేవాక్షేత్రాల్లో పనిచేస్తూ గంగేచయమునే చైవ ..... అని నదుల్ని స్మరించడంలో అయోధ్యా మధురా మాయా ... " అంటూ నగరాల్ని నెమరువేసుకోవడంలో జాతీయత సుదృఢమైంది.

తనదేహాత్మల్ని ఏవిధంగా ప్రేమిస్తాడో తన దేశాన్ని ఆవిధంగా ప్రేమించడమే జాతీయత. యువత ఈ జాతీయతను ఎలా పెంపొదించుకోవాలి ? ఇక్కడ పుట్టిన ఉత్తమ గ్రంథాల్ని పరిరక్షించాలి. మహాపురుషుల్ని మన్నించాలి. దురాచారాల్ని నిర్మూలించాలి. సదాచారాన్ని ప్రతిష్ఠాపించాలి.; సర్వజీవుల్లోనూ తన ఆత్మనే దర్శించాలి.దానిని భారతీయత్మతో అభేదంగా చూసే దృష్టిని అలవరుచుకోవాలి. భాషలు, ప్రాంతాలు వేర్వేరుగా ఉన్నా అంతటా ఏకసూత్రంగా ఉన్న భారత

జాతీయాత్మను గుర్తించి సంఘటన నిర్మాణంచేయాలి. ఇక్కడ పుట్టిన కళల్లో జాతీయాత్మను ప్రతిష్ఠాపించాలి., ప్రచారం చేయాలి. సామాజిక రంగంలో సాహిత్యరంగంలో, ఆర్థికరంగంలో, రాజకీయరంగంలో, ధార్మిక జీవనంలో ఉత్పత్తి క్షేత్రంలో, సేవా క్షేత్రంలో, వైజ్ఞానిక రంగంలో అంతటా జాతీయాత్మ వికసించాలి. ఆ వికాసం దృష్టితోనే యువత ఎదగాలి. ఇదే జాతీయ తత్త్వం, ఇదే జాతీయ తత్త్వవిష్కారణ, ఇదే జాతీయ ఆత్మ ప్రతిస్థాపనం. నేడు దేశం,జాతీ వంటి అనేక అంశాలను గురించి యువత సరియైన అవగాహనను ఏర్పరుచుకొనకపోతేవారిని తప్పుదోవపట్టించేందుకు కాచుకొని ఉన్న వారి కుట్రలకు అవకాశాన్ని ఇచ్చినట్లవుతుంది.

మనది భారతదేశం, పూర్వం అజనాభా, ఆర్యావర్తమన్నారు. ఆ తర్వాత హిందూదేశమన్నారు, ఇప్పుడా పదాన్ని వికృతి చేసి " ఇండియా " అని ఇంగ్లీషులో అంటున్నారు. కాని ఈ రెండు పేర్లతో పాటు "హిందు" పేరు కూడా కొనసాగుతూనే ఉంది. పేరు ఒకటే ఉంటుంది. ఒక భాషలో ఇండియా అనీ మరోబాషలో 'భారత్' అని ఉండదు.

ఇదంతా భారతమే అని ఈ ప్రాచీన శ్లోకం చెబుతుంది.

"ఉత్తరం యత్సముద్రస్య, హిమాద్రేశ్చైవ దక్షిణమ్
వర్షంతత్ భారతంనామ, భారతీయాత్ర సంతతిః॥ "

సముద్రానికి ఉత్తరాన ఉన్నదీ, హిమాలయాలకు దక్షిణాన ఉన్నదీ అయిన ఈ దేశం భారతం, ఇక్కడ ఉన్న వారు భారతీయులు.

యువత ఆ భావనతో ముందంజ వేయాలి. అయితే ప్రాంతాలున్నాయి, భాషలున్నాయి, వర్ణాలున్నాయి, వర్గాలున్నాయి కదా అంటే అందులోని ఏకతను స్వీకరించి ఆఏక సూత్రంతో వీటినన్నింటిని ముడి వేసి నడవాలనే సమాధానము . ఈ విషయాన్ని ప్రస్తావించిన ఈ క్రింది శ్లోకాన్ని చూడండి -

" మృత్పిండ ఏకో బహుభాండ రూపః, సువర్ణ మేకం బహు భూషణాని!
గోక్షీర మేకం బహు ధేనుజాతం, ఏకైవ జాతిః ఖలు భారతీయాః॥ "

మట్టి ఒకటే, కాని కుండలెన్నో రకాలు, బంగారం ఇకటే కాని ఆభరణాలనేకవిధాలు, పాలు ఒకేరంగు కని గోవులనేక వర్ణాలు, అదే విధంగా భిన్న ప్రాంతాలవారయిన, మతాల వారయిన భారతీయులందరొక్కరే. ఇదే జాతీయత అవుతుంది.

## అఖండ భారతం మన ఆదర్శం

అఖండ భారత భావనతో, ఈ దేశాభ్యుదయానికి యువత కృషి చేయాలి. దానికి భారత జాతీయతే పునాదికావాలి.

బ్రిటీషువారితో పోరాడి మనం స్వాతంత్ర్యం సంపాదించుకున్నాం. జాతీయాత్మే ఆ పోరాటానికి మూలమయ్యింది. ఆనాటి నేతాజీ 'జైహింద్' బంకిం - అరవిందుల 'వందేమాతరం' నినాదాలు జాతీయాత్మవికాసానికి తారకమంత్రాలయ్యాయి. జైహింద్ అంటే హిందూదేశానికి జాతికి ధర్మానికి, సంస్కృతికి, హిందూత్వానికి జయమగుగాక! వివేకానందులు, తిలక్, స్వాతంత్ర్య వీరసావర్కర్ డాక్టర్జీ, ప్రభృతులు ఎందరో ఆ పదాల్ని ఈ అర్థంలోనే ప్రయోగించారు. దేశమాతకు వందనమంటున్నది వందేమాతరం. ప్రాచీనమైన ఈ భావన మళ్ళీ జ్వాజ్వల్యమానమయింది. ఈ దృష్టితోనే అరవిందులు, శ్రీమాత అఖండ భారతదర్శనం చేశారు..

కాని స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఈ జాతీయతను ఆ అఖండ భావాత్మక చైతన్యాన్ని దెబ్బతీసే ప్రయత్నాలు కొన్ని జరిగాయి. ప్రాంతాలపేరిట తెలుగుతల్లులు కన్నడమాతలు పుట్టుకొచ్చారు. ప్రాంతీయాభిమానము తప్పేమి కాదు. కాని అది దురభిమానంగా మారితే దేశ అఖండతకు ప్రమాదం ఏర్పడుతుంది.

దేశంలో ఈనాడు ప్రత్యేక విదర్భ, ప్రత్యేక కాశ్మీరు, ప్రత్యేక తెలంగాణ, తదితర ఉద్యమాలు ప్రారంభమయ్యాయి. కొన్ని ప్రాంతాల్లోని కొందరు ఏమాత్రం దేశ సమగ్రత మీద దృష్టి నిలుపకుండా ప్రత్యేక ఉద్యమాలు నిర్వహించారు. యువత ఈ ప్రత్యేకోద్యమాలఉద్దేశాల వెనుక ఉన్న వేర్పాటువాదాన్ని ఖండించాల్సి ఉంది. స్వస్థాన వేషభాషాభిమానాలు ప్రకటించవచ్చు. కాని దాని పేర దేశ సమగ్రతకు గండికొట్టే ప్రయత్నం చేయకూడదు. ఇది దృష్టిలో ఉంచుకొని అందరిలో జాతీయాత్మ ప్రతిష్ఠాపనానికి కృషి చేయాలి.

## సంస్కృతం జాతీయ చైతన్య వాహిక

ఆయా ప్రాంతాల్లో యువతకుండే దృష్టే భాష విషయంలో ఉండాలి. తమిళనాడులో చెలరేగిన హిందీ వ్యతిరేకోద్యమం దేశాన్ని కుదిపివేసింది. ఓ సందర్భంలో తమిళులు భారతదేశంనుండి వేరయిపోతామన్నారు.

అదేవిధంగాసిక్కుల గురుముఖి, లిపికి అంత ప్రాధాన్యం ఇవ్వక అక్కడ పంజాబి హిందీ భాషీయులు దురబిమానంతో వ్యవహరించినందుకు సిక్కులు కూడా మిగతా పంజాబీ హిందువులతో అరకొర ప్రేమతో వ్యవహరిస్తున్నారు.

మాతృభాషాభిమానం, ఎవరమూ కాదనం కావి ఏ విషయంలోనూ దురభిమానం ప్రేరేగడం సమంజసంకాదు. ఒక భాషవారు మరో భాషమీద ఉన్న తాత్కాలిక క్రోధంలో అంగ్లాన్నే నెత్తికెక్కించుకొని ఊరేగుతామనడం ఎంత మాత్రం సమంజసంకాదు. ఈ విషయంలో యువత సంయమనంతో వ్యవహరించాల్సిఉంది. మాతృభాషాభివృద్ధి జరగాలి. మనకొక అనుసంధానభాషగా హిందీని స్వీకరించాలి. అంతర్జాతీయ రంగంలో వ్యవహారానికి ఇంగ్లీషును స్వీకరించవచ్చు. దేశభాషల మధ్య ఆదాన ప్రదానాలు జరిగే ప్రణాళికలను అమలుపరచాలి.

ఇన్నింటికి మధ్య సంస్కృతాన్ని జాతీయాత్మగా అభివృద్ధిపరచాల్సిన అవసరముంది. "జనని సంస్కృతంబు సకలభాషలకును ....." అనీ " జనని సమస్త భాషలకు సంస్కృత భాష ధరాతలంబునన్" అనీ మనం చెప్పుకొంటూనే ఉన్నాం. 'జాతీయాత్మ' అంతకంటే పెద్దమాటే.

అయితే ఈ విషయంలో కూడా సంస్కృతాన్ని దూషించే విదేశీ ఇజాల బానిసబుద్ధులు మన భాషాసమైక్యానికి ద్రోహంచేస్తూనే ఉన్నారు. వారు సంస్కృతాన్ని పురోహితుల భాష అని, మత భాష అని, అభాండం వేస్తారు. నిత్యకర్మానుష్ఠానంలో మంత్రాలున్నంత మాత్రంలో గంగవెఱ్ఱులెత్తిపోయి భారతీయ భాషలకు ధాతుపుష్టినందిస్తున్న సంస్కృతాన్ని నిందించడం సమంజసం కాదు. ఈ విషయంలో భాషా ద్రోహులు జాతీయసమైక్యతాశక్తిని విచ్ఛిన్నం చేయాలని సంస్కృతాన్ని నిందిస్తున్నారని గ్రహించాలి. ఇవా ప్రపచంలో సంస్కృతాన్ని ఎవరిదీ కానిదిగా చేయాలనే ప్రయత్నాలన్నీ నిరోధించాలి. సంస్కృతాన్ని పకారాత్మక దృష్టితో స్వీకరించడం జాతీయతా వికాసానికి దోహదం చేస్తుంది.

ఆ భాషలోని సర్వ విజ్ఞాన , వేదాంత, సాంస్కృతిక గ్రంథాల్ని ప్రపంచం ఆహ్వానిస్తున్న సందర్భంలో- భారతీయులు తమ అమరభాషను జాతీయ సమగ్రతకు ఉపయోగించుకోవడంలో ముందంజ ఏయాలి. అక్కడక్కడ, యువతలో నిర్మాణమవుతున్న ఈ భావజాలాన్ని ఇంకా పరిపుష్టం చేయాలి.

## అంతరాలను మాన్పే మందు

భారతీయ సమాజంలో వృత్తులన్నీ కులాలయ్యాయి. ఈ కులాల మధ్య సంఘర్షణలు అప్పుడప్పుడు జరుగుతూనే ఉన్నాయి. కులాన్ని బట్టి ఉచ్చనీచభావాలు కూడా బలపడ్డాయి. అస్పృశ్యత సాంఘికఅసమానత్వం చోటు చేసుకుంది. ఇది దూరం కావాలంటే రక్తసంబంధమే శరణ్యం అన్నారు డా॥ అంబేద్కర్. అందువల్ల కులాంతర, వర్ణాంతర వివాహాలు కావాలి. అప్పుడే భారతీయ సమాజం బలపడుతుంది.

## జాతీయత లేని అంతర్జాతీయత లేదు

సమాజంలో వ్యక్తి ఒంటరి కాడు. వ్యక్తి సమస్త సమాజానికీ సరిగా చెప్పాలంటే మానవులందరికీ కేంద్ర బిందువు. అతని చుట్టూరా కొన్ని అవిచ్ఛిన్న వలయాలున్నాయి. మొదటిది కుటుంబం; ఆతర్వాతది, సమాజం; అతర్వాతది జాతి. ఆ వ్యక్తి సంస్కారవంతుడైతే ఇవన్నీ సుసంపన్నంగా వెలుగుతాయి. అందుకే వ్యక్తిని సంస్కారవంతంగా తీర్చిదిద్దే అనేక కార్యక్రమాల్ని యువత చేపట్టాలి. అయితే ఈ పనులన్నింటికీ జాతీయత కేంద్రబిందువు కావాలి. జాతీయత పరమాధారంగా స్వీకరించినప్పుడు తాను చేస్తున్న పని తన భారతజాతి శ్రేయస్సు కుపయోగపడాలనే పరమ శ్రేయస్సు మీద అతని దృష్టి నిలిచి ఉంటుంది. ఈ దృష్టితో పయనించే యువత నిర్మాణం జరగాలని స్వామి వివేకానందులు అభిలషించారు. దీని నుండి వసుధైక కుటుంబ భావన వైపు మనిషి ఎదుగగలుగుతాడు. ఇందులో విజయాన్ని సాధించలేక అంతర్జాతీయత అని మొత్తుకొంటే, , ఉట్టి కెగురలేనమ్మ స్వర్గాని కెగసినట్లవుతుంది. ఇంటిని దిద్దుకోలేనివాడు ఇంటర్నేషలిజాన్ని గురించి మాట్లాడినట్లుంటుంది.

అందుకే సమాజంలో ఏకత సాధించడానికి జాతీయతా భావ సూత్ర బంధాలు అనుబంధాలు కావాలి. నాది "భారత జాతీయత, దీనికి భిన్నంగా వ్యవహరించను" అనుకొన్ననాడు చీలికలుతేవాలనీ, కులభేదాలు సృష్టించాలనీ ఎత్తులు వేసే వారి ఎత్తులన్నీ చిత్తయిపోతాయి.

భారతీయ కళల్లో ఆదినుండీ జాతీయాత్మ ప్రతిబింబిస్తూనే ఉంది. ప్రపంచంలో ఆ కారణంగానే వాటికి గుర్తింపు ఉంది. లేకపోతే "కోటి కోతుల్లో ఇదో బోడి కోతి" మాదిరి అయ్యేది. తన ప్రత్యేకత భారతీయతే.

ఆ కారణంగానే అపూర్వశిల్పాలు, అపూర్వ చిత్రాల ఆవిర్భావం జరిగింది. రసాత్మకమైన సాహిత్యం కూడా ఈ దృష్టిలో తక్కువేం తినలేదు.

కమ్యూనిజం భారతీయ సంప్రదాయ కళల్ని తిట్టి పోసి తన అక్కసు తీర్చుకొంది. యువతను భారతీయ కళలకు వ్యతిరేకంగా తీర్చిదిద్దాలని ప్రయత్నించి విఫలమయ్యింది. రష్యా - చైనాల వెంట యువకళాకారులు నడిచేలా చేయాలని ప్రయత్నం చేసి అది బోర్లాపడింది. జాతీయాత్మ కళలకు ప్రాణమని యువత గుర్తించి ముందుకు వస్తుంటే అదొ డిల్లపోయింది. నాటి నుండి నేటి వరకు సజీవ కళానిర్మాణానికి జాతీయతే స్ఫూర్తి నిచ్చిందనేది ఇవాళ అందరూ గుర్తిస్తున్నారు.

ఈ భూమి నాది, ఈ తత్త్వం నాది, ఈ గ్రంథాలునావి. ఇక్కడపుట్టిన మహానుభావులందరూ మా పూర్వీకులు - అనే భావనే జాతీయత. ఏనాటినుంచో ఎందరికో ఈ భావనే ప్రేరణ నిచ్చింది. వ్యక్తి వికాసానికి, కుటుంబ కళ్యాణానికి, సమాజ శ్రేయస్సుకు, దేశశ్రేయస్సుకు, తద్వారా విశ్వ శ్రేయొస్సుకు ఈ భావనే పరమాధారం.

దేశం ఆర్థికంగా వికసించాలన్నా, శిష్ట రాజకీయాలు ప్రబలితం కావాలన్నా, సమాజం అభ్యుదయ పథంలో నడవాలన్నా,ఉత్పత్తి రంగం ద్విగుణీకృతంగా వస్తువుల నందిచాలన్నా, సేవా ధర్మం విస్తృతీకరించాలన్నా, సర్వజనులు సుఖంగా ఉండాలనే భావం బలపడాలన్నా జాతీయతే మూలం.

ఉదాహరణకు జాతీయ సాహిత్య సృష్టిని కోరే భారతీయ రచయితల్ని మతోన్మాదుల కింద వారు చూస్తున్నారు. కాని వారి పార్టీల వాళ్లు ముస్లిం మతోన్మాద పార్టీలతో అధికార దాహంతో కుమ్మక్కవుతారు. అదేమంటే లెనిన్ చెప్పిన " స్ట్రాటజీ" అంటారు.

ఒక ప్రక్క రష్యా-చైనాలు కూడా జాతీయతను ప్రబోధిస్తున్నాయి. కాని భారతదేశంలోని వారి వత్తాసుగాళ్లయిన విదేశీ భక్త శిఖామణులు జాతీయత అంటే చాలు నిప్పుతొక్కిన కోతులవుతున్నారు.

ఇవాళ యువత ఈ బూటకపు నినాదాల్ని, ఈ వక్రభాష్యాల అంతరంగ పుటాలో చనల్ని అర్థం చేసుకొంది. ఏ దేశం లోని సాహిత్య సృష్టికైనా జాతీయతే పరమాధారమని గుర్తించింది.

ఆ కారణంగానే "చందన్ హై ఇస్‌దేశ్‌కి మాటీ, తపోభూమి హర్‌గాంవ్ హై,

హర్ బాలా దేవికీ, ప్రతిమా, బచ్చా, బచ్చా రాం హై." అని పాటలు గట్టుకొని దేశమంతా పాడుకొంటున్నారు. బాలబాలికల్లో యువతీ యువకుల్లో తమ అస్తిత్వం జాతీయతలోనే ఉందనే అభిప్రాయం తీవ్రంగా బలపడింది. జాతీయత లేకుంటే మనమే లేము అన్న దృష్టి ప్రబలంగా వ్యాపించింది. ఇవాళ తుమ్మలవారి ఈ క్రింది పద్యాన్ని పరమ ప్రమాణంగా నేటి యువత స్వీకరిస్తుంది.

" దేవుడన మాతృదేశము
దేవతలన ప్రజలు; యజ్ఞ దీక్ష యనంగా
సేవా వ్రత నిష్ఠయ ఇవి
జీవన సూత్రములుగా ప్రసిద్ధింగొనుమా!"

ఈ దేశయువత ఈ దీక్షతో నడుంకట్టి నిలిచింది.

" ఇది నీ మాతృ ఋణమ్ము తీర్చుకొనుమోయీ వేడి రక్తమ్ముతో
ఇది నీకగ్ని పరీక్ష దీక్షగొనుమోయీ క్షాత్ర విస్ఫూర్తితో
ఇది కర్తవ్యము నీకు నిల్వబడుమోయీ కర్మ వీరుండవై
ఇది నీజీవిత లక్ష్య మందుకొనుమోయీ విల్లు శత్రుంజయా!"

ఇది కరుణశ్రీ రచించిన విజయశ్రీలో కృష్ణభగవానుడు విజయుణ్ణి ప్రబోధిస్తున్నప్పటి పద్యం. నిజానికి ఈ ప్రబోధం భారతీయ యువకుడికే.

# యువత – క్రీడారంగము

**రాజీ ప్రసాద్**

సమకాలీన క్రీడారంగ చరిత్రలో భారతదేశపు స్థానం ఏమాత్రమూ గర్వించదగ్గది కాదు. కేవలం క్రికెట్‌నే దృష్టిలో పెట్టుకుని చూస్తే మనం నిస్సందేహంగా గర్వించవచ్చు. ఐతే మిగిలిన క్రీడలలోను భారతదేశం అంతర్జాతీయ పోటీలలో పాల్గొంటున్నది. నిన్నటి వరకూ హాకీలో మనం అగ్రస్థానంలో నిలిచాము. ఈ రోజున చేజారిపోయిన ఆ అగ్రస్థానం అందుకొనడం కలలోని విషయము అయిపోయింది. అథ్లెటిక్స్‌లో మిల్ఖాసింగ్‌కి వారసుడు కనిపించడము లేదు. ఒక్క టెన్నిస్‌లో మటుకు కృష్ణన్ పేరు నిలబెట్టగలడనిపిస్తున్న విజయ్ అమృత్‌రాజ వుండడము మన అదృష్టం. షటిల్ బాడ్మింటన్‌లో ప్రకాష్‌ల మీద మనం ఆశ పెట్టుకోవచ్చును. చెదురు మదురుగా ఒక తార కనిపిస్తున్నా ధృవతార మటుకు కనిపించడము లేదు. ఇది మన క్రీడారంగానికి పట్టుకున్న దారిద్ర్యం.

ఎక్కడ వుంది లోపం ?
మనలోనే వుంది లోపం.

జనాభాలోగాని వైశాల్యంలోగాని భారతదేశం కన్నా చిన్నవయిన దేశాలు ఏవిధమయిన వనరులు వసతులు లేని దేశాలు ఒలంపిక్ ఛాంపియన్లను సృష్టిస్తున్నాయి. సిగ్గుపడుదామా? గర్వపడుదామా?

భారతదేశంలో క్రీడల అభివృద్ధికి అమలులో వున్న పథకాలు గాని, క్రీడాకారులు తమ స్థాయి మెరుగుపరచుకొనడానికి ఆచరణలో పెట్టుతున్న విధానం గాని తృప్తి కలిగించడము లేదు. ఈ రోజున మన యువతరంలో గల మీద ఆసక్తి కలగడం లేదు. యవతరానికి క్రీడల మీద ఆసక్తి కలిగించడానికి ప్రయత్నము జరగడములేదు. క్రీడా స్థలాలు నానాటికి కరువవయి పోతున్నాయి.క్రీడా పరికరాల వెలగూతూ అధికంగా పెరిగిపోతూఉంది. యువతరాన్ని ఒక నిర్లిప్తత ఆవహించింది. క్రీడలని జీవనాధారంగ తీసుకొనడానికి మన యువకులు సాహసించడము లేదు. అంతర్జాతీయ పోటీలలోపాల్గొన్న మన క్రీడాకారులను, వారి అవసరం తీరిపోయాక, దేశం దిక్కు లేని స్థితి లోకి దిగజారుస్తోంది. మన క్రీడాకారులకు బ్రతుకు తెరువు కరువయిపోతుంది.

నిన్నకాక మొన్న స్వాతంత్ర్యరజతోత్సవాలు ఘనంగా జరుపుకున్న భారతదేశ క్రీడా రంగ చరిత్ర ఇది.

ఈసందర్భంలో, రాజకీయాలతో ప్రమేయం లేకుండా, క్రీడారంగములో ముందడుగు వేసిన దేశాల గురించి ఆ దేశాలు ముండడుగు వేయడానికి దోహదం చేసిన పరిస్థితుల గురించి తెలుసుకోవడం మనకి అవసరం.. పౌరుల ఆరోగ్యమే దేశ సౌభాగ్యానికి మూలమని తలచిన దేశం రష్యా. వ్యాయామానికి, క్రీడలకి సోవియట్ యూనియన్‌లో జాతీయ ప్రాముఖ్యం కల్గించబడింది. పౌరుల ఆరోగ్యం కొరకు చేయబడిన ప్రాథమిక శాసనంలోని 49వ ప్రకరణం ప్రకారం వ్యాయమానికి, క్రీడలకి సోవియట్ యూనియన్‌లో ప్రాధాన్యం లభించింది. ఒక ట్రాక్ అండ్ ఫీల్డ్ పోటీలలో క్రీడాకారులను తీర్చి దిద్దడానికే విశేషానుభవం గడించిన 10,000 శిక్షకులు సోవియట్ యూనియన్‌లో వుండడము మనకి ఆశ్చర్యం కలిగించవచ్చును. క్రీడలు అభ్యసించే పాఠాశాలలో కాక కర్మాగారాలలోను, కర్షక క్షేత్రాలను క్రీడలకు ప్రత్యేక వసతులు రష్యాలో కల్పించబడ్డాయి.

అంతర్జాతీయ రంగములో విజయాలు సాధించిన క్రీడాకారులకు సోవియట్ః యూనియన్‌లో గర్వించదగ్గ రీతిలో సత్కరిస్తారు. అక్కడ పాఠశాలలు, క్రీడారంగణములు క్రీడాకారుల పేర్లమీద వెలుస్తున్నాయి. ప్రాథమిక దశనుంచి పాఠశాలలో వ్యాయమ విద్య ముఖ్యాంశము.. ఇతర పాఠ్యాంశ అంశములలో అత్యుత్తమయిన మార్కులు వచ్చిన విద్యార్థి గూడా క్రీడారంగములో వెనుకబడిన రష్యాలో ఉత్తీర్ణుడు కాలేడు. శాస్త్రీయ పద్ధతిలో శిక్షణా విధానం అమలుపరుస్తూ పౌరుల ఆరోగ్యానికి, సంపూర్ణ జీవనానికి దోహదం చూపే ప్రణాళికలు రష్యా రూపొందించింది. క్రీడా స్థలాలు, క్రీడా పరికరాలు ఉచితంగా ఉపయోగించుకునే అవకాశం రష్యాలోనే వుంది.

మన దేశంలో దేశానికంతటికి ఒకే ఒక జాతీయ క్రీడా శిక్షణాలయం వుండగా, రష్యాలో మారుమూల గ్రామాలలోనూ మొదటి తరగతి శిక్షణాలయాలు వున్నాయి.

తూర్పు జర్మనీలో క్రీడా స్థలాలు లేని పాఠశాలలు అన్నవే లేవు. విద్యారంగములో ప్రాథమికదశనుంచి క్రీడలు తప్పని సరి. శరీర ఆరోగ్యము తూర్పు జర్మనీలో అతి ప్రధానమయిన విషయం. ప్రభుత్వం పౌరులను ప్రోత్సహిస్తుంది. అన్ని వసతులు సమకూరుస్తోంది. ఆ విషయాలు - లేక -

కఠోర సత్యాలు మనకి 'ఎర్ర'గా కనిపించవచ్చు.

ఐతే క్రీడారంగములో ఒక దేశం సాధించగల అభ్యున్నతి ఆ దేశము వేసుకున్న క్రీడా ప్రణాళికల మీద, వాటి ఆచరణ మీద ఆధారపడివుందని విశదమవుతుంది. మరి మన దేశంలో పరిస్థితులు అందుకు భిన్నంగా వున్నాయి. యువతరాన్ని మన ప్రభుత్వం చీకటిలోకి నడిపిస్తోంది. రేపటి పౌరులయిన నేటి బాలల విషయంలో మన ప్రభుత్వం ఏ విధమయిన శ్రద్ధాసక్తులు కనిపించడము లేదు. భవిష్యత్తుని ఆరోగ్య సోపానాలు ప్రభుత్వం కట్టడం లేదు. ఆర్థిక స్థోమత ఉన్న కొందరు భారతీయ యువకులు ప్రత్యేక శిక్షణ స్వీకరించి పాటీలలో పాల్గొని విజయాలు సాధిస్తున్నారు. వీరు అంతర్జాతీయ స్థాయి నందుకోనే సరికి దేశం వీరిని తమ 'సొంతము' చేసుకుంటున్నది. అంతవరకూ వారు వేసుకున్న పునాదులు తమ స్వంత ఖర్చు మీద వేసుకున్నవే.

మరొక విషయం. 1969లో నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పోర్ట్స్ (పాటియాల) కు చెందిన డా॥ మాథూర్ జరిపిన సర్వే వలన మన యువకులు పోషకాహారం లేక క్రీడారంగములో ముందడుగు వేయలేక పోతున్నారని విశదమయింది. ప్రోటినులు గల ఆహారం తీసుకోగల స్తోమత ఈ దేశంలో ఎంతమందికి వుంది? రేపటి ఛాంపియన్లను గుర్తించి వారికి సకల సదుపాయాలు కల్గించవలసిన బాధ్యత మన ప్రభుత్వానిది కాదా? క్రీడారంగములో గణనీయమయిన విజయాలు సాధించిన భారతీయ క్రీడాకారుడు తన భవిష్యత్తు గురించి బాధపడనసరం లేదని ప్రభుత్వం హామీ ఇవ్వదా?

ప్రస్తుతానికి మన క్రీడాకారుడు చీకటి లోంచి వెలుగులోకి వచ్చే రోజు ఇక ఎంతో దూరంలో లేదని ఆశిద్దాం.

## ఆధునిక భారత నిర్మాణానికి యువత పునరంకితం కావాలి

# 'యువత' సదస్సులో

# శ్రీ స్వామి రంగనాథానంద ఉద్బోధ

తాళ్ళపల్లి మురళీధరగౌడ్

భారతీయసంస్కృతికి ప్రతినిధిగా నిల్చి, అంతర్జాతీయంగా ప్రఖ్యాతి గాంచిన వివేకానందుని సందేశాలు ప్రతియువకుడు విధిగా ఆలోచించాలని, ఆయన ప్రబోధాలనుంచి స్ఫూర్తిని పొంది ఆధునిక భారత నిర్మాణానికి యువత పునరంకితం కావాలని స్థానిక రామకృష్ణ మఠం అధిపతి శ్రీస్వామి రంగనాథానంద అన్నారు. గత ఆదివారం (1985 ఫిబ్రవరి 10వ తేదీ) ప్రగతి మహా విద్యాలయ ఆవరణలో యువభారతి, ప్రగతి మహావిద్యాలయం సంస్థల సంయుక్త ఆధ్వర్యంలో అంతర్జాతీయ యువజనోత్సవ (1985) సంవత్సరోత్సవాల సందర్భంగా ఏర్పాటు చేయబడిన 'యువత' సదస్సులో ముఖ్య అతిథిగా స్వామి పాల్గొన్నారు. భారతీయుల్లో ఈర్ష్యా ద్వేషాలు పెరిగాయని, సాంఘిక దురాచారాలు రూపుమాపడానికి యువత నడుం బిగించాలని ఆయన పిలుపు నిచ్చారు. నేటి యువతరం చౌకబారు సంస్కృతికి అలవాటు పడుతున్నదని, వారిని ప్రగతి పథంలో పయనింపజేయడానికి తిరిగి శిక్షణ గరపవలసిన ఆవశ్యకత ఎంతైనా వుందని ఆయన అభిప్రాయపడినారు.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ గుజరాతి సమాజ్ అధ్యక్షులు శ్రీ టోకర్షి లాల్‌జీ కపాడియా తమ ఉపన్యాసంలో దేశ ప్రగతి యువతీయువకుల భుజ స్కంధాలపై వుందనీ, వారు తమ బాధ్యతలను జాగ్రత్తగా నిర్వహించాలనీ కోరారు.

శ్రీ మాడభూషి అనంతాచార్య ప్రస్తావన కావించగా, శ్రీమతి కృష్ణకుమారి ప్రార్థన కావించారు. ప్రగతి మహా విద్యాలయ ప్రిన్సిపాల్ శ్రీ ఎన్.టి. వేదాచలం సభకు స్వాగతం పలికారు. యువభారతి అధ్యక్షులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి తమ సంస్థ కార్యక్రమాలను వివరిస్తూ సమకాలీన సాహిత్యాన్ని అర్థం చేసుకుంటే తప్ప సమాజాన్ని అర్థం చేసుకోలేమన్నారు. కడచిన రెండు దశాబ్దాలుగా పాతకొత్తల మేలు కలయికతో ఉత్తమ సాహిత్యాన్ని

తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి అందించడానికి ఉద్యమించిందని అన్నారు. సమాజాన్ని నడిపించే బాధ్యత యువతపై వుందని దేశానికి సేవ చేయాలనే దృక్పథం కూడా-యువతకు ఉండాలని తెలిపారు.

ప్రగతి మహావిద్యాలయ కరస్పాండెంట్ శ్రీ రాందాస్ జె. షా, తమ విద్యా సంస్థ విద్యారంగానికి చేస్తున్న కృషిని వివరించారు. శ్రీ గుజరాతీ ప్రగతి సమాజ్ ఏర్పాటు చేసిన 'ప్రగతి ప్రకాశన్' సంస్థను శ్రీ స్వామి రంగనాథానంద ప్రారంభించారు. యువభారతి ప్రచురణల ఛాయాచిత్రాల ప్రదర్శనను ప్రగతి మహా విద్యాలయ అధ్యక్షులు శ్రీ ఎస్.టి. వేదాచలం ప్రారంభించారు. ఇందులో యువభారతి కడచిన 21 సంవత్సరాలలో ప్రచురించిన వందకుపైగా ప్రచురణలను, యువభారతి సభల ఛాయాచిత్రాలను ప్రదర్శించారు. 'యువత' సదస్సుకు ప్రధాన పత్రాన్ని సమర్పించిన గుంటూరు హిందూ కళాశాలలో సంస్కృతాంధ్ర విభాగం అధ్యక్షులు డా॥ ప్రసాదరాయ కులపతి యువత సదస్సు ప్రాధాన్యతను వివరించారు. యువతీ యువకులలో నానాటికి దిగజారుతున్న విలువలపై విచారం వ్యక్తం చేశారు. యవజనులలో రావలసిన మార్పులను సూచించారు. శ్రీ ఎస్.వి. ప్రభాకరరావు కృతజ్ఞతలు తెలిపారు.

మధ్యాహ్నం రెండవ సమావేశానికి శ్రీ ప్రసాదరాయ కులపతి అధ్యక్షత వహించారు. - సామాజిక రంగంలో ప్రధాన పాత్రని శ్రీ టి. హరిహర శర్మ, సాంస్కృతిక రంగంలో శ్రీ రాజారామదాసు, విద్యా, సాహిత్య వైజ్ఞానిక రంగాలలో డా॥ అక్కిరాజు రమాపతిరావు, ఆర్థిక ఉద్యోగ రంగాలలో డా॥ ఎస్. శారద, 'సాహితీ సంస్థలు - యువత'రంగంలో శ్రీ వాకాటి పాండు రంగారావు, జాతీయ సమైక్యత - రాజకీయ రంగాలలో శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు - ప్రధాన పత్రాలను సమర్పించారు. పై గోష్ఠులకు వరుసగా శ్రీ జి. ఎస్. వరదాచారి, డా॥ పరిమళా సోమేశ్వర్, శ్రీ పరాంకుశం దామోదరస్వామి, డా॥ ఎస్. శారద, శ్రీ పి.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి, డా॥ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు - అధ్యక్షత వహించారు. శ్రీ ఎం.సి. వెంకన్న, శ్రీమతి కె.బి. లక్ష్మి, తాళ్ళపల్లి మురళీధరగౌడు, శ్రీ కె. ఈశ్వరప్రసాద్, ఎస్. వెంకటేశ్వరరావు, శ్రీ కె.వి. అచలపతి గోష్ఠులకు సమావేశకర్తలుగా వ్యవహరించారు. అనేకమంది ప్రతినిధులు ఆయాగోష్ఠులలో, ఉత్సాహవంతంగా, చైతన్యవంతులుగా పాల్గొని యువతీయువకుల సమస్యలను చర్చించడమే కాకుండా పరిష్కార మార్గాలను కూడా సూచించారు. దీనిని బట్టి యువతరం భవిష్యత్తు ఆశాజనకంగానే

వుంటుందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

అంతకు క్రితం శ్రీ ఎ. నాగేశ్వరరావు ప్రస్తావన కావించగా, చివర కె. ఈశ్వర ప్రసాద్ కృతజ్ఞతలు తెలిపారు.

సాయంకాలం జరిగిన ముగింపు సమావేశానికి అధ్యక్షత వహించిన అధికార భాషా సంఘం అధ్యక్షులు డా॥ సి. నారాయణరెడ్డిగారు మాట్లాడుతూ విద్యారంగంలోనూ, సామాజిక రంగంలోనూ అంతరాలను న్యూనతాభావాన్ని పోగొట్టలేని పరిస్థితుల్ని ప్రస్తావించారు. రాజకీయాల్లో కొరవడుతున్న క్రమశిక్షణే అన్ని రంగాల్ని కలుషితం చేస్తున్న దశనుంచి యువతరం జాగృతమై కీర్తికోసం కాక గుర్తింపుకోసం సమాజ ప్రగతికోసం కృషి చేయాలన్నారు. ముఖ్య అతిధిగా పాల్గొన్న రాజ్యసభ సభ్యులు ఆచార్య సి. లక్ష్మన్న మాట్లాడుతూ రానున్న కాలంలో వచ్చే సమస్యలకు యువత ఇప్పుడే పరిష్కారాలను ఆలోచించుకోవాలని అన్నారు. యువతపై గురుతర బాధ్యత వుందని దేశసమైక్యత సౌభాగ్యాన్ని కాపాడాలని విజ్ఞప్తి చేశారు. ఇరవయ్యొకటవ శతాబ్దం పూర్తిగా యువశకం కాబోతున్నదని గుర్తుచేశారు.

సంస్థ సమావేశకర్త ఆచార్య వి. విశ్వనాథం భావి కార్యక్రమాలను గురించి వివరించారు - మొదట శ్రీ ఎం. చెన్నప్ప ప్రస్తావన కావించగా, శ్రీమతి రవీంద్ర ప్రార్థన కావించారు. కార్యదర్శి శ్రీ వై.వి. వివేకానందం చివర కృతజ్ఞతలు తెలిపారు. జంటనగరాల్లోని వివిద కళాశాలలనుండి దాదాపు 500 మంది ఈ సదస్సులో ప్రతినిధులుగా పాల్గొన్నారు.



'యువత' గోష్ఠిని నిర్వహించటంలో సహకరించిన శ్రీ ప్రగతి మహావిద్యాలయ నిర్వాహకులకు, విశేషించి ప్రిన్సిపాల్ శ్రీ వేదాచలంగారికి, సదస్సులలో పాల్గొని పత్రాలను సమర్పించి, చర్చించిన విద్వాంసులందరికీ, జంటనగరాల కళాశాలలనుండి వచ్చిన అధ్యాపక ప్రతినిధులకు, ఎన్నో రకాలుగా సహాయపడిన విద్యావేత్తలకూ, యువభారతీయులకు కృతజ్ఞతలు. అందరూ ఒకయెత్తు పూజ్యులు శ్రీ స్వామి రంగనాధానంద, ఆచార్య సి. నారాయణరెడ్డిగారలు ఇద్దరూ ఒకయెత్తు. ఎందరో మహానుభావులు అందరికీ యువభారతి కృతజ్ఞతలు తెలియపరుస్తున్నది.

**- ఎస్. వెంకటేశ్వరరావు, కార్యదర్శి**

# యువభారతి
# రజతోత్సవ సభ్యత్వం

యువభారతి ఇరవై అయిదేళ్ళుగా సాగిస్తున్న సాహిత్యోద్యమం, సమాజంలో కలిగిస్తున్న సాహితీ చైతన్యం మీకందరికీ పరిచయమే. తెలుగు సాహిత్యంలోని ఉత్తమ విలువలను సామాన్య ప్రజానీకానికి సన్నిహితంగా తీసుకొని రావాలని వివిధ కార్యక్రమాలను, ప్రచురణలను యువభారతి నిర్వహిస్తున్నది. 1990 విజయదశమి నుండి 1991 విజయదశమి వరకు రజతోత్సవాలను జరుపుకొంటున్నది.

యువభారతి ఇప్పటికి 130 ప్రచురణలను ప్రజలకందించింది. రజతోత్సవాల సందర్భంగా ఇరవైఅయిదు ప్రచురణలు వెలువరించాలని యత్నిస్తున్నది. ప్రతినెలా మొదటి ఆదివారంనాడు నిర్వహించే 'సమాలోచనం'లో సాగే వక్తల ఉపన్యాసవ్యాసాలు కూడా త్వరలో గ్రంథరూపంలో వెలువడనున్నాయి. ఒక రజతోత్సవ సంచిక రూపు దిద్దుకొంటున్నది.

యువభారతి రజతోత్సవ సభ్యులుగా చేరండని అందరినీ ఆహ్వానిస్తున్నాం. 1991 డిసెంబరు నెలాఖరులోగా రూ॥ 100/-లు చెల్లించి రజతోత్సవ సభ్యత్వం తీసుకొన్నవారు 1995 చివరిదాకా యువభారతి ప్రచురణలపై 40 శాతం తగ్గింపు పొందవచ్చు. రజతోత్సవ సంచిక ఉచితం. (పోస్టులో పంపగోరేవారికి పోస్టేజి ప్రత్యేకం).

రజతోత్సవ సభ్యులుగా చేరి యువభారతి సాహిత్యోద్యమానికి చేయూత నివ్వండి!

ఎస్. వెంకటేశ్వరరావు
కార్యదర్శి

జి.వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు

# యువభారతి - ప్రచురణలు

యువభారతి ఇంతవరకూ 130 ప్రచురణలను వెలువరించింది. అవన్నీ మీరు తప్పకుండా చదవండి; మీ గ్రంథాలయంలో ఉంచుకోండి. ముఖ్యంగా -

- సంకలన గ్రంథాలు

  రచన - ('మారుతున్న విలువలు - రచయితలు' గోష్ఠి సందర్భంగా -37 వ్యాసాల సంకలనం)

- **మహతి** - (స్వాతంత్ర్యయుగోదయంలో తెలుగు తీరుతెన్నులు - నూర్గురు ప్రముఖుల సమీక్షావ్యాసాలు)

- **మందార మకరందాలు** - బమ్మెరపోతన భాగవతంలోని మన్నికైన పద్యాలకు డా॥ సి. నారాయణరెడ్డి గారి రసమయ వ్యాఖ్యానం)

- **వేమన వేదం** - ప్రజాకవి వేమన పద్యాలకు ఆరుద్రగారి వ్యాఖ్యానం.

- **లహరులు** - కావ్యలహరి, వికాసలహరి, ప్రతిభాలహరి, రామాయణ సుధాలహరి, కవితాలహరి, నవోదయ లహరి, నవ్య సాహిత్య లహరి, వ్యాససాహితీ సంహిత మొదలైనవి.

- **కవితావైభవాలు,** ప్రజాసూక్తం, నాగొడవ, భావన, తెలుగు నవల, చలం ఆలోచనలు, భారతీవైభవం, కిరణాలు - కెరటాలు, గోరా శాస్త్రీయం, సాహిత్యాధ్యయనం మొదలైనవి.

- **Telugu Novel,** Vol. I, Free India Forges Ahead, etc.

- **రజతోత్సవ ప్రచురణలు**

  1. ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం (1980 - 1990), వ్యాస సంకలనం
  2. శ్రీ రామాయణకల్పవృక్షము. శబరి - శ్రీ జి. కుమారస్వామి నాయుడు
  3. పరిశోధన పద్ధతులు - డాక్టర్ ఆర్వియస్. సుందరం
  4. ఋతు సంహారము (కావ్యము) - డాక్టర్ తిరుమల కృష్ణ దేశికాచార్యులు
  5. కలంతో కాలమ్ (వ్యాస సంకలనం) - ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం
  6. కిన్నెరసాని పాటలు - వాక్యప్రయోగ వైచిత్రి - శ్రీమతి వారణాసి (జి.ఎస్.) లక్ష్మి రవీంద్రనాథ్.

**గమనిక :** యువభారతి రజతోత్సవ సభ్యులుగా చేరిన రచయిత/(త్రు)ల రచనలను 'సెల్ఫ్ ఫైనాన్సింగ్ స్కీం' క్రింద యువభారతి ప్రచురించి విక్రయిస్తుంది. వివరాలను యువభారతి కార్యాలయంనుండి తెలుసుకొనండి. మీకు యువభారతి స్నేహహస్తాన్ని అందిస్తున్నది.

**- కార్యదర్శి**

